DACTARAMMA

By

N. Bharathidevi



*First Edition ;*

JULY 1980

*Cover Design :*

TRIGUN



*Publishers ;*

NAVARATNA BOOK CENTRE

Eluru Road, Vijayawada-2

*Printers :*

SEETA RAMA

Vijayawada-3

*Price :*

Rs. 10.00

# మా నూతన ప్రచురణలు

బంగారు సంకెళ్ళు
కళ్యాణి
వెలిగించిన దీపాలు
విరిజల్లు
కర్పూర కళిక
దాంపత్య నౌక
రాగవాహిని
కీర్తి రథం
అనాఘ్రాతపుష్పం
బహుదూరపు బాటసారి
దాంపత్యాలు
సౌందర్య
డాక్టరమ్మ
ప్రేమబంధం
ట్రీట్ మెంట్
భిన్నస్వరాలు
సంసార సుఖం
అంతిమ క్షణాలలో అక్బర్
గమ్యం చేరని బాటసారులు
ప్రేమారాధన
మధిరిమ
స్వయిరిణి
సౌఖ్యజ్వాల
చిగురించిన జీవితాలు
చెరవిడిన హృదయాలు
చివరి మజిలీ
వెండి వెన్నెల
దిగంతాల కావల
కప్పులేని కొంపలు
తుషార ప్రతిమ
అంతం చూసిన ఆపది
ఆశాతరంగాలలో ప్రేమనౌక
కుంకుమ రేఖ
జీవనమాయ
రెక్కలొచ్చిన చిలక
మధుకీల
ఓ తల్లి కథ
రాగతరంగం
ఆశల హరివిల్లు
రాగస్రవంతిలో రాతిబొమ్మ
అహమా! నువ్వెన్ని మెట్లెక్క గలిగావ్
నీకీవారసత్వంవద్దు
తీరం చేరిన తొలికెరటం
చీకటి పడిన సూర్యుడు
పూర్ణ

**తప్పక చదవండి !**

# డాక్టరమ్మ

సాయంత్రం అయిదు గంటలయింది. ఆఫీసులో నుంచి బయటకు వచ్చాడు. రాజేష్ అప్పుడు గుర్తుకు వచ్చింది అతనికి ఇంటిదగ్గర వాణికి జ్వరంగా ఉందన్న విషయం వెంటనే స్కూటరు స్టార్ట్ చేశాడు. పదినిముషాలలో రాజేష్ స్కూటరు అతని ఇంటి ముందు ఆగింది.

స్కూటరు శబ్దానికి, పక్క పోర్షనులో నుంచి వచ్చిన బేబీ, రాజేష్‌ను చూసి "అంకుల్ మీరు ఆఫీసుకు వెళ్ళిం తర్వాత, ఆంటీకి జ్వరం ఎక్కువయింది. మమ్మీ ఆంటీని విజయా నర్సింగ్ హోముకు తీసుకు వెళ్ళింది. మీరు రాగానే మిమల్ని అక్కడకు రమ్మని చెప్పింది మమ్మీ" అని చెప్పింది.

"ఆంటీని హాస్పటల్‌కు తీసుకెళ్ళి ఎంత సేపయింది బేబీ? "జారిపోతున్న ధైర్యాన్ని కూడదీసుకుంటూ అడిగాడు రాజేష్.

"గంటవుతుంది అంకుల్. మీరు త్వరగా వెళ్ళండి."

"ఇప్పుడే వెళుతున్నా బేబీ." అంటూనే స్కూటరు స్టార్ట్ చేశాడు రాజేష్

రాజేష్ పదిహేను రోజుల క్రితమే హైద్రాబాదు నుంచి ట్రాన్స్‌ఫర్ మీద విజయవాడ వచ్చాడు. ఇంకా, విజయవాడలోని వీధులవీ పూర్తిగా తెలియవు రాజేష్‌కు. విజయా నర్సింగ్ హోము వెతుక్కుంటూ వెళ్ళేసరికి అరగంట పట్టింది. గేటు బయట స్కూటరు ఆపి లోపలకు వెళ్ళాడు.

గదిలోనుంచి బయటకు రాబోతున్న బేబీ వాళ్ళ అమ్మగార్ని చూసి, ఆ గదిలోకి వెళ్ళాడు రాజేష్.

మంచంమీద స్పృహ లేకుండా పడుకుని ఉంది వాణి.

"డాక్టరుగారు ఏమన్నారు? వాణిని పరీక్ష చేశారా? ఏం భయంలేదని చెప్పారా?" ఆదుర్దాగా ప్రశ్నల వర్షం కురిపించాడు రాజేష్.

"ఇంతకు ముందే, డాక్టరుగారు పరీక్ష చేసి, ఇంజక్షన్సు ఇచ్చి వెళ్ళారు. జ్వరతీవ్రతలో, అలా మగతగా ఉంది. ఏం భయంలేదన్నారు." అని చెప్పింది బేబీ అమ్మగారు కమల.

"సమయానికి వాణిని హాస్పటల్‌కు తీసుకువచ్చారు. థాంక్స్ అండీ."

"నాలుగు గంటల టయములో, వాణికి జ్వరం బాగా ఎక్కువయింది. ఆ కంగారులో మీకు ఫోన్ చేయాలన్న ఆలోచన కూడా రాలేదు. నాకు. ఈ నర్సింగ్

హోము మా ఫ్యామిలీ డాక్టరుగారిది. వెంటనే వాణిని ఇక్కడకు తీసుకు వచ్చాను."

"రెండు రోజుల నుంచి జ్వరంగా ఉంటుంది వాణికి. మామూలు జ్వరమేగా తగ్గిపోతుందిలే అనుకుని ఆఫీసుకు వెళ్ళాను. ఇంటికి రాగానే, ఈ విషయం బేబీ చెప్పింది. వెంటనే ఇక్కడకు వచ్చాను."

"ఇక నేను ఇంటికి వెళతానండీ. బేబీ వాళ్ళ నాన్నగారు కూడా ఊళ్ళోలేరు. చీకటి పడింది. బేబీ భయపడుతుందేమో. నేను వెళ్ళి, బేబీని తీసుకుని ఒక గంటలో వస్తాను." అంది కమల.

"అలాగేనండీ," అన్నాడు రాజేష్. కమల వెళ్ళింది. వాణి మంచానికి దగ్గరగా కుర్చీ లాక్కుని కూర్చున్నాడు.

వాణి మగతగా నిద్రపోతుంది. కుర్చీలో వెనక్కువాలి కళ్ళు మూసుకున్నాడు రాజేష్.

"సార్" అన్న పిలుపుకి ఉలికిపాటుగా కళ్ళు తెరిచి చూశాడు రాజేష్. ఎదురుగా స్టాఫ్ నర్స్ నిలుచుని వుంది. "అయిదు నిముషాలు మీరు బయటకు వెళ్ళండి. డాక్టరు గారు, పేషెంటును చూడటానికి వస్తున్నారు. డాక్టరుగారు వచ్చినప్పుడు, ఇక్కడ మగవాళ్ళు ఉండటానికి వీల్లేదు."

"అలాగా!" అంటూ గదిలోనుంచి బయటకు వచ్చి వరండా చివరకు వెళ్ళి నిల్చున్నాడు రాజేష్. ఆ వరండాకు ఆనుకుని దాదాపు ఇరవయ్యి గదులున్నాయి. అన్ని గదుల్లోనూ పేషెంట్సున్నారు.

హాస్పటల్ వాతావరణాన్ని పరిశీలిస్తూ, ముందుకు నడుస్తున్నాడు రాజేష్. నాలుగు వైపులా చుట్టూ పెద్ద ప్రహారీగోడ. ఒకవైపున గోడకు పెద్దగేటు ఆ కాంపౌండులో రెండు బిల్డింగులున్నాయి. ఒక బిల్డింగ్, ఇరవయ్యి చిన్న చిన్న గదులతో, పేషెంట్సు ఉండటానికి వీలుగా కట్టబడి ఉంది. ప్రతిగదిలోనూ పేషెంటుకు ఒక మంచం, ఆ మంచానికి దగ్గరగా చిన్న ఇనుప ఉయ్యాల, ఒక ఫేముకుర్చీ చిన్న బీరువా ఉన్నాయి.

పేషెంట్సు ఉండే బిల్డింగ్‌కు ఎదురుగా మరో బిల్డింగ్ ఉంది. డాక్టరుగారి, కన్సల్టింగ్ రూము ఆ బిల్డింగ్‌లో వరండాలో వరండాకు ప్రక్కగా ఉంది. వరండాలో ఉన్న బెంచీల నిండా, పేషెంట్సు కూర్చుని ఉన్నారు. ఆ కాంపౌండులో ఉన్న ఖాళీస్థలం అంతా రక, రకాల పూల మొక్కలతో నిండిఉంది. వాతావరణం ప్రశాంతంగా ఉ ది పరిసరాలను పరిశీలిస్తూ వస్తున్న రాజేష్ ఎదురుగా స్టెతస్కోప్ పట్టుకుని వస్తున్న డాక్టర్ని చూసి, కరెంట్ షాక్ తిన్న మనిషిలా చలనం లేకుండా కొయ్యబారిపోయాడు. ఆతని మెదడు ఆలోచించటానికి కూడా శక్తి లేనట్టుగా మొద్దుబారిపోయింది.

రాజేష్‌ను చూసిన డాక్టరు, అదేమీ గమనించనట్టుగా, తల వంచుకుని రాజేష్ ముందు నుంచే తన కన్సల్టింగ్ రూమువైపు వెళ్ళింది.

ఆ షాక్ నుంచి తేరుకోవటానికి రాజేష్‌కు పది నిముషాలు పట్టింది. నిద్రలో నడుస్తున్న మనిషిలా నడుస్తూ వచ్చి, వాణి ఉన్న గదిలో కూర్చున్నాడు.

పైన తిరుగుతున్న సీలింగ్ ఫ్యాన్ కంటే వేగంగా తిరుగుతున్నాయి అతని మనస్సులోని ఆలోచనలు.

ఒకనాడు నన్ను ప్రాణానికి ప్రాణంగా ప్రేమించి నన్ను మోసం చేసి వెళ్ళిన ఆ లలిత, ఈ డాక్టరు ఒకరేనా? ఈ డాక్టరే లలిత అయితే నన్ను చూసి కూడా చూడనట్టుగా ముఖం తిప్పుకుని ఎందుకు వెళ్ళిపోతుంది? ఒకవేళ నన్ను గుర్తుపట్టలేదా? లేక, గుర్తుపట్టినా గతాన్ని గుర్తు తెచ్చుకోవటం ఇష్టంలేక నన్ను గుర్తుపట్టనట్టుగా వెళ్ళిపోయిందా? అన్న ప్రశ్నలు అతని మనస్సును వేధిస్తున్నాయి.

తన అనుమానం నిజమా? కాదా? అని తేల్చుకోవటానికి గదిలోనుంచి బయటకు వచ్చి వరండాలో నిల్చున్నాడు రాజేష్. అదే సమయంలో కన్సల్టింగ్ రూములో నుంచి, వార్డువైపుకు రాబోతున్న డాక్టరు, వరండాలో నిల్చుని ఉన్న రాజేష్‌ను చూసి, వార్డువైపుకు రాకుండా వెనక్కి వెళ్ళి తన కన్సల్టింగ్ రూములో కూర్చుంది. ఆ రూములోకి వెళదామా? వద్దా అని ఆలోచిస్తూ అక్కడే నిల్చున్నాడు రాజేష్.

అదే ముఖం, అవే కళ్ళు, అదే నడక. నా కళ్ళు నన్ను మోసం చెయ్యలేవు. సందేహం లేదు. ఆవిడ లలితే. నన్ను గుర్తుపట్టింది. నా ఎదుట పడటానికి ధైర్యం చాలక,

వార్డుబైవు రాబోయి నన్ను చూసి కలవరపడి, తన కలవర పాటును కప్పిపుచ్చుకోవటానికి వార్డుబైపు రాకుండా తన రూములో కెళ్ళింది. అనుకున్నాడు రాజేష్.

ఇంతలో ఒక కారొచ్చి వరండా ముందాగింది. అందులో దిగిన ఆడవాళ్ళు ఆ రూములోకి వెళ్ళారు.

రాజేష్ మళ్ళీ వచ్చి, గదిలో కూర్చున్నాడు. ఆలోచనలతో అతని తల వేడెక్కింది. లలిత రూపం అతని కళ్ళలో కదలాడింది. అతని మనస్సు గతంవైపు పరుగెత్తింది.

## 2

చిన్నతనంలోనే తల్లీ, తండ్రిని కోల్పోయి మేనమామ రాఘవరావుగారింటికి చేరుకున్నాడు రాజేష్. రాఘవరావుగారు, ఆ ఊరి ఎలిమెంటిరీ స్కూలు ఎడ్మాష్టరుగా పని చేస్తున్నారు. ఆ ఉద్యోగం తప్ప ఆస్తిపాస్తులేమీ లేవు ఆయనకు.

ఆయనకు ఒక్కతే కూతురు వాణి. ఆయన భార్య అన్నపూర్ణ. రాజేష్ ఆయన అక్కగారి కొడుకు కావటం, తనకు కొడుకులు లేకపోవటం వలన.

రాఘవరావుగారు, ఆయన భార్య కూడా రాజేష్‌ను కన్న బిడ్డ కంటే ఎక్కువగా చూసుకునే వారు. ఆయన

సంపాదనతో, వాళ్ళ కుటుంబం లోటు లేకుండా జరుగుతుంది.

రాఘవరావుగారికి సొంత ఇల్లు, చిన్న పెంకుటిల్లు ఉంది. పుట్టిన ఊరు, ఉద్యోగం చేస్తున్న ఊరు కూడా అదే కావటం వలన. ఆ ఊరివాళ్ళందరూ రాఘవరావు గార్ని చాలా గౌరవంగా చూస్తారు.

ఆ ఊరి పంచాయతీ ప్రెసెడెంటు, రాజశేఖరంగారు. అయన ఆ ఊరుకు, మకుటంలేని మహారాజు. ఇరవయ్యో సంవత్సరాలుగా, ఆయన తన ప్రెసెడెంటు పదవిని నిలబెట్టుకుంటూ వస్తున్నారు. ఆయనకు ఒక్కతే కూతురు లలిత. ఆయనకున్న వందెకరాల మాగాణి పొలానికి, పాతిక ఎకరాల కొబ్బరి తోటకూ, ఉంటున్న లంకంత మేడకూ వారసురాలు లలిత.

లలిత, వాణీ ఒకే వయస్సు వాళ్ళు కావటం వలన లలిత తరుచుగా వాణికోసం, రాఘవరావు గారింటికి వచ్చేది. లలిత కంటే అయిదు సంవత్సరాలు పెద్ద రాజేష్. అయినా, ముగ్గురూ చిన్నతనం నుంచీ కల్సి మెల్సి పెరిగారు. రాజేష్ హైస్కూలు చదువు పూర్తి చేసి, ఆ ఊళ్ళోనే ఉన్న కాలేజీలో చేరాడు.

వాణి, లలిత హైస్కూలు చదువులోకి వచ్చారు. కాల చక్రం ఎవరికోసం ఆగదు. ఎవరు ఏడ్చినా, ఎవరు నవ్వినా తనకు సంబంధం లేనట్టుగా క్రమం తప్పకుండా దాని పని అది నిర్వర్తిస్తూనే ఉంటుంది.

ఎప్పుడూ చలాకీగా ఉంటూ, తను నవ్వుతూ ఎదుటి వాళ్ళను నవ్వించే లలిత అంటే చాలా ఇష్టం రాజేష్‌కు. వయస్సు ఎదుగుతున్న కొద్దీ లలిత మీదున్న అభిమానం రాజేష్ మనస్సులో ప్రేమగా మారింది. ఎప్పుడూ తన మనస్సులోని భావాన్ని బయటకు వ్యక్తం చేసేవాడు కాదు రాజేష్.

లలిత లంగా, వోణీలతో బాటు, ఇప్పుడప్పుడూ చీరలు కూడా కట్టుకోవటం మొదలు పెట్టింది. వయసు తెచ్చిన వంపు సొంపులతో, మెరుపు తీగలా ఉండే లలిత రూపం ప్రతిక్షణం రాజేష్ కళ్ళలో కదలాడుతూనే ఉంటుంది.

లలిత, వాణి ఇంటర్ చదువుతున్నప్పుడు, రాజేష్ బి. యస్సి. సెకండియర్‌లోకి వచ్చాడు.

కాలేజి నుంచి రాగానే, వాణీ, లలిత ఆడుకుంటూ ఉంటే. చూస్తూ కూర్చునే వాడు రాజేష్. లలిత ఎదురుగా ఉన్నంత సేపూ, లలిత దగ్గర్నుంచి కదిలేవాడు కాదు. పరీక్షల టయము అయినా సరే, లలిత ఎదురుగా ఉంటే పుస్తకం ముట్టుకునే వాడు కాదు.

చిన్నతనం నుంచీ, ముగ్గురూ కల్సి పెరగటం వలన ఏ టయములో, రాజేష్ లలితా వాళ్ళింటికి వెళ్ళినా, రాజేష్‌కు ఏవరూ అభ్యంతరం చెప్పే వాళ్ళు కాదు. తల్లి తండ్రిలేని రాజేష్ అంటే లలిత వాళ్ళమ్మగార్కి కూడా

ఎంతో జాలి, రోజూ లలితతో బాటు, రాజేష్‌కు కూడ
ప్రేమగా టిఫిన్ పెట్టేది. ఆప్యాయంగా మాట్లాడేది.

లలితను చూడాలనిపిస్తే, ఏదో ఒక వంక పెట్టుకు
వాళ్ళింటికి వెళ్ళి లలితను చూసి వచ్చేవాడు. లలితా వాళ
మేడకు ఎదురుగా ఉంటుంది రాఘవరావుగారి పెంకుటిల్లు
అందువల్ల వాళ్ళెంత చనువుగా ఉంటున్నా పెద్దవాళ్ళు
పట్టించుకునేవాళ్ళు కాదు.

వాణి, లలిత కాలేజీలో చేరారు. ముగ్గురూ కాలేజీనుం
రాగానే, లలితా వాళ్ళ మేడ ముందు ఆరుబయట లాన్‌లో
కూర్చుని గంటల తరబడి కబుర్లు చెప్పుకునే వాళ్ళు. పరీక్ష
టయమయితే, ముగ్గురూ ఒకే గదిలో కూర్చుని చాల
పొద్దుపోయే వరకూ చదువుకునేవాళ్ళు. వాణికి, లలిత
అర్థంగాని పాఠాలు రాజేష్ చెప్పేవాడు. చదువువిషయంలో
లలిత ఎంత చురుకయినదో, వాణి అంత మొద్దు. రాజేష్
ఎంతో శ్రద్ధ తీసుకుంటే గాని బొటా, బొటీ మార్కులతో
వాణి టెన్త్ ప్యాసవ్వ గలిగింది.

ఇంటర్ మొదటి సంవత్సరం పరీక్ష తప్పి, వాణి
చదువు మీద ఇంట్రెష్టు లేదు. నేను చదవను అని కాలే
మానేసింది వాణి. ఇష్టం లేకుండా చదివించటం ఎందుకని
రాఘవరావుగారు కూడా వాణిని చదువుకోమని బలవంత
పెయ్యలేదు.

లలిత ఇంటర్ రెండో సంవత్సరంలోకి వచ్చింది. రాజేష్ బి. యస్సి. సీ చివరి సంవత్సరం చదువుతున్నాడు. అలా మార్పు లేకుండా జరిగి పోతున్నాయి రోజులు.

# 3

ఇప్పుడు వాణీ, వాళ్ళ మధ్య లేకపోవటం వలన రాజేష్, లలితల మధ్య చనువు పెరిగింది. కాలేజి అయిపో గానే, రాజేష్, లలిత మాట్లాడుకుంటూ కూర్చున్నా వాళ్ళ మధ్యకు వాణి వచ్చేదికాదు. అన్నపూర్ణమ్మ గారి ఆరో గ్యం దెబ్బ తినటంతో ఇంటి పనులు వంట పనులతోనే వాణికి రోజంతా సరిపోతుంది.

రాజేష్ లలితను ఎంతగా ప్రేమిస్తున్నా ఆ భావాన్ని బయటకు వ్యక్తం చెయ్యాలంటే భయంగా వుంది. తనకూ, లలితకూ మధ్య ఉన్న అంతస్థులనే అడ్డుగోడను దాటుకుని, లలితను చేరుకోవటం కష్టం అ. రాజేష్‌కు తెలిసినా లలిత మీద నుంచి మనస్సు మార్చుకోలేక లలిత రూపాన్ని మన స్సులో నిలుపుకని మూగగా ఆరాధిస్తున్నాడు.

ఒకరోజు కాలేజి అయిపోయిం తర్వాత, కాలేజి గేటు దగ్గర నిలబడి తన ఫ్రెండ్ చెల్లెలితో మాట్లాడుతూ నిల్చు న్నాడు రాజేష్. లలిత చాలాసేపటి నుంచి, తనను గమని స్తుందన్న విషయం రాజేష్‌కు తెలియదు.

పదినిమిషాల తర్వాత, తన ఫ్రెండ్ చెల్లెలిని రిక్షా ఎక్కించి ఇంటివైపు నడవబోయాడు రాజేష్. అప్పటివరకూ రాజేష్‌ను గమనిస్తూ నిల్చున్న లలిత, సుడిగాలిలా రాజేష్ దగ్గరకు వచ్చింది.

"రాజేష్ నీతో మాట్లాడాలి. అలా కాలవవైపు వెళదాం రా." అంది.

"ఇంటి దగ్గర కూర్చుని మాట్లాడుకోవచ్చుగా!"

ఆ విషయం నాకు తెలుసు. కోపంగా అంది లలిత. లలిత ముఖంలోకి చూసిన రాజేష్, ఇంకేం అనలేక మౌనంగా లలితను అనుసరించాడు. ఇద్దరూ కొంతదూరం నడిచి కాలవ గట్టుమీద కూర్చున్నారు.

నీరెండ కాంతిలో, ప్రకృతి బంగారు మేలిముసుగు ధరించినట్టుగా ఉంది. కాలవలో నీళ్ళు తక్కువగా ఉండటం వలన, కాలవలోని చిన్న, చిన్న చేపపిల్లలు అందంగా అటూ ఇటూ ఈదుతూ, చూడటానికి ఆకర్షణీయంగా కనిపిస్తున్నాయి.

"ఏదో మాట్లాడాలని ఇక్కడవరకూ తీసుకువచ్చి మౌనంగా కూర్చున్నావేం లలితా?"

"కాలేజీ దగ్గర నీతో మాట్లాడిన అమ్మాయి ఎవరు?"

"మా ఫ్రెండ్ చెల్లెలు." ఆ అమ్మాయితో మాట్లాడితే లలితకు ఎందుకంత కోపం వచ్చిందో అర్థంకాక ఆశ్చర్యంగా లలిత ముఖంలోకి చూస్తూ అన్నాడు రాజేష్.

"ఎంత ఫ్రెండ్ చెల్లెలు అయితే మాత్రం, అంత సేపు నిలబడి మాట్లాడాలా!"

"మా ఫ్రెండ్‌కు రెండు రోజుల నుంచి జ్వరం వస్తుందంట. ఆ విషయమే చెబుతూ నిల్చుంది."

"ఆ ఒక్క మాట చెప్పటానికి, అర్ధగంట టయము పడుతుందా?"

"నేను అర్ధగంట మాట్లాడానా—" హాస్యంగా నవ్వుతూ అన్నాడు రాజేష్.

"నేను- మీరిద్దరూ మాట్లాడుతుంటుంటే నిముషాలు లెక్కపెట్టుకుంటూ నిల్చున్నాను,"

"నువ్వలా నిముషాలు లెక్కపెట్టుకుంటూ. నిల్చున్నావని నాకు తెలియదు. లేకపోతే రెండు నిముషాలలో ఆ అమ్మాయిని పంపించి నీ దగ్గరకు వచ్చేవాడిని." చిలిపిగా కళ్ళలోకి చూస్తూ నవ్వుతూ అన్నాడు రాజేష్. కోపంగా చూసింది అతనివైపు లలిత.

"ఎందుకలా నవ్వుతావు!"

"నీ కోపం చూస్తుంటే నాకు నవ్వు వస్తుంది. అయినా నేను మా ఫ్రెండ్ చెల్లెలితో ఎంత సేపు మాట్లాడితే మాత్రం నీకు వచ్చిన నష్టం ఏమిటి?"

"నా ఎదురుగా, నువ్వు మరో అమ్మాయితో మాట్లాడితే నేను సహించలేను. : నువ్వలా నవ్వుతూ ఆవిడ గారితో మాట్లాడుతూ నిల్చుంటే, నాకెంత ఏడుపు వచ్చిందో తెలుసా!" బుంగమూతితో అంది లలిత.

"అమ్మాయిలూ, అబ్బాయిలూ ఒకే కాలేజీలో కల్సి చదువుకుంటున్నాప్పుడు, ఒకరితో ఒకరు మాట్లాడుకో కుండా ఎలా ఉంటారు?"

"చదువుకుంటే మాత్రం నీకు అమ్మాయిలతో మాట్లాడవలసిన అవసరం ఏముంది?"

"మాట్లాడితే తప్పేముంది?"

"చెప్పానుగా నేను సహించలేనని."

"అదే నేనూ అడుగుతున్నాను. నేను అమ్మాయి లతో మాట్లాడితే నువ్వెందుకు సహించలేవు?"

"ఎందుకో, నీకు తెలియదా?"

"తెలిస్తే నిన్నెందుకు అడుగుతాను?"

ఆ మాటకు, రాజేష్ కళ్ళలోకి ఏదో వెతుకుతున్న ట్టుగా చూసింది లలిత. ఆ చూపుకు అర్థం చేసుకున్న రాజేష్ తనలో తను నవ్వుకున్నాడు.

"నిన్ను. నేను ప్రేమిస్తున్నాను. అందుకే మరో అమ్మాయి వైపు నువ్వు చూడటం కూడా నేను సహించ లేను," సిగ్గుతో తలవంచుకుని అంది లలిత.

ఆ మాటకు సంతోషం వెల్లువలా పొంగింది రాజేష్ మనస్సులో. ప్రపంచంలో తనంత అదృష్టవంతులు మరొక ళ్ళుండరు. అన్నంత ఆనందంగా ఉంది అతనికి. అయినా తన మనస్సులో రేగుతున్న భావాలు ముఖంలో కన్పించ

నీయకుండ జాగ్రత్త పడుతూ "అలాగా!" అన్నాడు. ఏమీ తెలియనట్టుగా నవ్వుతూ.

"నేను, నిన్ను ప్రేమిస్తున్నానన్న విషయం నీకుగా నువ్వు తెలుసుకుంటావని ఇన్నిరోజుల నుంచి ఎదురు చూశాను. నువ్వొక బుద్ధావతారానివి. ఎంతసేపూ నీవృత్తి కాలు, నీచదువు తప్ప, నీ కింకేం పట్టదు."

"నాతో జోక్ చేస్తున్నావా లలితా!"

"ఇలాంటి విషయాలు, జోక్‌గా మాట్లాడుతారా!"

"నువ్వు, నన్ను ప్రేమిస్తున్నావా!"

"ఇంకా నమ్మలేక పోతున్నావా!"

"లలితా! నాస్థితిగతులన్నీ నీకు తెలుసు, నాలో ఏం చూసి ప్రేమిస్తున్నావు!"

"నీ స్థితి గతులు చూసి. నీ అందాన్ని చూసి నేను నిన్ను ప్రేమించటం లేదు. ఎందుకంటే, అన్ని విషయా లలో నేను నీకంటే పై అంతస్తులో ఉన్నదాన్ని."

"నీలో ఉన్న మంచి మనస్సును చూసి, ఏ పరిస్థితుల తోనూ, చెక్కు చెదరని నీ వ్యక్తిత్వాన్ని చూసి మాత్రమే నిన్ను ప్రేమిస్తున్నాను."

"మనిషికి సమాజంలో, విలువను పెంచేవి అవి రెండూ కాదు."

"సమాజాన్ని గురించి నేను ఆలోచించను."

"నువ్వు సమాజాన్ని గురించి ఆలోచించక పోయినా సమాజం నిన్ను గురించి ఆలోచిస్తుంది."

"అటువంటి విషయాలు నాకనవసరం."

"లలితా! నువ్వు లక్షాధికారి రాజశేఖరంగారి ఏకైక కూతురువు. నేను ఆస్థి అంతస్తులేని, ఒక సామాన్య మనిషిని. నీవు నన్ను ప్రేమించినంత సులభంగా, మన పెళ్ళి జరగదు. నీటిలోని కలువ, ఎంత ప్రయత్నించినా నింగిలోని జాబిలిని అందుకోలేదు. నీకూ, నాకూ నింగికీ నేలకూ ఉనంత తేడా ఉంది."

"నీ ముఖం మీద, నేలమీద మొలిచినట్లు మొక్కలూ నా ముఖంమీద నింగిలో మెరుస్తున్నట్టు నక్షత్రాలూ మెరవటం లేదు."

"లలితా! నీకు వయస్సు ఎదిగినంతగా, మనస్సు ఎదగలేదు. ఊహాకూ, వాస్తవానికీ చాలా తేడా ఉంటుంది. ఒక్కగా నొక్క కూతురువని, మీ నాన్నగారు నీమీద ఎన్నో ఆశలు పెంచుకుని ఉండవచ్చు."

"నిన్ను జమీందారు ఇంటి కోడల్ని చెయ్యాలని ఆయన కలలు కంటూ ఉంటారు. నాలాంటి సామాన్యుడిని, ఆయన అల్లునిగా ఊహించను కూడా, ఊహించలేరు."

"ఒక విషయం సూటిగా చెప్పు. నువ్వు. నన్ను ప్రేమిస్తున్నావా? లేదా?"

"నిన్ను ఎంతగా ప్రేమిస్తున్నానో. చెప్పటానికి నాకు మాటలు చాలవు. కొన్ని, కొన్ని విషయాలను, మాటల్ని బట్టి కాకుండా, చేష్టలను బట్టి అర్థం చేసుకోవాలి."

"నువ్వు నిజంగా నన్ను ప్రేమిస్తే, ఎందుకలా మాట్లాడతావు! ఆడపిల్లనయినా, నాకుగా, నేను కోరి నీ దగ్గరకు వచ్చానననా ఇంత తిరస్కారం!

"లలితా! నేను, నిన్ను నిజంగా మనసారా ప్రేమించాను. కాబట్టి, నలాంటి అనామకుడిని పెళ్ళి చేసుకుని, నువ్వు సుఖపడలేవని నా ప్రేమను ఇంతకాలం నీ ముందు వ్యక్తం చెయ్యలేక పోయాను. నువ్వు నీ అంతస్తుకు తగిన వ్యక్తిని పెళ్ళిచేసుకుని సుఖంగా ఉండాలని మనసారా కోరుకుంటున్నాను."

"ఏ సినిమాలో డైలాగో ఇది, చాలా బావుంది."

"నేను నవ్వులాటగా, మాట్లాడటం లేదు లలితా! నిజంగా చెబుతున్నాను."

"అయిపోయిందా నువ్వు చెప్పదలచుకున్నదంతా!"

"ఆవేశ పడకుండా, నేను చెప్పింది అర్థం చేసుకోవటానికి ప్రయత్నించు."

"నిన్ను బాగా అర్థం చేసుకున్నాను. నువ్వు పిరికివాడివను."

"ఇది పంతానికి కాదు. ఇప్పుడు నేనెం చెప్పినా, నీకు అర్థంకాదు. వెళదాం పద." అన్నాడు రాజేష్ లలిత

అలాగే కూర్చుంది. కోపంతో అంతకు మించిన ఉక్రోషంతో లలిత ముఖం ఎర్రగా కందిపోయింది. లలితను దగ్గరకు తీసుకుని గుండెలకు హత్తుకుని, సున్నాలా చుట్టిన లలిత బుంగ మూతిపై ముద్దుపెట్టుకోవాలన్నంత ఆవేశం వచ్చింది రాజేష్కు. అతి కష్టంమీద తనను తాను నిగ్రహపరుచుకున్నాడు లలితకు తన చుట్టూ ఆశలు పెంచుకునే, అవకాశాన్ని ఇవ్వకూడదని దూరంగా ఉన్నాడు.

"నన్ను ప్రేమించానంటావు. అందుకే దూరంగా ఉంనంటావు ఏమిటో నీ మాటలు నాకేం అర్థం కావటంలేదు."

"ఇంటికెళ్ళి రాత్రంతా తీరికగా ఆలోచించుకో ఇంకాస్త ఆలస్యం చేసావంటే, నిన్నెవరో ఎత్తుకుపోయారని మీ నాన్నగారు పోలీసు రిపోర్టు ఇస్తారు. ఇక వెళదాంలే." అంటూ లేచాడు రాజేష్, తప్పనిసరై అతన్ని అనుసరించింది లలిత.

## 4

రోజులు గడిచేకొద్దీ, లలితకు రాజేష్ ఎంత దూరంగా ఉండాలని ప్రయత్నిస్తున్నాడో, లలిత అంత దగ్గరవ్వాలని ప్రయత్నిస్తుంది. రాజేష్ బి. యస్సి. పూర్తి చేసి, ఉద్యోగాన్వేషణలో ఉన్నాడు. కాలేజీకి శెలవులు కావటం వలన, లలిత కూడా రోజంతా ఇంటిదగ్గరే ఉంటుంది.

పగలు ఎక్కువ టయిము రాజేష్ లలితా వాళ్ళ ఇంటిదగ్గరే గడుపుతున్నాడు. ఇంటికెళ్ళిన పదినిముషాలకే ఏదోపని కల్పించుకుని రాజేష్ దగ్గరకు వస్తుంది లలిత. ఇంట్లో వాళ్ళు తమను ఎక్కడ అనుమానిస్తారో అన్న భయంతో ఇంట్లో ఉన్నప్పుడు లలితతో ముక్తసరిగా మాట్లాడుతుంటాడు.

అన్నపూర్ణమ్మగారి ఆరోగ్యం రోజు, రోజుకూ క్షీణించిపోతుంది. ఎన్నిమందులు వాడినా ప్రయోజం లేక పోయింది. సంవత్సరం రోజులు మంచంలో ఉండి మృత్యువుతో పోరాడి అలిసిపోయి ఒకనాటి రాత్రి శాశ్వతంగా కన్నుమూసింది.

పలభయ్యి సంవత్సరాలు తనజీవితాన్ని కష్టాలలో, సుఖాలలో పంచుకున్న భార్య మరణంతో రాఘవరావు గారు దిగులుతో మంచం పట్టారు. ఆయన కోలుకోవటానికి రెండు నెలలు పట్టింది. కూతురుకోసం, ఆయన తన బాధను తనలోనే దాచుకుని పైకి గంభీరంగా ఉంటున్నారు.

రాజేష్ డిగ్రి తీసుకుని కూడా నాలుగు నెలలు అయింది. ఉద్యోగం దొరకలేదు. ఈలోగా, రాఘవరావు గారు రిటైరయ్యాడు. తనకు ఉద్యోగం దొరకకపోతే కుటుంబం గడిచేదెలా అన్న దిగులు పట్టుకుంది రాజేష్‌కు. ఆరోగ్యం బాగలేదని ట్యూషన్సు పెట్టుకోవద్దని రాజేష్ ఎంత చెప్పినా వినకుండా, నీకు ఉద్యోగం దొరికిన తర్వాత ట్యూషన్సు

చెప్పటం మానేస్తాను అంటూ పదిమంది పిల్లలకు ట్యూషను చెప్పటం మొదలు పెట్టారు రాఘవరావుగారు.

కాలేజీలు తెరిచిన టయములో లలితకు టైఫాయిడ్ రావటం వలన, ఆ సంవత్సరం కాలేజిలో చేరలేదు లలిత.

వాణి, అంతకుముందు రాజేష్ మీద ఎలాంటి భావం వ్యక్తం చెయ్యకపోయినా ఇప్పుడిప్పుడు రాజేష్ తనకు కాబోయే భర్త అన్న విధంగా ప్రవర్తించుతుంది. అన్నపూర్ణమ్మగారు చనిపోయినతర్వాత, వాణి భోజనం నిద్రా మానేసి ఏడుస్తూ కూర్చుంటే, వాణిని చిన్నిపాపాయిలా బ్రతిమాలి, అన్నం కలిపి వాణికి గోరుముద్దలు తినిపించాడు రాజేష్. తల్లిని పోగొట్టుకున్న వాణిని ఓదార్చటం నా బాధ్యత అనుకున్నాడుగానీ, ఆ ఓదార్పును వాణి మరో విధంగా అర్థం చేసుకుందన్న విషయం రాజేష్‌కు తెలియదు.

అన్నపూర్ణమ్మగారు చనిపోయిన దగ్గర్నుంచీ, రాజేష్‌కు స్నానానికి వేడినీళ్ళు పెట్టటం, వంట చేసి దగ్గర కూర్చుని వడ్డించటం, అతని బట్టలు ఉతికి ఇస్త్రీ చేయించటం ఇలా అన్ని పనులు వాణే చేసేది. రాజేష్ పనులు చేయటం, అతనికి కావలసినవి అందించటంలో ఎంతో ఆనందాన్ని తృప్తిని పొందేది వాణి.

రాఘవరావుగారు, మారుతున్న కాలానికి అనుగుణంగా మారే మనిషి. వాణికి రాజేష్‌కూ పెళ్ళిచేసి తన బాధ్యత తీర్చుకోవాలని ఉన్నా, రాజేష్ మనస్సు తెలుసుకోకుండా, నిన్ను నేను పెంచాను కాబట్టి, నువ్వు నా

కూతుర్ని పెళ్ళి చేసుకోవాలి. అన్న ధోరణిలో మాట్లాడ లేక, పెళ్ళి విషయం రాజేష్‌తో మాట్లాడకుండా మవునంగా ఉంటున్నారు.

వాణి, చూపుల్లోనూ మాటల్లోనూ రాజేష్ మీదున్న ప్రేమను అతని ముందు వ్యక్తం చేస్తున్నా అదేమీ గమనిం చనట్టుగా ఉంటున్నాడు రాజేష్. తను నవ్వుతూ చనువుగా మాట్లాడితే, వాణి ఇంకా తనమీద ప్రేమను పెంచుకుంటుం దని అవసరం అయితే తప్ప, వాణీతో మాట్లాడటంలేదు. పగలంతా ఏం పని లేకపోయినా, ఇంటికి రాకుండా బయటే తిరుగుతుంటాడు.

ఇప్పుడు లలిత, వాణి పెద్దవాళ్ళు కావటంవలన? అం తకు ముందులా ఒకరిళ్ళకు ఒకరు రాకపోకలు తగ్గించారు.

రెండు, మూడురోజులకు ఒకసారి కల్సుకుని మాట్లాడు కుంటుంటారు. లలితా, రాజేష్ ప్రేమించుకుంటున్నారన్న విషయం వాణికి తెలియదు. ఇంట్లో అంతజాగ్రత్తగా ఉంటాడు రాజేష్.

వాణికి ఇప్పుడు అసలు తీరటంలేదు. ఇంటిపనులూ, వంటపనులూగాక ఇంటిచుట్టూ ఉన్న ఖాళీ స్థలంలో రక, రకాల కూరగాయల పాదులు పెంచుతూ, కూరగాయలు కొనటం మానేసింది. కాస్త ఖాళీ దొరికితే చాలు ఆ కూర గాయపాదుల్లో కలుపుమొక్కలు ఏరుతూనో, పాదుల్లో నీళ్ళు పోస్తూనో గడువుతుంది. అందువల్ల, లలితతో కూడా ఎక్కువగా గడపలేకపోతుంది.

రాజేష్ ఇంట్లో ఉన్నంతసేపూ, అతనికేం అవసరం అవుతుందో అని అతని చుట్టూనే తిరుగుతుంది. అతను బయటకు వెళ్ళటం దగ్గర్నుంచి, మళ్ళీ తిరిగి ఇంటికి వచ్చేవరకూ అతనికోసం ఎదురుచూస్తూ కూర్చుంటుంది.

ఒక్కొక్కరోజు తిరిగి, తిరిగి రాజేష్ ఇంటికి వచ్చేసరికి టయిము రాత్రి పదిగంటలు అవుతుంది. అప్పటివరకూ తనుకూడా భోంచెయ్యకుండా రాజేష్‌కోసం ఎదురుచూస్తూ కూర్చుని, అతను భోంచేసి తర్వాత, అతనికి పక్క వరిచి అప్పుడు తను భోంచేస్తుంది. ప్రతిరోజూ, పేపరులో ప్రకటించిన ఉద్యోగాలన్నిటికీ అప్లయి చేస్తూనే ఉన్నాడు రాజేష్.

లలిత విషయం రామనాథం గారితో చెప్పాలని ఎప్పటి కప్పుడు అనుకుంటూనే, చెప్పటానికి ధైర్యం చాలక ఊరుకుంటున్నాడు రాజేష్.

# 5

ఒకరోజు ఆ రోజు ఆదివారం. లలిత దగ్గరకు వచ్చాడు రాజేష్.

రాజేష్ వచ్చేసరికి, లలిత లాన్‌లో కూర్చుని ఎవరితోనో మాట్లాడుతుంది. రాజేష్‌ను చూసి

"రా. రాజేష్ కూర్చో. ఇతను మా బావ గిరి." అంటూ అక్కడ కూర్చున్న తన్ని రాజేష్‌కు పరిచయం చేసింది లలిత.

"నమస్తే." అన్నాడు రాజేష్.

"ఇతను మా ఫ్రెండ్ రాజేష్," అంటూ గిరికి పరిచయం చేసింది రాజేష్‌ను.

"నమస్తే." అన్నాడు గిరి. రాజేష్ వాళ్ళకెదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

గిరి చూపులతోనే లలిత అందాలను తినేసేలా చూస్తూ మాట్లాడుతుంటే, రాజేష్‌కు వళ్ళు మండిపోతుంది. అతన్ని అలా చూస్తూ కూర్చోవటం ముళ్ళమీద కూర్చున్నట్టుగా ఉంది రాజేష్‌కు. అయినా నభ్యత కోసం, ముఖాన నవ్వు పులుముకుని అప్పుడప్పుడూ వాళ్ళ నంభాషణలో తను కూడా పాల్గొంటూ కూర్చున్నాడు. లలిత అతనితో నవ్వుతూ మాట్లాడటం సహించలేక పోతున్నాడు.

"ఇక వెళతాను." అంటూ లేచాడు రాజేష్. అతనితోబాటు లలిత కూడా లేచి గేటువరకూ వచ్చింది.

"లలితా! నీకోసం, మనం కలుసుకునే చోట ఎదురు చూస్తూ కూర్చుంటాను త్వరగా రా." అంటూ లలితకు మాట్లాడేందుకు అవకాశం ఇవ్వకుండా, వేగంగా నడుస్తూ గేటు దాటాడు రాజేష్.

లలిత కోసం ఎదురు చూస్తూ కాలవ గట్టుమీద కూర్చున్నాడు రాజేష్. నిముష, నిముషానికీ లలిత మీద కోపం అధికమవుతుంది అతని మనస్సులో. దాదాపు గంట సేపు ఎదురు చూసిన తర్వాత వచ్చింది లలిత.

లలితను చూసినా, చూడనట్టుగా ముఖం తిప్పుకున్నాడు రాజేష్.

"దొరగారికి ఎందుకో నామీద అంత కోపం!" నవ్వుతూ అంటూ రాజేష్‌కు దగ్గరగా కూర్చుంది లలిత.

"లలితా! నీకో బావ ఉన్నాడని ఇంతవరకూ, నాతో ఎందుకు చెప్పలేదు?"

"నువ్వు అడగలేదు. నేను చెప్పలేదు." నవ్వుతూ అంది లలిత.

"ఇంతకాలం రాని బావ, ఇప్పుడెందుకు ఊడి పడ్డట్టు?"

"ఇన్ని రోజుల నుంచీ, అత్తయ్యా వాళ్ళ కుటుంబానికీ మా కుటుంబానికి మధ్య రాకపోకలు లేవు."

"ఏదో కుటుంబ కలహాల మూలంగా, ఇంతకాలం ఆ ఇంటిమీద కాకి, ఈ ఇంటిమీద వాలేదికాదు. ఈగిరి మా అత్తయ్యకు ఒక్కడే కొడుకు. నెలరోజుల క్రితమే మెడిసన్ పూర్తిచేసి అమెరికా నుంచి తిరిగి వచ్చాడు. విరోధంగా ఉన్న రెండు కుటుంబాలను కలపటానికి సారధిలా వచ్చాడు.

"నా అనుమానం అతను వచ్చింది అందుకు కాదనుకుంటాను."

"నువ్వు పోలీస్ డిపార్టుమెంటులో పనిచేస్తే బాగా రాణిస్తావు. నీకు ప్రతివిషయానికీ అనుమానమే." హాస్యంగా నవ్వుతూ అంది లలిత.

అదికాదు లలితా! అతనికి నిన్ను పెళ్ళి చేసుకోవా లన్న ఉద్దేశ్యం ఉందనుకుంటాను."

"ఏమో, నేనంతదూరం ఆలోచించలేదు. మా అత్త య్యకు డబ్బుమీద వ్యామోహం ఎక్కువ. నన్ను కోడలిగా చేసుకుంటే మా ఆస్తి అంతా వాళ్ళదవుతుందిగా? అందుకే కాబోలు నాన్నగారితో ఆలోచించి ఇక్కడ ప్రాక్టీసుపెడితే బావుంటుందేమో మాట్లాడి రమ్మని బావను ఇక్కడకు పం పించిందంట."

"ఇక్కడ ప్రాక్టీసు పెడతాడా?"

"నువ్వు వచ్చేముందు ఆ విషయమే నాతో మాట్లా డుతున్నాడు. అతనికి కూడా ఇక్కడే ప్రాక్టీసు పెట్టాలని ఉందంట."

"అందుకు మీ నాన్నగారు వప్పుకున్నారా?"

"నాన్నగారి ధోరణి చూస్తుంటే, బావ ఇక్కడే ప్రాక్టీసు పెట్టటానికి కావలసిన ఏర్పాట్లు కూడా నాన్నగారే చేసేటట్టున్నారు. మేనల్లుడు రావటమే, తన అదృష్టం అను కుంటున్నారు."

లలిత చెప్పిన విషయాల్ని గురించి ఆలోచిస్తూ మవు నంగా కూర్చున్నాడు రాజేష్.

"ఏమిటంత సీరియస్‌గా ఆలోచిస్తున్నావు?"

"ఒకవేళ, మీ బావ ఇక్కడే ప్రాక్టీసు పెట్టాడను కో అప్పుడెలా?"

"అక్కను ప్రాక్టీసు పెడితే, మనకేం?"

"మనం ఇలా కలుసుకోవటానికి ఎలా వీలవుతుంది?"

"నీ కన్నీ అనుకూలాలే ఇప్పుడు ఎలా కలుసుకుంటున్నామో, ఇకముందూ అలాగే కలుసుకుంటాం."

"నా భయం నీకర్థం కావటం లేదు."

"మన విషయం, త్వరగా మా నాన్నగారితో చెబుదాం. ఎంతకాలమిలా చాటు మాటుగా కలుసుకుంటాం?"

"ఆయన ఒప్పుకోరు."

"ఒప్పుకోరని తెలుసు. అయినా, ఏదో ఒకరోజు మన విషయం ఆయనకు చెప్పక తప్పదుగా?"

"అన్నిటికీ అంత తొందరయితే ఎలా? ఆయనగా, నీ పెళ్ళి విషయం నీ ముందు ఎత్తినప్పుడు, సమయానుకూలంగా అప్పుడు మన విషయం చెప్పాలి."

"మాస్టారు ఒప్పుకుంటారో. లేదో మన పెళ్ళికి?"

"మామయ్యకు ఎలాగయినా నచ్చచెప్పి ఒప్పించవచ్చు. కానీ, వాణిదే నాకు పెద్దసమస్యగా ఉంది. వాణి నన్ను ప్రేమిస్తుంది. అన్ని విషయాలలోనూ, నేను తనకు కాబోయే భర్తను అన్నట్టుగానే ప్రవర్తించుతుంది. వాణితోనే, నీ విషయం ఎలా చెప్పాలా అని ఆలోచిస్తున్నాను."

"నువ్విలా ఆలోచిస్తూనే ఉండు. ఈలోగా మనిద్దరికీ పెళ్ళి వయస్సుకూడా దాటిపోతుంది."

తెచ్చిపెట్టుకున్న కోపంతో అంది లలిత.

"సరే, నన్ను ఏం చెయ్యమంటావో చెప్పు."

"మీరేం చెయ్యనక్కరలేదు. నేనీ రోజే, మన విషయం అంతా మా నాన్నగారితో చెప్తాను."

"సరే, నీ ఇష్టం."

"ఇక వెళదాం. ఇంటిదగ్గర బావ కూడా ఉన్నాడు." అంటూ లేచింది లలిత.

"ఇద్దరం కల్సి వెళితే, మీ బావ ఏమనుకుంటాడో! ముందు నువ్వెళ్ళు నేను మా ఫ్రెండ్ ఇంటికి వెళ్ళి తర్వాత వస్తాను!"

"నీ ఇష్టం. నేను వెళుతున్నా." అంది లలిత.

లలిత వెళ్ళయింతర్వాతకూడా చాలా సేపు ఆలోచిస్తూ, ఆ కాలవగట్టుమీదనే కూర్చున్నాడు రాజేష్.



రాజశేఖరంగారు, తన పలుకుబడిని ఉపయోగించి, వాళ్ళ ఊరికే గిరిని గవర్నమెంటు హాస్పటల్‌కు డాక్టరుగా వేయించాడు. గిరి, అమ్మా నాన్నగారు పది సంవత్సరాల తర్వాత, రాజశేఖరంగారి ఇంటికి వచ్చి పదిరోజులుండి వెళ్ళారు. రెండు కుటుంబాల మధ్యన ఉన్న కలతలు తొలగి పోయాయి.

గిరి లలితా వాళ్ళింట్లోనే ఉంటున్నాడు. అతని ప్రవర్తిస్తు తున్న తీరును బట్టి, వాళ్ళమ్మగారు వచ్చినప్పుడు మాట్లాడిన మాటల్ని బట్టి, తనను, గిరికిచ్చి పెళ్ళిచేయాలని రెండు కుటుంబాల వాళ్ళు అనుకుంటున్నట్టు అర్థంచేసుకుంది లలిత.

"రోజులు గడుస్తున్నా, రాజేష్‌కు మాత్రం ఉద్యోగం దొరకలేదు. కుటుంబం గడవటమే అంతంత మాత్రంగా ఉన్నప్పుడు, అందర్నీ ఎదిరించి లలితను పెళ్ళిచేసుకున్నా, పోషించేదెలా? ఒకవేళ, ఉద్యోగం దొరికేంతవరకే లలిత పెళ్ళి చేసుకుందామంటే, అప్పటివరకూ లలితకు పెళ్ళిచేయకుండా వాళ్ళ నాన్నగారు ఆగుతారా? ఏం చెయ్యాలి? అన్న ఆలోచనలతో రాజేష్ మానసికంగా రోజు, రోజుకూ కుంగిపోతున్నాడు.

కాలేజీలో చేరాలంటే, ఇంకా నాలుగు నెలలు ఆగాలి, లలిత. గిరి ఇంట్లో ఉన్నంతసేపూ ఏదో ఒక వంకతో లలితను మాట్లాడిస్తూ, లలిత చుట్టూనే తిరుగుతుంటాడు.

ఇంతక్రితంలా, రాజేష్ లలిత తరచుగా కాలవ వొడ్డున కల్సుకోవటానికి కూడా వీలు కావటంలేదు. రాజేష్ కాలేజినుంచి ఇంటికొచ్చేసరికి సాయంత్రం అయిదు గంటలవుతుంది. ఇంచు, మించు అదే టయానికి గిరి కూడా హాస్పటల్ నుంచి ఇంటికి వస్తాడు. ఆదివారం రోజైనా రాజేష్‌తో మనసారా మాట్లాడాలని, లలిత కాలవ వడ్డుకు బయలు

బయలుదేరితే చాలు, గిరి ఎక్కడకు బయలుదేరావు. ఒంటరిగా ఎందుకు? నేనుకూడా రానా? అంటూ ప్రశ్నల వర్షం కురిపిస్తాడు. అతను వేసే యక్షప్రశ్నలకు సమాధానం చెప్పలేక ఒక్కోసారి కాంవబడ్డుకు రాజేష్‌ను కలును కోవటానికి వెళ్ళటం, మానేస్తుంది లలిత.

ఆరోజు గిరి వాళ్ళ ఊరు హైదరాబాదు వెళ్ళాడు. ఆదివారం కావటం వలన, రాజేష్‌కు కూడా కాలేజి లేదు. సాయంత్రం నాలుగు గంటల టయముకో, రాజేష్‌ను కలును కోవటానికి వచ్చింది లలిత. అప్పటికే అక్కడకు వచ్చి లలితకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు రాజేష్.

ఆకుపచ్చని చీరలో, పైరుచేల మధ్య లలిత వన దేవతలా కనుపిస్తుంటే లలిత అందాలను చూడటానికి రెండుకళ్ళు చాలటంలేదు రాజేష్‌కు. ఎన్నోరోజులు విరహవేదన అనుభవించిన తర్వాత కల్సుకున్న భార్యాభర్తల్లా ఒకరినొకరు ఆరాధనగా, అనురాగంగా చూసుకుంటూ కూర్చున్నారు.

"నీ కోసం రెండు ఆదివారాలు ఇక్కడకు వచ్చి ఎదురు చూసాను. ఇంతకాలానికి దేవిగారి దర్శన భాగ్యం కలిగింది."

"మా విలన్ ఈ రోజు హైదరాబాదు వెళ్ళాడు. నవ్వుతూ అంది లలిత."

"ఇంతక్రితంలా, మనిద్దరం మీ ఇంటిదగ్గర కూర్చొని మాట్లాడుకోవటానికి వీలుకావటంలేదు. ఆదివారం అన్నా

మనసారా మాట్లాడుకోవచ్చు అని ఆదివారం కోసం వారం రోజులు ఎదురుచూస్తే ఆ రోజు నీ దర్శనం కావటంలేదు. ఒక్కరోజు నీతో మాట్లాడకపోతేనే, నాకు పిచ్చెక్కినట్టుగా ఉంటుంది అని నీకు తెలుసు కదా? ఇన్ని రోజులు ఎలా వుండమంటావు?"

"నన్నేం చెయ్యమంటావు చెప్పు. నేను బయలుదేరి వరండా దాటితే చాలు. మా విలన్‌గారు ప్రత్యక్షం అవుతారు. వంటరిగా ఎందుకు? నేనుకూడా నీతో పాటు వస్తాను పద.

అంటూ తయారవుతాడు. అతన్ని వదిలించుకోవాలంటే నేను ఇక్కడకు రావటం మానేయాలి. అందువలన రాలేకపోతున్నాను గానీ లేకపోతే నేను మాత్రం నీకు దూరంగా ఉండగలననుకున్నావా?" దిగులుగా అంది లలిత.

"భవిష్యత్తును గురించి ఆలోచించటానికే భయంగా ఉంది లలితా! అంతా శూన్యంగా కనిపిస్తుంది. మామయ్య ఆరోగ్యం పూర్తిగా దెబ్బతింది. ఆయన సంపాదన ఆయన మందులకు కూడా చాలటంలేదు. ఇల్లు గడవటమే కష్టంగా ఉంది. అత్తయ్య నగలు నాకు తెలియకుండా అమ్మి, ఆ డబ్బుతో ఇల్లు గడుపుతున్నారు. అలా ఎంతకాలం జరుగుతుంది. ఉద్యోగం దొరుకుతుందన్న ఆశ కనుచూపు మేరలో కనిపించటంలేదు." నిరాశగా అన్నాడు రాజేష్.

"నేను ఒకమాట చెబుతాను. వింటావా!"

"చెప్పు లలితా!"

"ఏదో ఒక ఉద్యోగం చూసిపెట్టమని, మా నాన్న గార్ని అడగరాదూ!"

"ఒకటి, రెండుసార్లు అడిగాను. ఆయన విని ఊరు కున్నారు లలితా! మీ నాన్నగారెందుకో నాతో ముభావంగా మాట్లాడుతున్నారు. అంతకుముందులా ఉండటంలేదు. బహుశా నేను నీతో చనువుగా ఉండటం ఆయనకు ఇష్టం లేదేమో."

"ఉద్యోగం చూసిపెట్టమని రెండుసార్లు అడిగాను. ఏం సమాధానం చెప్పలేదు."

"నేనుకూడా అడిగి చూడనా!"

"వద్దు. మీ నాన్నగార్కి కోపం వస్తుంది."

"మరేం చేస్తావు! మా బావ ఫోనీ, రోజు, రోజుకు శృతిమించి పోతుంది. నేనేదో తన పెళ్ళాన్ని అయినట్లు, నా మీద అధికారం చెలాయించాలని ప్రయత్నిస్తాడు. కోపంగా మాట్లాడితే మా నాన్నగారు నన్ను కసురుకుంటున్నారు."

"సమయానుకూలంగా మాట్లాడటం నేర్చుకోవాలి."

"నిన్ను చూడకుండా ఉండటం, ఇక నాకు సాధ్యం కాదు. మా నాన్నగారితో మాట్లాడు రాజేష్ మనిద్దరం పెళ్ళి చేసుకుంటేగాని, నాకు మా విలన్ బాధ తప్పదు."

"ఉద్యోగం దొరకకుండా నన్ను పెళ్ళి చేసుకుంటే ఎలా పోషించగలను లలితా!"

"మనిద్దరికీ పెళ్ళి జరిగితే, మన బ్రతుకు తెరువు ఎలా!"

"మా నాన్నగారికి, నేను ఒక్కదాన్నే కూతుర్ని కదా మా కున్న లక్షల ఆస్థికి నేనే వారసురాల్ని. నన్ను పెళ్ళి చేసుకున్న తర్వాత, నా ఆస్థి నీది కాదా!"

"నువ్వు గాలిమేడలు కడుతున్నావు లలితా! మన పెళ్ళికి మీ నాన్నగారు ఒప్పుకోరు. ఆయన్ని ఎదురించి మనిద్దరం పెళ్ళి చేసుకున్నా, ఆయన ఆస్థిలో చిల్లిగవ్వకూడా నీకు దక్కదు. అందుకే ముందు ఉద్యోగం సంపాదించుకుని ఆ తర్వాత పెళ్ళి చేసుకుంటే ఆయన బెదిరింపులకు భయ పడాల్సిన పని ఉండదు."

"ఈ విషయాలన్నీ ఆలోచించటానికి కూడా, నాకు భయంగా ఉంది."

"లలితా! నన్ను ప్రేమించి కోరి కష్టాలను తెచ్చు కుంటున్నావు. ఈ పరిస్థితులలో నువ్వు, నన్ను పెళ్ళి చేసు కుంటే, ఆస్థి అంతస్థులతో బాటు, అయిన వాళ్ళను కూడా వదులుకుని నాతో దుర్భర దారిద్ర్యాన్ని పంచుకోవాలి. ఒక మూర మల్లెపూలు కొనుక్కోవటానికి కూడా, నువ్వు డబ్బును గురించి ఆలోచించాల్సి వస్తుంది."

"ఫరవాలేదు."

"మరోసారి ఆలోచించు లలితా! ఆర్థిక యిబ్బంది అంటే, ఏమిటో కూడా నీకు తెలియదు. నన్ను పెళ్ళి చేసుకొని నువ్వు కష్టాలను తప్ప నాతో ఏ సుఖాన్ని అనుభవించలేవు. ఇప్పటికయినా మించిపోయింది లేదు. నా మాట విని మనస్సు మార్చుకుని, మీ నాన్నగారి ఇష్టమయిన వ్యక్తిని పెళ్ళి చేసుకుని హాయిగా ఉండు లలితా!"

"రాజేష్! నువ్వసలు మగాడివేనా?" కోపంగా పెద్దగా అరిచింది లలిత.

"లలితా! ఏమిటా వాగుడు? నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలిసే మాట్లాడుతున్నావా?" కోపంగా అన్నాడు రాజేష్.

"ఛీ. నీకు సిగ్గు లేదూ? నేను, నిన్ను మరచిపోయి మరో మగాడిని పెళ్ళిచేసుకోవాలా? నీ కళ్ళముందే నిన్ను ప్రేమించిన నేను మరోమగాడిని పెళ్ళి చేసుకుంటే, నువ్వు చూస్తూ కూర్చుంటావా? నలుగురి సమక్షంలో, నీ చేత తాళి కట్టించుకుంటే గాని నీకు భార్యను కానా? రాజేష్. నలుగురి సమక్షంలో పెళ్ళిచేసుకుంటున్నా, మానసికంగా ఇరువురూ మనస్సులు కలుపుకున్నా ఒకటే, మానసికంగా. నీకు నేను, నిన్ను ప్రేమించిన నాడే భార్య నయ్యాను. ఇప్పుడు నన్ను పోషించలేనేమో అన్న పిరికితనంతో నీ భార్యను మరో మగాడికి అప్పజెప్తావా? ఆ మాట అనటానికి నీకు సిగ్గు లేకపోయినా, వినటానికి నాకు అసహ్యంగా ఉంది.

ప్రేమప్రవాహాన్ని అరికట్టే శక్తి ఆ అంతస్తులకు లేదు. అవి కట్టిన అడ్డుగోడ, ఆ ప్రవాహానికి నిలవలేదు, నువ్వు పిరికి వాడివి. అనుకున్నాను. గానీ, మరీ ఇంత పిరికివాడివి అనుకో లేదు. నేను నిన్ను ప్రేమించాను. ఎటువంటి విషమపరిస్థితులు ఎదురయినా, ఎంతమందిని ఎదురించి అయినా నిన్నే పెళ్ళి చేసుకుంటాను. అంతేగాని, పరిస్థితులతో రాజీపడి ప్రేమించిన నిన్ను కాదని, మరో మగాడికి ఇల్లాలిని కాలేను."

"ఇప్పుడు నీచేయి అందుకుని, నీ భార్యగా నీతో కలిసి నడవటానికి నేను సిద్ధంగా ఉన్నాను." ఆవేశంగా అంది లలిత.

లలిత అంత ఆవేశంగా మాట్లాడటం ఎప్పుడూ చూడని రాజేష్, ఆశ్చర్యంగా కొత్తమనిషిని చూస్తు న్నట్టుగా లలితను చూస్తూ కూర్చున్నాడు.

"లలితా!" తన ప్రేమనంతా, ఆ మూడక్షరాల లోనే పొదిగి పిలిచాడు రాజేష్.

"ఏమిటి? చెప్పదలుచుకున్న శ్రీరంగ నీతులు, ఇంకే మయినా మిగిలాయా?"

"నాకోసం నువ్వింత త్యాగం చెయ్యగలవను కోలేదు."

"నువ్వు నన్ను అర్థం చేసుకోగలిగితే, నిన్ను మరిచి పోయి, మరో మగవాడిని పెళ్ళి చేసుకోమని చెప్పగలిగే వాడివే కాదు."

"నీ మనసు తెలుసుకోకుండా, మాట్లాడాను. సారీ లలితా!"

"ఇక వెళదాం పద."

"అప్పుడేనా!"

"రాత్రంతా ఇక్కడే ఉందామా!"

"అందుకు నాకేం అభ్యంతరం లేదు."

"మనకు అభ్యంతరం లేకపోయినా, మన పెద్దవాళ్ళకు అభ్యంతరమే."

"మళ్ళీ నీ దర్శనం ఎన్ని రోజులకో."

"రేపు సాయంత్రం ఇదే టయానికి. ఓలిపిగా నవ్వుతూ అంది లలిత.

"నిజం." నమ్మలేనట్టుగా అడిగాడు రాజేష్.

"మా విలన్‌గారు లేరుగా."

"రేపు కాలేజినుంచి, నరానరి ఇక్కడికే వచ్చి నీ కోసం ఎదురు చూస్తూ కూర్చుంటాను."

"నేను ఈ రాత్రే మన విషయం అంతా మా నాన్న గారితో చెప్పి, ఆయన్ని ఎలాగయినా పెళ్ళికి ఒప్పించి, నీకు శుభవార్త చెబుతాను." అంటూ లేచింది లలిత.

లలితను అనుసరించాడు రాజేష్.

# 7

సాయంత్రం అయిదు గంటలు దాటుతుంది. అప్పటికే గంటసేపటినుంచి లలిత కోసం ఎదురు చూస్తూ అక్కడ కూర్చున్నాడు రాజేష్. ఆరుగంటల టయుములో వచ్చింది లలిత.

లలితను చూడగానే, తన కళ్ళను తనే నమ్మలేక పోయాడు రాజేష్. ఎంతో సేపటినుంచి ఏడుస్తున్నట్టుగా కళ్ళు ఎర్రగా ఉబ్బి ఉన్నాయి. ఉదయంనుంచి భోజనం చెయ్య నట్టుగా ముఖం పీక్కుపోయి ఉంది.

లలిత, రాజేష్‌కు దగ్గరగా కూర్చుంది. లలిత ముఖం చూడగానే అర్థం చేసుకున్నాడు రాజేష్ లలితా వాళ్ళ నాన్నగారు పెళ్ళికి ఒప్పుకోలేదని. ఏం జరిగింది లలితా! అని లలితను అడగటానికే భయంగా ఉంది రాజేష్‌కు. లలిత నోటినుంచి ఎటువంటి వార్త వినవలసి వస్తుందో అని

"బాధపడకు లలితా!" అనునయంగా అన్నాడు రాజేష్. ఆ అనునయానికి కరిగిపోయిన లలిత కన్నీటిని ఆపుకోలేక పోయింది. లలితను ఏమని ఓదార్చాలో కూడా అర్థంగాక మౌనంగా చూస్తూ వూరుకున్నాడు రాజేష్.

"మన పెళ్ళికి మానాన్నగారు ఒప్పుకోలేదు రాజేష్."

"ఆయన ఒప్పుకోరని, మనకు ముందునుంచి తెలుసుగా బాధపడటం ఎందుకు?"

"ఆయన ధోరణి ఆయనదే గాని, నేనెంత ప్రాధేయ పూర్వకంగా చెప్పినా, నా మాట వినిపించుకోరు డబ్బులేని మనిషి, మనిషే కాదు ఆయన దృష్టిలో. నేను, నిన్ను పెళ్ళి చేసుకుంటే ఆయన పరువు పోతుందట. నీలాంటి అనామకు డితో ఆయన బ్రతికుండగా నా పెళ్ళి జరగనివ్వరంట. నా నోటితో చెప్పలేను అంత కటువుగా మాట్లాడారు నిన్ను గురించి. రాత్రంతా, ఎన్ని విధాలా ప్రాధేయపడాలో అన్ని విధాలా ప్రాధేయపడి చెప్పాను. అయినా మన పెళ్ళికి ఒప్పు కోలేదు. మనిద్దరికి పెళ్ళి చేయమని ఆ తర్వాత, ఆయన పరువు ప్రతిష్టలకు భంగం కలగకుండా, ఈ ఊరినుంచి వెళ్ళి పోతామని కన్నీటితో చెప్పాను. నా రోదన అరణ్యరోదనే అయింది" ఏడుస్తూ చెప్పింది లలిత.

"ఎలా జరగాలనుంటే అలా జరుగుతుంది. బాధ పడి మాత్రం చెయ్యగలిగిందేముంది?"

"విధి అనీ, ఖర్మ అనీ సరిపెట్టుకోవటం మనిషి తన చాతకానితనాన్ని కప్పిపుచ్చుకోవటమే. ఆయనకు చెప్పటం మన బాధ్యత కాబట్టి, చెప్పాను. ఆయన ఒప్పుకోలేదు. అందుకు మనమేం చెయ్యగలం? పదిరోజులు టయమిచ్చాను. ఈ పదిరోజులు ఆలోచించుకుని, అంతస్థుల్ని గురించి ఆలో చించకుండా నీతో నా పెళ్ళి జరిపిస్తే సరేసరి. లేకపోతే ఆయన

పరువు ప్రతిష్టలను గురించి ఆలోచించకుండా, నేను నిన్ను ఏ గుళ్ళోనో పెళ్ళి చేసుకుంటానని ఖచ్చితంగా చెప్పాను."

పదిరోజుల తర్వాత మాత్రం, ఆయన ఒప్పుకుంటారని నమ్మకం ఏముంది?"

"ఒప్పుకోకపోతే, గుళ్ళో దండలు మార్చుకుని పెళ్ళి అయిందనిపించుకుందాం."

"బ్రతుకు తెరువు ఎలా?"

"ముందు ఏ సమస్యలూ ఎదురవ్వకుండా, పెళ్ళి జరగనివ్వు. బ్రతుకు తెరువు సంగతి తర్వాత ఆలోచిద్దాం."

"మన విషయం మామయ్యతో చెప్పనా?"

"ఆయన మాత్రం ఒప్పుకుంటారని నమ్మకం ఏముంది? ఈ పదిరోజులు గడిచిన తర్వాత, మా నాన్నగారు మనసు మార్చుకుంటే, ఆయనే మీ మామయ్యతో మాట్లాడతారు."

"లలితా! నా కోసం నువ్వు చేస్తున్న త్యాగానికి సంతోషంతో నా మనస్సు పొంగిపోతుంది, నీకెలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో కూడా నాకర్థం కావటంలేదు. ఉద్యోగం దొరకకపోతే, కూలీచేసి అయినా నిన్ను పోషించుకుంటాను."

"మగాడివనిపించావు. సమస్యలను ధైర్యంగా ఎదుర్కోవాలి గానీ, పిరికితనంతో సమస్యలకు దూరంగా పారిపోకూడదు. ఇప్పుడు, నిన్ను ప్రేమించినందుకు, నేను గర్వపడే మాటన్నావు. వయస్సులో ఉన్న ఆడపిల్ల కోరుకునేది ఆస్థి

అంతస్థులను కాదు. తను వలచి, వలపించుకున్న మగవాని సాహచర్యాన్ని. రాజేష్, బ్రతుకు తెరువు సంగతి నేను చూసుకుంటాను. ఈ విషయాన్ని గురించి ఆలోచిస్తూ మనస్సు పాడుచేసుకోకు."

"నా మనస్సును, అర్థం చేసుకోగలిగిన నిన్ను నా భార్యగా పొందగలగటం నా అదృష్టం." అంటూ హద్దులు దాటిన ఆనందంతో, లలితను తన వళ్ళోకి లాక్కొని, ఆమె కనురెప్పలపై సున్నితంగా ముద్దుపెట్టుకున్నాడు. ప్రియుని స్పర్శానుభూతి, అణువు అణువునా విద్యుత్ ప్రవహించి నట్టుగా అనిపించింది లలితకు. ఆ కౌగిలే తన సర్వస్వం అన్నట్టుగా, రాజేష్ గుండెలకు మరింతగా హత్తుకుపోయి కళ్ళు మూసుకుంది లలిత.

క్షణాలు, నిముషాలుగా మారిపోతున్నాయి. లలితను చుట్టిన రాజేష్ చేతులు, లలితచుట్టూ మరింతగా బిగుసుకుంటున్నాయి. లలిత ముఖాన్ని ముద్దులతో నింపుతున్నాడు. అతని చేతులు లలిత అణువు అణువునూ తడుముతున్నాయి. జరగబోయే ప్రమాదాన్ని గుర్తించిన లలిత, అతిప్రయత్నం మీద అతని కౌగిలినుంచి తప్పించుకుని దూరంగా జరిగి కూర్చుంది.

"మీ మగబుద్ధి పోనిచ్చుకున్నావు కాదు. శాస్త్ర చోటి స్తేహాలు పూర్తిగా ఆక్రమించుకుందామనుకుంటావు."

"అది మా మగవాళ్ళ తప్పుకాదు. ముందు, చోటి వ్వటం మీ తప్పు"

"ఇచ్చిన దాంతో సరిపెట్టుకోవటం, మీ మగలక్షణం కాదు."

"కాస్త చోటుతో, సరిపెట్టుకోలేమని తెలిసే అందీ, అందనట్టుగా ఆడించటం మీ ఆడవాళ్ళ లక్షణం."

"అమ్మో, మాటలతో నిన్ను గెలవటం చాలా కష్టం. నీ మాటలకే అమ్మాయిలు మోసపోతారు."

"ఏదీ! ఏ అమ్మాయీ, నా మాటలకు మోసపోయి నన్ను ప్రేమించానంటూ, రాలేదే!" హాస్యంగా నవ్వుతూ అన్నాడు రాజేష్.

"నీ క్లాస్‌మేట్ వనజ, రాణి నిన్ను ప్రేమించారనీ, నీకు ప్రేమలేఖలు వ్రాసారని కూడా నాకు తెల్సు. అంతే కాదు. మరో శుభ అనే అమ్మాయి నువ్వు ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోకపోతే ఆత్మహత్య తనకు శరణ్యం అని నీకు లెటరు వ్రాసిందనీ, ఆ లెటరు చదివిన నువ్వు ఆ అమ్మాయి అన్నంత పనీ చేస్తుందేమో అన్న భయంతో, ఆ లెటరు తీసుకెళ్ళి ఆ అమ్మాయి పెద్దవాళ్ళకు చూపించి నేను ఒక అమ్మాయిని ప్రేమించాను. నా మనస్సులో మరో అమ్మా యికి ఖాళీలేదు. అందువలన నన్ను ప్రేమించిన నేరానికి మీ అమ్మాయి ఏ అఘాయిత్యానికి పాలువడకుండా మీ

అమ్మాయిని మీరు రక్షించుకోండి అని చెప్పి వచ్చావని కూడా నాకు తెల్సు. నీది రామావతారం అయినా, క్రిష్ణావతారం అనుకుని చాలా మంది అమ్మాయిలు నిన్ను ప్రేమిస్తున్నారు పాపం. వాళ్ళ ఖర్మ." హాస్యంగా నవ్వుతూ అంది లలిత.

"అవునూ. నీకీ విషయాలన్నీ ఎలా తెల్సు!"

"నేను కాపురం ఉండేది నీ మనస్సులోనే కదా! అందుకే, నీ రహస్యాలన్నీ నాకు తెల్సు."

"నన్నెన్నో భరించలేక పోతున్నాను. నీకెలా తెల్సు చెప్పు!"

"నిన్ను గురించి తెల్సుకోవటమేగా నా పని. అందుకే తెలిసాయి."

"నువ్వు చెప్పిన విషయాలన్నీ నిజమే. నాకుగా నేను ఈ విషయాలు ఎవరికీ చెప్పలేదు. నీకెలా తెలిసాయి!"

ఆ మాత్రం అర్థం చేసుకోలేవూ? శోభ, నా క్లాస్ మేట్ శైలజకు అక్క. శైలజ ద్వారా శోభ విషయం తెలిసింది. అలాగే మిగతా విషయాలూ." నవ్వుతూ అంది లలిత.

"లలితా! నేను రేపు హైద్రాబాదు వెళుతున్నాను. వచ్చేసరికి నాలుగు, అయిదు రోజులు పడతుంది."

"అమ్మో అన్ని రోజులా! అసలు హైదరాబాదు వెళ్ళటం ఎందుకు!"

"ఉద్యోగం కోసం."

"ఎవరిస్తామన్నారు?"

మామయ్య స్నేహితుడు అక్కడ పెద్ద బిజినెస్ మ్యాగ్నేట్. మామయ్య నన్ను గురించి, ఆయనకు లెటరు వ్రాసారు. తప్పకుండా ఏదో ఒక ఉద్యోగం ఇప్పిస్తాను. వెంటనే నన్ను అక్కడకు పంపించమని ఆయన మామయ్యకు లెటరు వ్రాసారు. నాకయితే ఉద్యోగం దొరుకుతుందన్న నమ్మకం లేదు. మామయ్య బలవంతం మీద వెళుతున్నాను."

"ఆయన తప్పకుండా నీకుద్యోగం ఇప్పిస్తారు. నాకెందుకో నమ్మకంగా ఉంది."

"నీ అదృష్టంకొద్దీ, ఉద్యోగం దొరికితే మనిద్దరం త్వరలో భార్యా భర్తలం వుతాము."

"ఇంతకీ నీ ప్రయాణం ఎప్పుడు?" రేపేనా?"

"అవును."

"డబ్బెంత కావాలి?"

మామయ్య ఎవర్నో అడిగి ఒక వందరూపాయలు తీసుకువచ్చాడు."

"రానూ, పోనూ ఖర్చులే వందరూపాయలు అవుతాయి కదా? ఒకవేళ ఒక వారం రోజులు అక్కడే ఉండాలంటే ఎలా? కనీసం అయిదువందలన్నా ఉంటేగాని సిటీలో

పదిరోజులు గడవలేవు. నేను ఇంటికెళ్ళి డబ్బు తీసుకొని నీ దగ్గరకు వస్తాను. ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లు చూసుకో." అంటూ వెళ్ళటానికి లేచింది లలిత.

"లలితా! నువ్వు అంతడబ్బు ఎక్కడ తీసుకొస్తావు? మీ నాన్నగార్ని అడగవలసిందేగా!"

"అక్కరలేదు. నేను రెండు సంవత్సరాల నుంచి పావలా బిళ్ళలు, రూపాయి బిళ్ళలు ఒక డబ్బాలో వేసుకుంటున్నాను. ఆ డబ్బా నా బట్టల బీరువాలోనే ఉంటుంది. మొత్తం వెయ్యిరూపాయలపైనే అవుతాయి. అవి తీసుకెళ్ళి నాలుగు రోజులు ఆలస్యం అయినా, ఉండి ఉద్యోగం సంపాదించుకుని రా."

"చిత్తం దేవతను ఆరాధించే భక్తుడికి, ఆ దేవతను ఎదిరించే శక్తి ఉంటుందా? నేను లలితాదేవి భక్తుడిని. ఆ దేవి ఏం చెయ్యమంటే, అది చెయ్యటమే నా డ్యూటీ."

"పెళ్ళికాక ముందు, ప్రతి మగాడూ తను ప్రేమించే అమ్మాయితో ఇలాంటి కబుర్లే చెబుతాడు. ప్రేమించేటప్పుడు దేవతగా కనిపించే అమ్మాయే పెళ్ళి అయింతర్వాత మగాడికి దెయ్యంలా కనుపిస్తుంది."

"నువ్వు మా మగవాళ్ళను గురించి, మరీ అన్యాయంగా మాట్లాడుతున్నావు. పెళ్ళికాక ముందు మీ ఆడవాళ్ళు తాను ప్రేమించే మగాడితో ఎన్నో తియ్యని కబుర్లు చెబుతారు. పెళ్ళి అయిందగ్గర్నుంచి చీటికీ, మాటికీ కసురు

కుంటూ, మొగుణ్ని వేధించటమే జీవితలక్ష్యం అన్నట్టుగా ప్రవర్తించుతారు." హాస్యంగా నవ్వుతూ అన్నాడు రాజేష్.

"ఇప్పుడు మనిద్దరం వాదించుకోవటం ఎందుకు? రేపు పెళ్ళి అయినతర్వాత, ఎవరుఎలా ప్రవర్తించుతారో అను భవపూర్వకంగా తెలుసుకుందాం సరేనా?" నవ్వుతూ అరిది లలిత.

"అలా బావుంది." లలితతో బాటు నవ్వుతూ అన్నాడు రాజేష్.

వాళ్ళవీధి మలుపువద్గర రాజేష్ నిల్చున్నాడు. లలిత ముందు వెళ్ళిపోయింది. లలిత ఇంటికి వెళ్ళిన పది నిముషాల తర్వాత, వాళ్ళ ఇంటివైపు వెళ్ళాడు రాజేష్.

# 8

రాత్రి తొమ్మిది గంటలవుతుంది. అనారోగ్యం మూలంగా ఆరుగంటలకే భోంచేసి, తన గదిలోకి వెళ్ళి పడుకుంటారు. రాఘవరావుగారు. ముగ్గురి భోజనాలు అయి పోయిన తర్వాత, వంటగది సర్ది, పగలంతా పనులతో అలసి పోయి ఉండటం వలన, తన గదిలోకి వెళ్ళి నిద్రపోయింది వాణి.

ఆరుబయట కుర్చీ వేసుకుని కూర్చున్నాడు రాజేష్. తొమ్మిదిన్నరకు రాజేష్ దగ్గరకు వచ్చింది లలిత.

"ఆలస్యం అయింది. ఇప్పటివరకు, నాన్నగారు ఎవరి తోనో మాట్లాడుతూ, వరండాలోనే కూర్చున్నారు. అందు వలన ఇప్పటి వరకూ ఆగాను."

రాజేష్ కుర్చీకి దగ్గరగా, వంరడా మెట్లమీద కూర్చుంది లలిత. రాజేష్ కూడా కుర్చీలోనుంచి లేచి, లలిత పక్కనే మెట్లమీద కుర్చున్నాడు.

"లలితా! ఈ టయములో, ఇక్కడకు రావటం అంత మంచిది కాదు. వెంటనే వెళ్ళు."

"అబ్బ! అ సంగతి నాకు తెల్సులే. నేను చెప్పేది విను. ఇవిగో ఇవి పదిహేను వందలు, వీటితో బాటు ఈ బ్యాగ్‌లోనే, నావి నాలుగు బంగారు గాజులుకూడా పెట్టాను. అవసరం అయితే, అ గాజులు అమ్మి, లంచం ఇచ్చి అయినా సరే. ఉద్యోగం సంపాదించుకుని రా."

"లలితా! ఈ డబ్బుచాలు. నీ గాజులు నా చేతులతో అమ్మలేను, ప్లీజ్. గాజులు తీసుకెళ్ళు." బ్యాగ్‌లోనుంచి గాజులు తీసి లలిత కివ్వబోయాడు రాజేష్.

"నేను, నీ దాన్ని కాదా? రాజేష్ నా మాట విను. ఈ రోజుల్లో లంచం లేనిదే ఏ పని జరగదు. నాలుగు వేలు లంచం ఇస్తే, నీకు మంచి ఉద్యోగం దొరకొచ్చు. ఇలాంటి సెంటిమెంట్స్ పెట్టుకుంటే నువ్వు ఉద్యోగం సంపాదించుకో లేవు. రేపు నువ్వు సంపాదించే టప్పుడు, ఇలాంటి బంగారు

గాజులు నాలుగు జతలు చేయించుకుంటాను. ఉద్యోగం వచ్చే అవకాశాన్ని చేతులారా పోగొట్టుకో వద్దు."

ఆ గాజులు బ్యాగ్‌లో పెడుతూ అంది లలిత.

లలిత మాటకు ఎదురు చెప్పలేకపోయాడు రాజేష్.

"లలితా! నువ్వు నా పాలిట దేవతవు."

"ఇలాంటి సినిమా డైలాగులు మానేయి. నువ్వు ఉద్యోగం చేస్తూ సంపాదన మొదలు పెడితే నీ సంపాదన అనుభవించేది నేను కాదా?"

"అన్నిటికీ అన్నీ చెబుతావు. నీతో ఎలా?"

"మళ్ళీ హైదరాబాదు నుంచి వచ్చింతర్వాత కలుసుకుందాం. నాన్నగారు ఇంటికి వస్తారేమో ఇక వెళతాను. నేను చెప్పిన విషయాలన్నీ గుర్తున్నాయి కదూ?"

"అన్నీ గుర్తున్నాయి కానీ, లలితా! నాదో చిన్న కోరిక." లలితకు దగ్గరగా జరుగుతూ అన్నాడు రాజేష్.

"ఆ కోరిక ఏమిటో, త్వరగా శెలవు ఇవ్వండి,"

చిలిపిగా నవ్వుతూ అంది లలిత.

"నేను, నాలుగురోజులు నీకు దూరంగా, వెళుతున్నాను కదా? అందుకని." ఆ పైన చెప్పలేక పోయాడు రాజేష్.

"ఊ. చెప్పు. అందుకని ఏం చెయ్యమంటావు? నీ వాలకం చూస్తుంటే, హైదరాబాదు కాదు అమెరికా వెళుతున్నట్టుగా ఉంది."

"ఇన్ని రోజులు నిన్ను చూడకుండా, ఎలా ఉండాలా అని నేను బాధ పడుతుంటే, నీకు నవ్వులాటగా ఉందా?"

"నాలుగురోజులు ఎంతలో గడిచిపోతాయ్!" నవ్వుతూ అంది లలిత.

"నాకు నాలుగు యుగాలు అయినట్టుగా ఉంటుంది నిన్ను నాలుగు రోజులు చూడకపోతే, లలితా. ఒక్కసారి నిన్ను గుండెలకు హత్తుకోనివ్వు." లలితను తన వైపుకు తిప్పుకుంటూ అన్నాడు రాజేష్.

"ఈ మాట అడగటానికి, ఇంత సేపు సంకోచించాలా," నవ్వుతూ అంటూ, రాజేష్ గుండెల్లో వదిగి పోయింది లలిత. తనివితీరా లలితను హృదయానికి హత్తుకుని లలిత నుదిటిమీద సున్నితంగా ముద్దు పెట్టుకున్నాడు రాజేష్.

ఎక్కడో గడియారం పది గంటలు కొట్టింది. ఆ చప్పుడుకు ఉలికి పాటుగా, రాజేష్ కౌగిలినుంచి దూరంగా జరిగింది లలిత.

"లలితా! టయము పదిగంటలయింది. ఇక వెళ్ళు."

"అలాగే." అంటూ, చప్పుడు కాకుండా గేటు తీసుకుని వెళ్ళిపోయింది లలిత. గేటు మూసి వచ్చి కూర్చున్నాడు రాజేష్.

లలిత వెళ్ళిపోగానే, కళ్ళముందు మెరుపు మెరిసి
మాయమయినట్టగా అనిపించింది రాజేష్‌కు. లలిత అందిం
చిన తీయని అనుభూతి, అతని మనస్సులో నుంచి ఇంకా
తొలగిపోలేదు. ఆ మధురమయిన అనుభూతిని నెమరు వేసు
కుంటూ, అలాగే కూర్చున్నాడు రాజేష్,



లలిత ఊహించినట్టుగానే, ఉద్యోగ ప్రయత్నంలో
నెలరోజులు హైదరాబాదులో ఉండవలసి వచ్చింది రాజేష్.
లలిత, గాజులమ్మకూడా ఉండాలనుకున్నా, తెచ్చిన డబ్బు
అయిపోవటంతో తప్పనిసరిగా రమ్మన్నాడు. గాజులమీద
డబ్బును లంచంగా ఇచ్చి, చివరకు ఎలాగయితేనేం నెలకు
ఆరువందలు వచ్చే గవర్నమెంటు ఉద్యోగాన్ని సంపాదించు
కొగలిగాడు. ఉద్యోగంలో జాయినయ్యి, ఒక వారం రోజులు
గడిపిం తర్వాత శెలవు పెట్టి ఇంటికి వచ్చాడు రాజేష్.

లలితను కలుసుకొని, ఉద్యోగం దొరికిందన్న వార్తను
ఎప్పుడెప్పుడు చెప్పాలా అని ఆత్రుతగా ఉంది రాజేష్‌కు.
లలిత కోసం రెండుసార్లు, వాళ్ళ ఇంటికి వెళ్ళినా, లలిత కను
పించలేదు. ఉదయం ఎనిమిది గంటలనుంచి, లలిత కనుపిస్తుం
దేమోనని, సాయంత్రం అయిదు గంటలవరకూ వరండా

లోనే కూర్చున్నాడు. రాజేష్ వాళ్ళ వరండాలో కూర్చుంటే లలిత బయటకు వస్తే కనపిస్తుంది.

లోపలి నుంచి, బయటకు వస్తున్న లలిత కనపించ గానే ప్రాణం లేచివచ్చినట్టు అనిపించింది రాజేష్‌కు. వరుగెత్తుతున్నట్టుగా, లలితా వాళ్ళ గేటు దగ్గరకు వచ్చి "లలితా నేను కాలవ గట్టువైపు వెళుతున్నాను. త్వరగా రా". అంటూ లలితకు మాట్లాడేందుకు అవకాశం ఇవ్వకుండా కాలవవైపు నడిచాడు రాజేష్.

వెంటనే అక్కడకు వచ్చింది లలిత.

"నీ కోసం ఉదయం నుంచి ఎదురు చూస్తున్నాను ఇంతవరకూ, నీ దర్శనమే కాలేదు. లలితా! నాకుద్యోగం దొరికింది. నెలకు జీతమెంతో తెలుసా ఆరువందలు. ఉద్యోగంలో జాయినయి కూడా వారం రోజులయింది. నీ గాజుల మ్మకూడదని ఎంతో ప్రయత్నించాను. లంచం ఇస్తేగాని ఉద్యోగం దొరికేలాలేదు."

"తప్పని సరై అమ్మాను. ఆ డబ్బుతోనే ఉద్యోగం సంపాదించుకున్నాను. మా ఆఫీసుకు దగ్గరలో ఇల్లు కూడా అద్దెకు తీసుకున్నాను. రెండే గదులు. ఆ రెండు చిన్న గదులకే వందరూపాయలు అద్దె. మనిద్దరికీ సరిపోతుంది లలితా. ఇప్పుడు ధైర్యంగా మీ నాన్నగారిని మన పెళ్ళివిషయం మాట్లాడతాను. ఆయన ఒప్పుకుంటే మన అదృష్టం.

వచ్చాకోపోయినా మనిద్దరం హైదరాబాదు వెళ్ళిపోయి అక్కడే రిజిష్టర్ మ్యారేజి చేసుకుందాం."

లలిత మాట్లాడకుండా, చిన్న, చిన్న గులక రాళ్ళను నీళ్ళలోకి విసురుతూ కూర్చుంది.

తనకుద్యోగం దొరికిందని చెప్పగానే, సంతోషంతో లలిత పొంగిపోతుందనీ, తన గుండెల్లో వదిగిపోతుందనీ, పెళ్ళి చేసుకుందాం అని తనను తొందర పెడుతుందని ఏమేమో ఊహించుకున్న రాజేష్ ఊహాలన్నీ తారుమారు అయ్యాయి. లలిత ముఖంలో ఎలాటి సంతోషమూ కనిపించటంలేదు.

"లలితా! ఏమిటి అలా ఉన్నావు? నాకుద్యోగం దొరికినందుకు నీకు సంతోషంగా లేదా?" లలిత ముఖాన్ని తనవైపుకు తిప్పుకుంటూ అన్నాడు రాజేష్.

"కంగ్రాట్యులేషన్స్." ముక్తసరిగా అంది లలిత.

లలిత మౌనం, రాజేష్ మనస్సును కాల్చి వేస్తుంది. లలిత ఎందుకలా ఉందో, రాజేష్‌కు అర్థం కావటం లేదు.

"లలితా! ఆలస్యం ఎందుకు? మనపెళ్ళి విషయం మీ నాన్నగారితో మాట్లాడనా?"

"వద్దు."

"ఎందుకు లలితా? ఇప్పుడు మనం బతుకు తెరువును గురించి కూడా ఆలోచించుకోవాల్సిన పనిలేదు."

"మా నాన్నగారు వప్పుకోలేదు."

"సరే. చేసేది ఏముంది? రేపు రాత్రికి హైదరాబాదు వెళ్ళిపోదాం. అక్కడే రిజిష్టరు మ్యారేజి చేసుకుందాం. నీ వెంట సూట్ కేస్ కూడా తీసుకురావద్దు. మామూలుగా స్నానం చేసి చీరమార్చుకో. రేపు సాయంత్రం అయిదు గంటలకు ఇక్కడకు రా. నీకోసం నేనిక్కడే ఉంటాను. ఇద్దరం కలిసివెళ్ళిపోదాం."

"అంటే, నేను నీతో పారిపోవటమేగా?"

"నాకూ, నలుగురి సమక్షంలోనే, నిన్ను పెళ్ళి చేసుకోవాలని ఉంది. కానీ ఏం చేస్తాం? మనకా అదృష్టం లేదు. ఇంతకంటే మరోమార్గం లేదు."

"మనిద్దరం లేచిపోతే నలుగురూ ఏమనుకుంటారు?"

"నలుగురి సంగతి మనకెందుకు? ఇప్పుడు ఆ నలుగురూ వచ్చి, మీ నాన్నగార్ని ఒప్పించి మనకు పెళ్ళి జరిపిస్తున్నారా? ఇతరుల సంగతి మనకెందుకు? మన సంగతి మనం చూసుకుందాం. అయినా ఎవరు ఏమనుకున్నా, మనం వినంగా?"

"రాజేష్ మా నాన్నగారికి నేను ఒక్కగా నొక్క కూతుర్ని. చిన్నతనం నుంచీ, నా మీద ఎన్నో ఆశలు పెంచుకొని నన్ను కళ్ళలో పెట్టుకుని పెంచిన అమ్మానాన్నకు చెప్పకుండా నీతో పారిపోయి వాళ్ళను అవమానానికి గురి చేయటం న్యాయమేనా? తన కూతురు లేచిపోయిందని, నలు

గురూ నన్ను గురించి నాన్నగారి ఎదుటే తేలికగా మాట్లాడు తుంటుంటే అవి వింటూ నాన్నగారు బ్రతకగలరా?"

"అంటే? ఇప్పుడేం చేద్దామంటావు? అసలు నీ ఉద్దేశ్యం ఏమిటి?" విసుగ్గా అన్నాడు రాజేష్.

"నా స్వార్థం నేను చూసుకుని మా అమ్మానాన్నను బాధపెట్టలేను రాజేష్."

"లలితా! నువ్వేనా ఈ మాట అంటున్నది? నీకేమయింది? ఎందుకిలా మారిపోయావు?"

"నాకేమీ కాలేదు, చూడు రాజెష్. వేడిరక్తం ఉరకలు వేసే వయస్సులో మనం తీసుకునే నిర్ణయాలు మనకు అందంగానే కనిపిస్తాయి. ఆవేశం చల్లారింతర్వాత, మనం చేసుకున్న దానికి ఫలితం అనుభవించేటప్పుడు, మనమెంత పొరపాటు చేసామో అర్థమవుతుంది. అప్పుడు ఎంత బాధ పడ్డా ప్రయోజనం ఉండదు. అందుకే మన పెద్దవాళ్ళు వియ్యానికయినా, కయ్యానికయినా సమమయిన వాళ్ళు కావాలంటారు."

"వివాహం అనేది, ప్రతి మనిషి జీవితానికీ ఒక పెద్ద మలుపులాంటిది ఆ మలుపులో ఏ మాత్రం అజాగ్రత్తగా అడుగువేసినా దాని ఫలితం జీవితం అంతా అనుభవించాలి. అందుకే, నేను బాగా ఆలోచించి ఈ నిర్ణయానికి వచ్చాను, హంస, కాకుల గూటిలో కాపురం చెయ్యలేను. కలిమిలో పుట్టి కలిమిలో పెరిగిన నేను, లేమితో చేయి కలిపి నడవలేను నువ్వు సంపాదించేది నెలకు ఆరువందలు దాంతో మనిద్దరం,

మీ మామయ్య, మీ వాణి నలుగురం బ్రతకాలి. ఇంకా నీకు బాధ్యతలు చాలా ఉన్నాయి. మీ ముసలిమామయ్య పెళ్ళికెదిగిన వాణికి పెళ్ళి చేయాల్సిన బాధ్యత కూడా నీకుంది. ఇన్ని బాధ్యతలతో బంధీనయిన నిన్ను పెళ్ళి చేసుకుని నేను మాత్రం ఏం సుఖపడగలను చెప్పు. నిన్ను పెళ్ళి చేసుకుంటే, మా నాన్నగారు ఆయన ఆస్తినంతా ఏ అనాథ ఆశ్రమానికో రాసేస్తారు. జీవితాన్ని పూలబాటగా మార్చుకున్నా, ముళ్ళబాటగా మలుచుకున్నా అది మన తెలివితేటల మీద ఆధారపడి ఉంటుంది. మూర్ఖత్వంగా అందర్ని అన్నీ వదులుకుని నిన్ను పెళ్ళి చేసుకుని నా జీవితాన్ని నరకంగా మార్చుకోవటం నాకిష్టం లేదు. మా నాన్నగారు, మా అంతస్తుకు తగిన వ్యక్తితో నా పెళ్ళి జరిపిస్తారు."

"ఆయన చెప్పినట్టు విని ఆయన కుదిర్చిన సంబంధాన్ని చేసుకుంటే, నా మంచి చెడులను గురించి ఆయనే ఆలోచించుకుంటారు. ఆయన్ని ఎదిరించి నిన్ను చేసుకుంటే అన్నివిధాలా నష్టపోతాను. ప్రేమ అనేది జీవితంలో ఒక భాగం మాత్రమే. ప్రేమ పేరుతో, ప్రేమ కోసం జీవితాన్ని నరకం చేసుకోవటం పిచ్చితనం రాజేష్. నన్ను నా స్నేహాన్ని ఒక కలగా మరిచిపోయి, నీ అంతస్తుకు తగిన అమ్మాయిని పెళ్ళిచేసుకుని హాయిగా ఉండు. నన్ను పెళ్ళి చేసుకున్నా, నీకు కూడా సుఖం ఉండదు. ఎందుకంటే, కలవారి అమ్మాయిని చేసుకున్నానే ఏ విధంగానూ సుఖపెట్టలేక

పోతున్నానే అని నీలో నువ్వు ఎప్పుడూ బాధపడుతూ ఉండాలి. కోరి పేదవాణ్ని పెళ్ళి చేసుకుని పావలా మల్లెపూలకు కూడా ముఖం వాచిపోతున్నాను అని నేను బాధపడాలి ఇద్దరం కీచులాడుకుంటూ గడిపేకంటే, ఎవరి అంతస్తుకు తగిన వాళ్ళను వాళ్ళం పెళ్ళి చేసుకుని, మనిద్దరం హాయిగా ఉండటం మంచిది కదా? రాజేష్, వయస్సుపెట్టే తొందరలో నీకు ఆశలు కల్పించాను. అందుకు నన్ను క్షమించు. ఆవేశ పడకుండా నా మాటలు అర్థం చేసుకో." అని చాలా తేలికయిన విషయం అన్నట్టుగా చెప్పింది లలిత.

లలిత చెప్పే ఒక్కొక్క మాటా, ఒక్కొక్క శూలంలా రాజేష్ మనస్సును గాయం చేస్తుంటే, ఆలోచించటానికి కూడా శక్తిలేనట్టుగా అతని మెదడు మొద్దుబారి పోయింది. ఆషాక్ నుంచి తేరుకోవటానికి రాజేష్‌కు పదినిముషాలు పట్టింది.

"లలితా! ఈ విషయాలన్నీ, నన్ను ప్రేమించేముందు ఆలోచించుకోలేదా?" మాటలు కూడదీసుకుంటూ అన్నాడు రాజేష్.

"చెప్పానుగా, వయస్సు పెట్టే అల్లరిలో ఏదిమంచో, ఏది చెడో ఆలోచించుకోలేక పోయాను."

"లలితా." పెద్దగా అరిచాడు రాజేష్. అది అరుపులా లేదు. అగాధంలో కూరుకుపోతున్న మనిషి ప్రాణభయంతో చేసిన ఆర్తనాదంలా ఉంది.

"లలితా! ఎందుకిలా, నాజీవితంతో ఆటలాడుకుంటు న్నావు? నన్ను వదిలి ఉండలేననీ, అవసరం అయితే, మీ నాన్నను ఆస్థి వదులుకుని నాతో వస్తానని నువ్వేగా చెప్పావు! అలా చెప్పిన నువ్వేనా ఇవ్వాడిలా మాట్లాడు తోంది! లలితా నువ్వెందుకలా మారిపోయావు? ఏ దుష్ట శక్తి నిన్నిలా మార్చింది!" పసిపిల్లవానిలా ఏడుస్తూ అన్నాడు రాజేష్.

లలితా! నువ్వు దూరం అయితే, నేను బ్రతకగలనా! ఉద్యోగంసంపాదించుకుని, నిన్ను నాదాన్నిగా చేసుకోవాలనీ ఎన్ని కలలు కన్నాను! ఎంత నిర్దాక్షిణ్యంగా నన్ను కాదం టున్నావు? మనిషికి ఆస్థి అంతస్థులు కాదు. తాను ప్రేమించే మనిషి సాహచర్యం అని ఎన్ని తీయని కబుర్లు చెప్పావు! లలితా! నువ్విలా దూరం అవుతావేమో అనుకుంటే, నేన సలు హైదరాబాదు వెళ్ళేవాడినే కాదు. నీకు కావలసింది డబ్బేగా! ఉద్యోగం చేస్తూనే, నైట్ కాలేజిలో చేరి యమ్. యస్సి. చదువుతాను, పగలూ, రాత్రీ నీకోసం కష్టపడతాను. నీకు కావలసినంత డబ్బు సంపాదిస్తాను. ప్లీజ్, నన్ను కాదనకు. నువ్వేం చేయమన్నా చేస్తాను నన్ను పెళ్ళి చేసికున్నంత మాత్రాన, మీ నాన్నగారు నిన్ను కాదని, నీ ఆస్థిని ఎవరికీ ఇవ్వరు. కొద్దిరోజులు పోయింతర్వాత, కోపతాపాలు తగ్గిపోయి, ఆస్థి అంతా నీకే ఇస్తారు. లలితా! నువ్వు చాలా తెలివయినదానివి. బాగా ఆలోచించు. మనిషి

ఆస్థి అంతస్థులను ఎప్పుడయినా సంపాదించుకోగలడు. మని షి ఒకసారిపోగొట్టుకుంటే, తిరిగి సంపాదించుకోలేరు." అతి దీనంగా, లలిత చేతులు పట్టుకుని ప్రాధేయపడుతూ అన్నాడు రాజేష్.

"రాజేష్, నేను చెప్పదల్చుకున్నది చెప్పాను. ఇంటి దగ్గర అమ్మ నాకోసం ఎదురు చూస్తూంటుంది నేను వెళ్ళు తున్నా." అంటూ రాజేష్ పిలుస్తున్నా వినిపించుకోకుండా వేగంగా నడుస్తూ వెళ్ళిపోయింది లలిత. ఆవాక్కయినటుగా అక్కడే కూర్చుండిపోయాడు రాజేష్.

కన్నీటితో మనస్సు బరువు దించుకుని, ఇంటికి వచ్చాడు రాజేష్. రెండోరోజు రాత్రే హైదరాబాదు వెళ్ళి పోయాడు.

కాలచక్రంలో ఎన్నో మార్పులు జరిగాయి. రాఘవ రావుగారి ఆరోగ్యం దెబ్బతినటంవలన, వాణిని తీసుకుని ఆయన కూడా హైదరాబాదు రాజేష్ దగ్గరకు వెళ్ళాడు.

లలిత కాదనటం, వాణిని చేసుకోమని ఆఖరి క్షణా లలో ఉన్న రఘువరావుగారు ప్రాధేయపడటంవలన, తను ప్రేమించిన లలిత తనను తిరస్కరించింది. తనను ప్రేమించే వాణిని, కూడా దూరం చేసుకోవటం ఎందుకని, వాణితో పెళ్ళికి ఒప్పుకున్నాడు రాజేష్.

వాణి, రాజేష్‌ల పెళ్ళి జరిగిన రెండు నెలలకే రాఘవ రావుగారు మరణించారు. ఖర్మకాండనన్నీ రాజేష్ నిర్వ

హించాడు. అందుకుగాను అయిదువేలు అప్పు అయింది.

అప్పు తీర్చే మార్గం కనుపించలేదు. రోజు, రోజుకూ వడ్డీ పెరిగిపోతుంది. గత్యంతరం లేక, ఇల్లు అమ్మకానికి పెట్టమని తన ఫ్రెండ్‌కు లెటరు వ్రాసాడు. పదిహేనువేలకు, బేరం కుదిర్చి రాజేష్‌కు లెటరు వ్రాసాడు అతని ఫ్రెండ్.

ఇల్లు కొన్నవాళ్ళకు, ఇంటిని అప్పగించి వాళ్ళదగ్గర డబ్బు తీసుకోవటానికి, రెండు సంవత్సరాలు తర్వాత హైదరాబాదు నుంచి, స్వంత ఊరు వచ్చాడు రాజేష్.

గడిచిన రెండు సంవత్సరాలలోనూ, ఊరి పరిసరాలలో ఏం మార్పు కనుపించలేదు. లలితను చూడాలని ఉన్నా, లలిత మాటలు గుర్తుకు వచ్చి అతి ప్రయత్నం మీద లలితా వాళ్ళ ఇంటికి వెళ్ళకుండా ఆగాడు రాజేష్.

ఆ పగలంతా, ఇంటి వ్యవహారంతో సరిపోయింది. లలితను చూడాలన్న కోరికను అరికట్టుకోలేక, లలితా వాళ్ళింటికి వెళ్ళాడు. లలిత కనిపించలేదు. వాళ్ళ నాన్నగారు అరుబయట కూర్చుని ఉన్నారు. రాజేష్‌ను చూడగానే స్నేహపూర్వకంగా పలకరించి కూర్చోమన్నారు. లలిత విషయం ఆయన్ని అడగటానికి ధైర్యం చాలలేదు రాజేష్‌కు. ఇంతలో లలిత వాళ్ళమ్మగారు కూడా వచ్చి అక్కడ కూర్చున్నారు.

మాటలమధ్యలో ఆమె చెప్పింది. ఎవరు చెప్పినా విన కుండా, లలిత మెడిసన్‌చ దువుతానని పట్టుబట్టి కాకినాడ మెడికల్ కాలేజీలో చేరిందని. ఆ విషయం విన్నతర్వాత ఒక్క నిముషంకూడా అక్కడ కూర్చోలేకపోయాడు రాజేష్.

ఇల్లు అమ్మేసి, ఆ ఊరితో సంబంధ బాంధవ్యాలు తెంచుకుని హైదరాబాదు వెళ్ళాడు. ఆ తర్వాత, వెంటాడి వేధించే లలిత జ్ఞాపకాలనుంచి తప్పించుకోవటానికి, నైట్ కాలేజీలో చేరి యమ్. యస్సి. చదివాడు. ప్రయివేటు కంపెనీలో, నెలకు పదిహేనువందల జీతంతో ఉద్యోగం రావటంతో, చేస్తున్న ఉద్యోగానికి రిజైన్‌చేసి, ప్రయివేటు కంపెనీలో చేరాడు.

ఆవిధంగా మార్పులేకుండా కాలచక్రంలో ఎనిమిది సంవత్సరాలు గడిచిపోయాయి. నెలరోజుల క్రితం ప్రమోషను మీద హైదరాబాదునుంచి, విజయవాడ బ్రాంచికి ప్రమోషను మీద వచ్చాడు రాజేష్.

ఎనిమిది సంవత్సరాల తర్వాత, లలితను రాజేష్ చూడటం ఇదే మొదటిసారి.

"ఏమండీ." మగతగా పిలిచింది వాణి.

ఆ పిలుపుకు గతంలోనుంచి తేరుకున్నాడు రాజేష్.

"ఎలాఉంది వాణీ!" వాణి మంచందగ్గరకు వచ్చి, వాణిచేతిని తనచేతిలోకి తీసుకుంటూ అడిగాడు రాజేష్.

"సీరసంగా ఉంది. మగతగా కళ్ళు మూసుకుపో తున్నాయి.

"జ్వరతీవ్రతలో అలాగే ఉంటుంది. డాక్టరుగారు ఏం భయం లేదన్నారు." అనునయంగా వాణికేల నిమురుతూ అన్నాడు రాజేష్.

స్టాఫ్ నర్సు వచ్చి ఇంజక్షను ఇచ్చి వెళ్ళింది. పదినిముషాలకు ఇంజక్షను మత్తులో నిద్రపోయింది వాణి.

టయిము రాత్రి తొమ్మిది గంటలయింది. రాజేష్ కన్సల్టింగ్ రూము దగ్గరకు వెళ్ళాడు. ఆ రూము తలుపులు లోపలినుంచి గడిపెట్టి ఉన్నాయి.

అటువైపు వచ్చిన నర్సును, "డాక్టరుగారు హాస్పటల్‌లో ఉన్నారా? ఇంటికెళ్ళారా?" అని అడిగాడు.

"డాక్టరమ్మగారుండేది కూడా ఈ బంగళాలోనే, డాక్టరమ్మగార్ని పిలవమంటారా?" వినయంగా అడిగింది నర్సు.

"అక్కర్లేదు. నేనే వెళ్ళి మాట్లాడతాను ఎటువైపు వెళ్ళాలి?"

"హాలు గుమ్మం దగ్గరున్న కాలింగ్ బెల్ నొక్కండి. డాక్టరమ్మగారే వస్తారు." అనిచెప్పి వార్డువైపు వెళ్ళింది నర్సు.

కాలింగ్ బెల్ నొక్కిన రెండు నిముషాల తర్వాత తలుపులు తెరుచుకున్నాయి. ఎదురుగా నిల్చునిఉన్న డాక్టరుగారి అనుమతి తీసుకోకుండానే చనువుగా లోపలకు వెళ్ళి సోఫాలో కూర్చున్నాడు రాజేష్.

ఊహించని ఆ సంఘటనకు అవాక్కయినట్టుగా, గుమ్మం దగ్గరే నిల్చుంది డాక్టరు.

"బాగున్నావా లలితా?"

"నాపేరు లలిత కాదు. విజయ. మీరు నన్ను చూసి పొరబడి ఉంటారు." తడబాటుగా అంది డాక్టరు.

లలితా! పేరు మార్చుకోగలవుగానీ, నీ రూపాన్ని మార్చుకోలేవుగా? ఎనిమిది సంవత్సరాలే కాదు ఎనభయ్యి సంవత్సరాలు గడిచినా, నా లలితను నేను గుర్తుపట్టగలను. నా కళ్ళలోకి చూసి, నేను లలితనుకాదు అని చెప్పు." డాక్టరు కళ్ళలోకి సూటిగా చూస్తూ అన్నాడు రాజేష్.

ఆతని కళ్ళలోకి చూసిన డాక్టరు, ఆ కళ్ళు తనవైపే సూటిగా చూస్తుండటంతో, ఆ చూపుల్ని ఎదుర్కొనే ధైర్యం లేనట్టుగా తల వంచుకుంది.

"సమాధానం చెప్పవేం లలితా! నువ్వు లలితవు కావని చెప్పు."

ఆతని ప్రశ్నకు సమాధానంగా, డాక్టరు కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి.

"లలితా! మీ వారు కనిపించరేం?"

"మావారు ఎవరు?" ఆశ్చర్యంగా అడిగింది లలిత.

"అదే మీ శ్రీవారు."

"నేను పెళ్ళి చేసుకోలేదు."

"వాట్?"

"ఎందుకలా ఆశ్చర్యపోతున్నారు? నిజమే నేనింకా పెళ్ళి చేసుకోలేదు."

ఆ మాట, రాజేష్ గుండెల్లో వేయివీణలు మీటింది.

"ఎందుకని?"

"కారణం అంటూ ఏంలేదు."

"పెళ్ళివయస్సు రాలేదా నీకు?"

"వయస్సు వచ్చినా, పెళ్ళి చేసుకోవాలని లేదు."

"ఏం? నీకు నచ్చిన వాడింకా దొరకలేదా?"

రాజేష్ మాట శూలంలా గుచ్చుకుంది లలిత మనస్సును. అతని ప్రశ్నకు సమాధానం చెప్పకుండా తలవంచుకుంది.

"లలితా! ఇప్పుడు, నేను నెలకు రెండువేలు సంపాదించుకుంటున్నాను. నేనూ, నా భార్యా నా సంపాదనతో హాయిగా బ్రతుకుతున్నాం"

"సంతోషం." నిండుగా నవ్వుతూ అంది లలిత.

"వాణికేం భయం లేదుకదా?"

"ఏం భయంలేదు. మామూలు జ్వరమే. జ్వరతీవ్రతలో ఉండటం వలన వాణి నన్ను గుర్తుపట్టలేదు.

"నీకింకా, వాణి గుర్తుందా?"

"ఏం? ఎందుకుండదు?"

"నీకు డబ్బున్న శ్రీమంతులు తప్ప, మామూలు సామాన్య మనుషులు గుర్తుంటారను కున్నాను?"

"పిల్లలెంతమంది?" మాట మారుస్తూ అడిగింది లలిత.

"ఇంకా మొదలవ్వలేదు."

"లలితా! మీ అమ్మా, నాన్నగారు అందరూ బావున్నారా?

"అందరూ బాగానే వున్నారు."

"ఇక్కడ ప్రాక్టీసు పెట్టావెందుకు?"

"నా అనుకున్న వాళ్ళందరకూ దూరంగా ఉండాలని."

"ఎందుకలా అనుకున్నావు?"

"నా అనుకున్న వాళ్ళు అందరూ ఉన్నా, నా వాళ్ళు అనుకునే వాళ్ళు నాకెవరూ లేరు. అందుకే, అందర్నీ వదిలి వంటరిగా ఉంటున్నాను."

"ప్రాక్టీసు బాగా పెరిగిందనుకుంటాను."

"చూస్తూనే ఉన్నావుగా? ఊపిరి పీల్చుకోవటానికి కూడా ఖాళీ ఉండదు పని చెయ్యటానికి ఇరవయ్యి నాలుగుగంటలూ సరిపోవటంలేదు."

"సంపాదనెంత ఉంటుంది నెలకు?"

"నేను సంపాదనకోసం ప్రాక్టీసు పెట్టలేదు. డాక్టర్నయ్యాను కాబట్టి ప్రాక్టీసు పెట్టాను. ఈ వనితప్ప వేరే పని చాతకాదుగా!

"నువ్వూ, మీ నాన్నగారు డబ్బు మనుషులు. మీరు డబ్బుకిచ్చిన విలువ మనుషులకివ్వరు. నీ సంగతి తెలిసిగా

నేనెలా నమ్ముతాను. నీ మాట, నీ ఆదాయం నెలకు నాలుగు వేలుంటుందా?"

"మూడు వేలలో వుంటుంది"

"ఈ సంపాదనంతా ఎవరికోసం? లలిత కళ్ళలోకి ఏదో వెతుకుతున్నట్టుగా చూస్తూ అడిగాడు రాజేష్. లలిత కళ్ళు మరోసారి నీళ్ళతో నిండాయి.

"లలితా! అక్కడ నీకున్న ఆస్థి, ఇప్పుడు నువ్వు సంపాదిస్తున్న డబ్బు నీకు మనశ్శాంతిని ఇస్తున్నాయా?"

"రాజేష్." అంది లలిత. ఆ పైన ఇంకేం మాట్లాడలేక పోయింది.

"కన్నీళ్లు పెడుతున్నావు ఎందుకు లలితా? ఇప్పుడు నీకేం తక్కువయింది? లక్షల ఆస్థి ఉంది. తిరగటానికి ఇంపాలా కారుంది. ఉండటానికి రెండంతస్తుల మేడుంది. ఊపిరి పీల్చుకోవటానికి కూడా టైము లేనంతగా ప్రాక్టీసు పెరిగింది. సమాజంలో అంతస్థు, హోదా అన్నీ ఉన్నాయి, నిన్ను చూసి ఆడవాళ్లు అసూయపడే స్థితిలో ఉన్నావు ఇంకా ఎందుకు కన్నీళ్లు పెడతావు?"

"నేను వద్దనుకునే వన్నీ, నాకు పుష్కలంగా ఉన్నాయి?

"వద్దనుకోవటం ఏమిటి? నువ్వు కోరుకునేది ఇవేగా?"

రాజేష్ అంత సూటిగా అడుగుతుంటే, సమాధానం చెప్పటం కష్టం అవుతుంది లలితకు.

“వాణికి మెలకువ వస్తుందేమో. ఒంటరిగా ఉంది భయపడుతుంది. నేను వెళుతున్నా మళ్ళీ కలుస్తాను.” అంటూ బయటకు వచ్చి వాణి ఉన్న గదివైపు వెళ్ళాడు రాజేష్. అతను వెళ్ళిన వైపే చూస్తూ అలాగే నిలబడిపోయింది లలిత.

# 10

నాలుగు రోజులకు, వాణికి జ్వరం పూర్తిగా తగ్గిపోయింది. ఈ నాలుగురోజుల నుంచీ, ఆఫీసులో పని ఎక్కువగా ఉండటం వలన, రోజూ ఉదయం ఒకగంట వాణి దగ్గర ఉండి ఆఫీసుకు వెళ్ళి మళ్ళీ సాయంత్రం అయిదుగంటలకు వాణి దగ్గరకు వచ్చేవాడు. పగలంతా, వాణికి తోడుగా కమల ఉండేది.

కమల వాళ్ళింట్లోనే, రాజేష్ వాళ్ళు అద్దెకుంటున్నది. కమలా, వాణి, ఒకే వయస్సు వాళ్ళు కావటం వలన, నెలరోజులలోనే ఇద్దరూ మంచి స్నేహితులయ్యారు.

సాయంత్రం రాజేష్ హాస్పిటల్‌కు వచ్చినప్పుడు, లలితను కలుసుకుని మాట్లాడాలని ఉన్నా రాత్రి పదిగంటల వరకూ, పేషంట్సును చూస్తూ తీరిక లేకుండా ఉంటుంది లలిత. అందువలన లలితను కలుసుకుని మాట్లాడటానికి వీలు చిక్కలేదు రాజేష్‌కు.

ఆ సాయంత్రం రాజేష్, హాస్పిటల్‌కు వచ్చినప్పుడు "జ్వరం తగ్గిపోయింది. ఇంటికి వెళ్ళొచ్చు అని చెప్పింది లలిత." అని చెప్పింది వాణి.

"వాణీ! లలిత బిల్లు ఇచ్చిందా?"

"ఇవ్వలేదు. నేను, స్టాఫ్ నర్సును బిల్లు సంగతి అడిగితే మన దగ్గర బిల్లు తీసుకోవద్దని చెప్పిందట లలిత. నేను డబ్బు ఇవ్వబోయినా, నర్సు తీసుకోలేదు. ఏమండీ! నాతోబాటు చదువుకున్న, నా స్నేహితురాలు డాక్టరు చదివి, మంచి డాక్టరుగా పేరు తెచ్చుకోవటం నాకు చాలా సంతోషంగా ఉంది. లలిత డాక్టరయినా, దాని మనస్తత్వం ఏమీ మారలేదు. అంతకు ముందు నాతో కలిసి చదివినప్పుడు నాతో ఎంత స్నేహంగా ఉండేదో, ఇప్పుడూ అలాగే ఉంది. దానిలో మార్పు లేదు. ఈ నాలుగు రోజులనుంచి కమల తీసుకువచ్చిన భోజనం కూడా. నన్ను తిననివ్వకుండా వాళ్ళింట్లోనే భోంచెయ్యమని బలవంతం చేస్తే లలిత ఇంట్లోనే భోంచేశాను. మీరసలు లలితకు కనిపించనే లేదంట. చాలా బాధపడింది. మీ ఉద్యోగం సంగతి, మన వివరాలు అన్నీ నేనే లలితకు చెప్పాను. ఒక్కసారన్నా మీరు లలితకు కన్పించకూడదూ?"

తనూ, లలితా మాట్లాడుకున్న విషయం లలిత వాణికి చెప్పకుండా ఎందుకు దాచిందో అర్థంకాలేదు రాజేష్‌కు. తనకూడా లలితను కలుసుకున్నట్టుగా చెప్పకుండా

"నువ్వు చూస్తూనే ఉన్నావుగా నాకెక్కడ తీరుతుంది? నిన్నటి వరకూ మన లలితే, ఈ డాక్టరన్న విషయం నాకు తెలియదు."

"ఈ రోజున్నా, లలితను కల్సుకుని మాట్లాడండి అది చాలా బాధ పడుతుంది. ఈ నాలుగురోజులు నన్ను కంటికి రెప్పలా చూసుకుంది. నేను ఇంటికి వెళ్ళిపోతున్నానని దానికి దిగులుగా ఉందట. దాన్ని చూస్తే నాకూ బాధని పించింది. ఇంకా పెళ్ళి చేసుకోలేదు. ఇంట్లో వంట మనిషి, పనిమనిషి దానికి తోడుగా ఉంటున్నారు పెళ్ళెందుకు చేసు కోలేదు అని అడిగితే, పెళ్ళికి ఇంత తొందరేం వచ్చింది? అని నవ్వి ఊరుకుంది అబ్బ పగలూ, రాత్రి దానిక తీరికే లేకుండా పోయింది మనిషి మరీ యంత్రంలా తయా రయ్యింది."

"ఆవిడకు డబ్బు పిచ్చి ఎక్కువ" ఆక్కసుగా అన్నాడు రాజేష్.

"సంపాదించటమే లక్ష్యంగా పెట్టుకుంటే, కొంతకా లానికి మనిషి తనకు తెలియకుండానే, డబ్బు సంపాదించే యంత్రంగా మారి పోతాడు మనిషికి సంపాదన ఎక్కు వయిన కొద్దీ. సుఖాలు తగ్గిపోతాయి. దాని వయస్సు వాళ్ళంతా పెళ్ళిచేసుకుని, భర్తా పిల్లలతో హాయిగాఉన్నారు"

"ఇది పెళ్ళి చేసుకోలేదు. పగలూ, రాత్రి తీరిక లేకుండా ఈ సంపాదన దేనికో నా కర్థం కావటం లేదు,

దాన్ని చూస్తే నాకు జాలి అనిపిస్తుందండీ. లలితను మనింటికి రమ్మని బలవంతం పెట్టినా, నువ్వు కోలుకున్న తర్వాత తప్పకుండా వస్తాను నీకంటే ఆత్మీయులు నా కెవరున్నారు? అంది?"

"పెళ్లెందుకు చేసుకోలేదట?"

"ఆమాట, నేనెన్నిసార్లు అడిగినా నవ్వి వూరుకుంది. గానీ, సమాధానం చెప్పలేదు. మీరు కనుపించలేదని దానికి బాధగా ఉంది. కనపించి మీరుకూడా దాన్ని మనింటికి రమ్మని చెప్పండి."

"నువ్వు చెప్పావుగా! ఇంకా నేనెందుకు గాని ఇంటికి వెళదాం, నువ్వు స్కూటరు వెనక కూర్చుంటావా? రిక్షా పిలవనా?"

"రిక్షా ఎందుకు? క్యారేజి, ఫ్లాస్కు అన్నీ కమల ఇందాకే తీసుకు వెళ్ళింది. నేను మీ వెనక స్కూటరు మీద కూర్చుంటాను."

"ఇంకా ఆలస్యం ఎందుకు? అయితే బయలుదేరు.?"

"ఏమిటండీ? లలితకు చెప్పకుండానే వెళ్ళి పోదామా?"

"చెప్పావుగా! ఇంకా ఎన్ని సార్లు చెపుతావు? నీకు కాస్త ఓపిక వచ్చింతర్వాత, ఒకరోజు మీ లలిత దగ్గరకు తీరిగా వచ్చి నీ ఇష్టమొచ్చినంతసేపు మాట్లాడు కుందువు

గాని, నా కవతల చాలా పనుంది. త్వరగా బయలు దేరు.”
అంటూనే, స్కూటరు స్టార్టు చేశాడు రాజేష్. అయిష్టంగానే
అతని వెనుక కూర్చుంది వాణి.

# 11

ఆ రోజు ఆదివారం. సాయంత్రం పూట హాస్పిటల్‌లో పని ఎక్కువగా ఉండదు. తలస్నానం చేసి, తెల్లని ఇస్త్రీచీర కట్టుకుని, పేపరు చూస్తూ బాల్కనీలో కూర్చుంది లలిత.

ఆదివారం కావటంవలన, రాజేష్‌కు కూడా ఆఫీసు లేదు. స్కూటరుమీద, విజయా నర్సింగ్ హోముకు వచ్చాడు. స్కూటరు శబ్దానికి, పిట్టగోడ దగ్గరకు వచ్చింది లలిత.

బాల్కనీలో ఉన్న లలితను చూసి, చనువుగా స్కూటరు వరండా ముందు ఆపి, లలిత దగ్గరకు వచ్చాడు రాజేష్.

“కూర్చోండి”. తన ఎదురుగా ఉన్న కుర్చీని రాజేష్ వైపు జరుపుతూ అంది లలిత.

లలితకెదురుగా కూర్చున్నాడు రాజేష్.

“లలితా! నిన్న టయములేక, బిల్లు ఇవ్వకుండా వెళ్ళాను.”

“ఇప్పుడు బిల్లు ఇవ్వటానికి వచ్చారా?” అని నవ్వు నవ్వుతూ అంది లలిత.

"అవును."

"నాకక్కర లేదు."

"నా భార్యకు ట్రీట్ మెంట్ ఇప్పించుకోలేని స్థితిలో లేను నేను. ఒకరి దయాదాక్షిణ్యాలు నాకక్కరలేదు. బిల్లు ఎంతో చెప్పు." ఎంత సౌమ్యంగా అనాలనుకున్నా, రాజేష్ గొంతులో కఠినత్వం చోటుచేసుకుంది.

"ఎంతిస్తారు?"

ఎంతివ్వమంటావు?"

"నేను ఇవ్వమన్నంత ఇస్తారా?"

ఆ మాటకు సమాధానం చెప్పకుండా, జేబులోనుంచి అయిదువందల రూపాయల నోట్లు తీసి లలిత ముందున్న టీపాయ్ మీద పెట్టాడు రాజేష్.

"చూడండి! వాణి మీకు భార్య మాత్రమే కాదు. నాకు స్నేహితురాలు కూడా. ఆ విషయం మీకూ తెలుసు. మీ భార్యగా వాణికి ట్రీట్ మెంట్ ఇవ్వలేదు. ఎనిమిది సంవత్సరాల తర్వాత కలుసుకున్న నా స్నేహితురాలికి డాక్టరుగా నేను ట్రీట్ మెంట్ ఇచ్చాను. ఈ డబ్బు తీసి జేబులో పెట్టుకోండి," ఆ డబ్బుతీసి, బలవంతంగా రాజేష్ చేతిలో పెట్టింది లలిత.

లలిత కళ్ళల్లో సుళ్ళు తిరుగుతున్న కన్నీటిని చూసి ఇంకేం అనలేక డబ్బు జేబులో పెట్టుకున్నాడు రాజేష్.

పేపరు చూస్తూ కూర్చోండి. రెండు నిముషాలలో వస్తాను." అంటూ, లలిత లోపలకు వెళ్ళి ఒక ప్లేటు నిండా సున్నుండలు, జంతికలు పెట్టుకుని తీసుకొచ్చి, టీపాయ్ మీద పెట్టి టీపాయ్ రాజేష్ ముందుకు జరిపింది.

"ఈ రెండూ మీ కిష్టమయినవే. త్వరగా తినండి నేనీ లోగా టీ తెస్తాను." అంటూ మళ్ళీ లోపలకు వెళ్ళింది. అయిదు నిముషాల తర్వాత్. పొగలు కక్కుతున్న టీ రెండు కప్పులలో తీసుకుని వచ్చింది లలిత.

"అదేమిటి! టిఫిన్ తినకుండా అలా కూర్చున్నారేం! టీ చల్లారిపోతుంది. త్వరగా తినండి."

"ఇప్పుడేం తినలేను. టీ ఇవ్వు చాలు."

"కొద్దిగా తినండి."

"వాణి, ఇంతకుముందే బలవంతంగా నాచేత రెండు ప్లేట్లు పకోడీలు తినిపించింది. పొట్టలో ఖాళీ లేదు." అంటూ లలిత చేతిలోని టీ కప్పు అందుకున్నాడు రాజేష్.

పనిమనిషి వచ్చి ఖాళీ కప్పులు లోపలకు తీసుకు వెళ్ళింది.

"లలితా! నిన్ను వాణి రమ్మన్నది."

వాణి రమ్మనమన్నది గానీ, మీరు మాత్రం రమ్మనరు. అవునా!"

"అవును." కటువుగా అన్నాడు రాజేష్.

"మీరింత కటువుగా మాట్లాడగలరని నాకింతవరకూ తెలియదు."

"పరిస్థితులే మనిషిలో మార్పును తెస్తాయి. నేనొచ్చిన పని అయిపోయిందిగా ఇక వెళతాను." అంటూ లేవబోయాడు రాజేష్.

"అప్పుడే వెళ్ళిపోతారా? మీరు వచ్చింది బిల్లు ఇవ్వటానికేగానీ, నన్ను చూడటానికి కాదా?" మనస్సులో అనుకోబోయిన మాటల్ని పైకే అనేసింది లలిత.

"నిన్ను చూడటానికి ఏ అనుబంధంతో రాగలను నువ్వు నాకేం అవుతావు!"

"నేనెవరికీ ఏమీ కాను. ఆ విషయం ఎప్పటికప్పుడు నేను మర్చిపోతుంటాను, సారీ." కన్నీటితో అంది లలిత.

"ఒకనాడు నిన్ను నా ప్రాణంకంటే ఎక్కువగా ప్రేమించాను. నువ్వే నా సర్వస్వం అనుకున్నాను. కానీ, నువ్వేం చేశావు! నా గుండెల్లో ఆరని గాయం చేసి, నా జీవితాన్ని నరకం చేసావు. ప్రేమ పేరుతో నన్ను పిచ్చివాడ్ని చేసి, నానుండి తప్పుకుని నా ఖర్మానికి నన్ను వదిలేసావు." కోపంగా అన్నాడు రాజేష్.

ఉబికి వస్తున్న కన్నీటిని ఆపుకోలేక పెద్దగా ఏడ్చింది లలిత.

లలితను ఆ స్థితిలో చూడగానే, రాజేష్ మనస్సు బాధతో విల, విలలాడిపోయింది. లలితను గుండెలకు హత్తు

కుని, లలిత కన్నీటిని తుడవాలనీ, నీకు నేనున్నాను బాధ పడకు అని లలితతో చెప్పాలనీ ఏమేమో అనుకున్నాడు కానీ, అనుకున్న వాటిలో ఏమీ చేయలేకపోయాడు. చూస్తూ కూర్చున్నాడు.

"లలితా! నిన్ను ఓదార్చే అధికారం కూడా నాకు లేదు. నా మాటలు నీ మనస్సుకు బాధగలిగిస్తే నన్ను క్షమించు."

"నా జీవితాన్ని పంచుకోమని, నిన్ను ప్రేమగా ఆహ్వానించిన రోజున నన్ను అనహ్యించుకున్నావు. ఈనాడు నిన్ను అలా ఆహ్వానించే అధికారం నాకు లేదు. నాతో పంచుకోవాలని ఉన్నా ఈనాడు నీ జీవితాన్ని నాతో పంచుకోవాలి విధిలీలలు చాలా విచిత్రంగా ఉంటాయి. ఒక అమ్మాయినీ ఒకబ్బాయినీ, విడదీయలేనటువంటి ప్రేమ బంధంతో కలుపుతాడు ఆ భగవంతుడు. తాను కలిపిన ఆ జంట చిలుకా గోరువంకల్లా నవ్వుతూ హాయిగా ఉంటే, చూడలేనట్టుగా వాళ్ళ జీవితం అంతా నవ్వుతూనే ఉంటే తనను కూడా మరచిపోతారేమో అన్న భయంతో ఆ జంటను వేరుచేస్తాడు. వాళ్ళిద్దరి మధ్యా ఒకరినొకరు దాటలేని అగాధాన్ని ఏర్పరుస్తాడు. మనిషికి అర్థంగాని వాటిని విధిలీల ఖర్మ అని సరిపెట్టుకుంటాము. ఇప్పుడు చూడు. నువ్వు ఏడుస్తుంటే, నిను గుండెలకు హత్తుకుని నీ కన్నీటిని తుడవాలని ఉన్నా, ఆ పని చెయ్యలేని అసహాయ స్థితిలో ఉన్నాను." వేదనగా అన్నాడు రాజేష్.

అస్సహాయ స్థితిలో ఉన్నాను అనుకుంటూ దూరంగా ఉండకపోతే, తను అనుకున్న పని చెయ్యకూడదూ? అభ్యంతరం చెప్పేవాళ్ళు ఎవరున్నారు? మనస్సులో అనుకుంది లలిత.

"లలితా! నాకొక అనుమానం. నువ్వు నన్ను ఎందుకు కాదన్నావు? ఎనిమిది సంవత్సరాలనుంచి నన్నిదే అనుమానం వేధిస్తుంది. నేను పేదవాడినని తెలిసే నన్ను మొదటి నుంచీ ప్రేమించావు. అలాంటి నువ్వు నన్ను కాదన్నది నేను పేదవాడినని మాత్రం కాదు. అందుకు ఏదో బలమయిన కారణం ఉండితీరాలి. లలితా! ఎనిమిది సంవత్సరాల నుంచి మనశ్శాంతి లేకుండా బాధపడుతున్నాను. నిజం చెప్పు. నన్నెందుకు కాదన్నావు? మీ నాన్నగారు బెదిరించారా? మీ పెద్దవాళ్ళ బెదిరింపులకు భయపడి నన్ను గాదన్నావా? లేక నీకు నువ్వే ఆలోచించుకుని పేదవాడిని చేసుకుని సుఖపడలేనేమో అన్న భయంతో కాదన్నావా? ప్లీజ్. ఇప్పటికయినా నిజం చెప్పు. నిజం నాకు తెలియకపోతే, జీవితాంతం నాకు మనశ్శాంతి ఉండదు." ప్రాధేయపూర్వకంగా అన్నాడు రాజేష్.

"ఆ విషయం గురించి నన్ను అడగొద్దు నేనేం చెప్పలేను." ఏడుస్తూ అంది లలిత.

"నువ్వు చెప్పితీరాలి."

"చెప్పలేను. వదే, వదే చెప్పమని నన్ను బలవంతం చెయ్యొద్దు. ఆ గతాన్ని నాకు గుర్తు చెయ్యొద్దు" పిచ్చిదానిలా ఏడుస్తూ అంది లలిత.

"నువ్వు కారణం చెప్పకపోతే, నాకు మనశ్శాంతి ఉండదు."

"కొన్ని నిజాలు, తెలుసుకోకుండా ఉండటమే మంచిది."

"ఆ నిజం ఎంత చేదుగాంటి దయినా పరవాలేదు. లలితా! నేను మనశ్శాంతిగా బ్రతకటం నీకిష్టంలేకపోతే చెప్పటం మానేయి. నేను ప్రశాంతంగా ఉండాలని నువ్వు కోరుకుంటే చెప్పు."

"ఆడది ఒక్కసారే, ఒక్కరికే మనసిస్తుంది. బలమయిన కారణం లేకుండా ఏ ఆడదీ తను ప్రేమించిన మగవాడిని దూరం చేసుకోదు. ఇంతకంటే ఏం చెప్పలేను."

"లలితా! ఆ బలమయిన కారణం ఏమిటో నాకు చెప్పు జరగవలసిన వన్నీ జరిగిపోయింతర్వాత ఇప్పుడు చెప్పటానికేం చెప్పు."

"వింటే మీరు భరించలేరు. చెప్పమని నన్ను బలవంతం చెయ్యొద్దు." ఏడుస్తూ అంది లలిత.

"ఇప్పుడు ఏ విషయానికీ నా మనస్సు చలించదు. ఏనాడు నువ్వు దూరం అయ్యావో, ఆనాడే నా మనస్సు మొద్దుబారిపోయింది. స్పందనకూ, కోరికకూ అతీతమయినది నా మనస్సు చెప్పు."

గతాన్ని గురించి, రాజేష్‌కు చెప్పకుండా ఉండాలని లలిత ఎంత ప్రయత్నించినా, రాజేష్ చెప్పమని మొండి పట్టు పట్టటంతో చెప్పక తప్పిందికాదు లలితకు.

"రాజేష్. నువ్వు ఆ రోజు హైద్రాబాదు వెళ్లావు. నువ్వు వెళ్ళిన రెండో రోజు, మా బావ ఊరునుంచి వచ్చాడు. ఆ రాత్రి మానాన్నగారు నన్ను తనగదిలో పిలిచి "లలితా! రాజేష్ మన అంతస్తుకు తగినవాడు కాదు. నువ్వు అతన్ని పెళ్ళి చేసుకుంటే నలుగురిలో నా పరువేం కావాలి! నేనెలా తలెత్తుకు తిరగాలి? నామాట వినమ్మా. ఆ దరిద్రపు వెధవను మరిచిపో, నీబావ గిరి అతనికంటే అం దంగా ఉంటాడు. డాక్టరుగా పని చేస్తున్నాడు. అన్ని విష యాలలో రాజేష్ కంటే పై అంతస్తులో ఉన్నవాడు. గిరికీ, నీకూ రక్తసంబంధం ఉంది. లలితా నువ్వు గిరిని పెళ్ళి చేసుకుంటే మా రెండు కుటుంబాల మధ్యనున్న అపోహాలు తొలిగిపోతాయి. అని ఎన్నోవిధాలా నాకు నచ్చచెప్పాలని ప్రయత్నించారు. నేను వినలేదు. అనునయంగా చెప్పారు. నేను వినలేదు. బెదిరించారు. నేను భయపడలేదు. నేను పెళ్ళంటూ చేసుకుంటే రాజేష్‌నే చేసుకుంటాను. లేకపోతే ఇలాగే ఉండిపోతాను. అని ఖచ్చితంగా చెప్పాను."

"తర్వాత మళ్ళీ మా నాన్నగారు నాముందు పెళ్ళి విషయం ఎత్తలేదు. నేను నీకోసం నిముషాలు లెక్కపెట్టు కుంటూ ఎదురుచూస్తున్నాను. నువ్వు వెళ్ళి రెండువారాలు గడిచినా ఇంకా రాలేదు."

"నిన్ను గురించే. ఆలోచించుకుంటూ బాల్కానీలో కూర్చున్నాను. టయము రాత్రి పది గంటలు దాటింది

మా బావ. నా దగ్గరకు వచ్చికూర్చున్నాడు. ఆ టయములో ఎందుకొచ్చాడా అ అనుమానంగా ఉన్నా, ఆ మాట అడగ లేకపోయాను, ఏవో కబుర్లు చెబుతూ కూర్చున్నాడు. గంటయినా నా ముందునుంచి కదలలేదు. నాకే విసుగనిపించి, నాకు నిద్రవస్తుంది బావా. నేను వెళుతున్నాను అని చెప్పి నా గదిలోకి వచ్చాను. నా వెనుకే వచ్చిన బావ, నేనూహించని విధంగా నా గది లోపలికి వచ్చి, తలుపులు గడి వేసాడు."

"రాజేష్. ఆ తర్వాత జరిగింది నీ కెలా చెప్పాలో నా కర్థం కావటం లేదు. మా బావ నా చేయి పట్టుకున్నాడు

"బావా! ఏమిటిది? ముందు నా చెయ్యి వదులు."

"లలితా! ఇంకో వారం రోజుల్లో మనిద్దరికీ పెళ్ళి జరగబోతుంది. నా చెయ్యి పట్టుకుని నడవబోయే, నీ చేతిని అందుకోవటంలో తప్పు లేదు"

"నీకూ, నాకూ పెళ్ళి జరగ బోతుందని ఎవరు చెప్పారు.? అది ఈ జన్మలో జరగదు."

"నువ్వు చాలా అమాయకురాలివి లలితా! మ ద్దరి పెళ్ళికి శుభలేఖలు కూడా ప్రింట్ అయ్యాయి. నిన్ను పెళ్ళి చేసుకోవటానికి, ఎన్నో జన్మలు ఎత్తనక్కరలేదు వారంరోజులు చాలు."

"నా కిష్టం లేకుండా, నా పెళ్ళి ఎలా జరుగుతుందో, నేనూ చూస్తాను."

"నువ్వెంత అరిచినా, ఈ పెళ్ళి ఆగదు."

"బావా! నువ్వు చదువూ, సంస్కారం ఉన్నవాడివి ఇలాంటి నీచమైన పని చెయ్యటానికి సిగ్గులేదూ తిరస్కరించే ఆడదాన్ని, బలవంతం చెయ్యటం మగతనం కాదు."

"నువ్వు నా కాబోయే భార్యవు. ఇందులో సిగ్గుపడాల్సిన పనేం లేదు." బలవంతంగా, లలితను గుండెలకు అదుముకుంటూ అన్నాడు గిరి.

"డాడీ! డాడీ!" పెద్దగా అరిచింది లలిత.

"నువ్వెంత అరిచి, గీ పెట్టినా ఇక్కడకు ఎవరు రారు. నేను నీ దగ్గరకు రావటం, మీ నాన్నగారు చూస్తూనే ఉన్నారు. నిన్ను దారిలోకి తేవాలంటే ఇంతకంటే మార్గం లేదు. లలితా! ఇంత అందాల రాశిని, ఎవడో అనామకుడు స్వంతం చేసుకోబోతుంటే, చూస్తూ ఊరుకునేంతటి అసమర్థుడిని కాదు. నేను కూటికి గతి లేని ఆ రాజేష్ గాడిలో ఏం చూసి ప్రేమించావు నువ్వు? వాడి కోసం మామయ్యనే ఎదురిస్తావా? ఇంతకాలం మామయ్య కూడబెట్టిన లక్షల ఆస్తిని, అపురూపంగా పెంచుకున్న నిన్ను. ఒక పనికి మాలిన వెధవ పొందబోతుంటే, చేతులు ముడుచుకుని కూర్చునే చవటను కాను నేను." లలిత ముఖాన్ని బలవంతంగా తనవైపుకు తిప్పుకుంటూ అన్నాడు గిరి.

"బావా! నీకూ, నాన్నగారికీ కావలసింది ఈ ఆస్తి బయటివాళ్ళకు చెందకూడదు. అంతేగా? నాన్నగారి ఆస్తిలో

ఒక్క నయా పైసా కూడా నాకక్కరలేదు. మొత్తం నువ్వే తీసుకో ప్లీజ్ నన్నొదులు. ఈనీకం మొయిన ఆనందం కోసం, నా నూరేళ్ళ జీవితాన్ని నాశనం చెయ్యొద్దు. ఇష్టంలేని ఆడదాన్ని చేసుకుని నువ్వుమాత్రం ఏం సుఖపడతావు! బావా! నా మనస్సును ఏనాడో రాజేష్‌కు అర్పించాను. ఈ ఎంగిలి ఇస్తరిలో భోంచెయ్యాలని ఆశపడకు ఈ ఆస్తియంతా నువ్వే తీసుకొని, నీకునచ్చిన అమ్మాయిని పెళ్ళి చేసుకో. నన్నొదులు బావా!"

"లలితా! నువ్వు పెనుగులాడే కొద్దీ నాలో కోరిక అధికమవుతుంది. అనవసరంగా ఎందుకు శ్రమ పడతావు! హాయిగా నాతో ఆనందాన్ని పంచుకో నీ ఆస్తి నాకెందుకు! నిన్ను నా దానిగా, చేసుకుంటే, నీతో పాటే నీ ఆస్తి కూడా నా స్వంతం అవుతుంది. గొడవ చెయ్యకు నిన్ను రక్షించటానికి మీ నాన్నగారు రారు ఆయన కంతా తెలుసు. ఇదున అంగీకారం లేకుండా, నేనింత చొరవ తీసుకోగలనా! హాయిగా పంచుకోవాల్సిన మొదటి అనుభూతిని, అనవసరంగా అరిచి గొడవ చేసి, ఆ అనుభూతిలోని తియ్యదనాన్ని పోగొట్టకు." బలవంతంగా లలితను ఆక్రమించుకుంటూ అన్నాడు గిరి.

ఏదో అనబోయిన లలిత నోటిని, తన నోటితో మూసాడు. లలిత పెనుగులాడుతున్న కొద్దీ, అతనిలోని కాంక్ష మరింత అధికమవుతోంది గిరి పశుబలం ముందు లలిత నిస్స

పోయి రాలైంది. మగవాని అహంకారానికి, ఆడదాని అన్న పోయత లొంగిపోయింది.

ఆడదాని జీవితంలో, ఏది పోగొట్టుకుంటే తిరిగి పొంద లేదో, దాన్ని పోగొట్టుతుంది లలిత. జరిగిన సంఘటనతో మతిలేనిదానిలా, శోయ్యబారిపోయింది. లలిత ఆ షాక్ నుంచి తేరుకునేలోగానే తెల్లవారిపోయింది.

ఉదయం పదిగంటలయినా, లలిత మేడదిగి రాకపోవ టంతో, ఆదుర్దాగా లలిత గదిలోకి వచ్చిన రాజశేఖరంగారు చిరిగిపోయిన జాకెట్టుతో, చెదరిన నుదిటి కుంకుమతో రాత్రి జరిగిన సంఘటనకు ప్రతిరూపంగా, పిచ్చిదానిలా కూర్చున్న కూతుర్ని చూసి, దోషిలా తలవంచుకున్నారు.

"నాన్నగారూ! కూతురు కోసం కూతురి సుఖంకోసం ఎన్నో కష్టాలను అనుభవించిన తండ్రులను చూసాను. కూతురిపెళ్ళి చేయటానికి డబ్బులేక, అందుకోసం దొంగ తనం చేసి జైలు పాలయిన తండ్రుల కథలు చదివాను. కానీ నీలాంటి తండ్రిని చూడటం ఇదే మొదటిసారి."

"ఆస్తి అంతస్థుల కోసం, కన్నకూతురి జీవితాన్ని నరకం చేసిన కన్నతండ్రివి నువ్వు. ఆస్తి, మీ మేనల్లుడికి చెందాలనుకుంటే, మీకుగా మీరే ఇస్తే అతనికి సరి పోయేదిగా, అందుకు నాశీలం మూటగలవటానికి తండ్రే సహకరించటం, ఎక్కడయినా ఉందా? నేను రాజేష్‌ను ప్రేమిస్తున్నానని నీకు తెల్సు, నన్ను అతన్నుంచి దూరం

చేయ్యటానికి, నా జీవితాన్ని నాశనం చేసిన కసాయిత్రివి నువ్వు." కోపంతో పెద్దగా అరిచింది లలిత.

కూతురు అన్నదంతా నిజమే కాపటంతో నోరు మెదపలేకపోయారు రాజశేఖరంగారు కూతురు కళ్ళలోకి చూసే ధైర్యం లేక, మేడదిగి వెళ్ళారు.

# 12

"రాజేష్ ఒవిధంగా, నేను శీలాన్ని కోల్పోయాను. నాకు తెలియకుండానే, నా పెళ్ళికి ముహూర్తం పెట్టించి పెళ్ళి పనులు చేయిస్తున్నారు. శీలాన్ని పోగొట్టుకున్న నేను, నీ దరికి రాలేను. మనసిచ్చిన నిన్ను మరిచిపోయి, నా బ్రతుకును బండలపాలు చేసిన ఆ దుర్మార్గుడిని పెళ్ళి చేసుకోలేను. అందుకే నువ్వు హైదరాబాదు నుంచి రాకముందే, నా ముఖం నీకు చూపించకుండా, ఈ లోకం నుంచి వెళ్ళిపోదామనుకున్నాను."

"స్లీపింగ్ టాబ్లెట్స్ వేసుకున్నాను. మృత్యువు కూడా, నన్ను అసహ్యించుకుంది. గానీ అక్కున చేర్చుకోలేదు. మా బావ డాక్టరు కాబట్టి, అతనే ట్రీట్‌మెంట్ ఇవ్వటం వలన, ఈ విషయం బయట వాళ్ళకు తెలియలేదు. ఆ కారణంగా పెళ్ళి తప్పిపోయింది. తర్వాత నువ్వు వచ్చావు జరిగిన విషయం నీకు తెలిస్తే, నీగుండె ఆగిపోతుంది. లేదా,

ప్రతీకారం నీ మనస్సులో తలెత్తుతుంది. మగవాడు ఏదయినా సహించగలడు గానీ, తను ప్రేమించిన ఆడదాని చెయి కూడా మరో మగవాడు తాకటం సహించలేడు. జరిగింది నీతో చెప్పి, నీ మనస్సులో ప్రతీకార జ్వాల రగిలించి, నీ జీవితాన్ని నాశనం చెయ్యటం ఇష్టం లేక, ఆరోజు అలా మాట్లాడాను. నేను నిన్ను అలా అసహ్యించుకుంటేగాని, నువ్వు నాకు దూరంగా వెళ్ళలేవు. దూరంగా వెళితేగానీ నన్ను మరిచిపోయి, మరో అమ్మాయిని పెళ్ళి చేసుకోలేవు. రాజేష్. చెడిపోయింది నా శరీరమే కానీ, నా మనసు కాదు. నా మనస్సు నీకే అంకితం. మనస్సు చెడిపోనంతవరకూ, శరీరం చెడినా, నా దృష్టిలో చెడిపోనట్టే లెక్క. ఇప్పుడు చెప్పు ప్రేమను గురించి చాలా గొప్పగా మాట్లాడావు. నీ ప్రేమ గొప్పదో, నా ప్రేమ గొప్పదో నువ్వే ఆలోచించు."

"ఆడది ఒక్కసారే, ఒక్కరికే మనస్సు అర్పిస్తుంది. మగవాని మనస్సు చంచలం. ఏ పరిస్థితులలోనూ మగవాళ్ళలా జీవితంలో ఆడది రాజీ పడిపోలేదు. ఒక ఆలయంలో, ఒక్క దేవుణ్ణి ప్రతిష్ఠింప చేస్తారు. ఆలయం శిథిలమయినా, అందులోని దేముని రూపం అలాగే వుంటుంది. ఆలయం శిథిలమయిందని, ఆ దేముడి రూపాన్ని తొలగించి, మరో దేవుని రూపాన్ని ఆ ఆలయంలో ప్రతిష్ఠింప చేయరు. నిన్ను మనసారా ప్రేమించాను కాబట్టే, నీకర్పించిన మనస్సులో మరో మగవాడికి చోటివ్వలేక పోయాను. చనిపోతే నిన్ను చూసే

అవకాశం ఉండదని, బ్రతికుంటే జీవితంలో ఏదో ఒకరోజు నిన్ను చూడచ్చు. అన్న ఆశతో బ్రతికాను. బ్రతుకుతున్నాను. మా నాన్నగారు నాకు చేసిన అన్యాయానికి ఆయన ముఖం చూడటానికి అసహ్యమనిపించి చదువు వంకతో అయిదు సంవత్సరాలు ఆయనకు దూరంగా ఉన్నాను. డాక్టర్ని, అయి ఇక్కడ ప్రాక్టీసు పెట్టుకుని, మనస్సులో నీ రూపాన్నే నిలుపుకుని. నీ భార్యగా బ్రతుకుతున్నాను. నా జీవితం నాశనం చేసిన ఆ దుర్మార్గుడు మా బావ గిరి యాక్సిడెంటులో పోయాడు. అమ్మా, నాన్నా చేసిన పాపానికి కుమిలిపోతూ బ్రతుకుతున్నారు."

"రాజేష్, ఇదీ నా కథ. ఇప్పుడు చెప్పు. నేను, నిన్ను మోసం చేసానా? నీ ప్రేమ అంత పవిత్రమయినది అయితే, నువ్వు నన్ను మరిచిపోయి వాణిని పెళ్ళి చేసుకునేవాడివే కాదు. నువ్వు పెళ్ళి చేసుకుని, వాణితో కాపురం చేస్తూ హాయిగా ఉన్నావు. నేను చావలేక జీవచ్ఛవంలా నీకోసం బ్రతుకుతూ నీదానిగానే మిగిలిఉన్నాను. పోయేవరకూ నీదానిగానే ఉంటాను."

లలిత చెప్పినమాటలు వినగానే ఎవరో కత్తితో తన గుండెను రెండుగా చీలుస్తున్నట్టుగా బాధతో విల విలలాడి పోయింది రాజేష్ మనస్సు. అతనికళ్ళు వర్షిస్తున్నాయి. ఇద్దరూ, ఒకర్ని ఒకరు ఓదార్చుకునే స్థితిలో లేరు.

కన్నీటితో మనస్సుల బరువులు దించుకున్నారు.

"లలితా! నీ మనస్సును అర్థం చేసుకోలేకపోయాను. నన్ను క్షమించమని అడిగే అర్హత కూడా నాకు లేదు. నువ్వు చెప్పింది నిజమే. నీ ప్రేమనుంచు నేను ఓడిపోయాను. ప్రేమనుగురించి మాట్లాడే యోగ్యత కూడా నాకు లేదు. నన్ను క్షమించు." అన్నాడు రాజేష్ కన్నీటితో.

"ఆ మాట అడగవలసింది నేను. రాజేష్ ఎటువంటి పరిస్థితులలో, శీలాన్ని పోగొట్టుకున్నానో అర్థం చేసుకోగలననుకుంటాను. నన్ను క్షమించు."

"ఆ విషయాన్ని గురించి పదే పదే గుర్తు చెయ్యకు లలితా! నాకావలసింది నీ మనస్సు. నువ్వు నా దానివి ఆ భావనే, నాకు కొండంత బలాన్నిస్తుంది."

"నన్ను అర్థం చేసుకుని క్షమించగలిగావు. నాకంతే చాలు. ఇన్నిరోజులనుంచీ, ఈ విషయం నీకెలా చెప్పాలా అని సతమతమయిపోయాను. ఈ జీవితంలో నా మీద నువ్వు ఏర్పరుచుకున్న అపోహను తొలగించుకోలేనేమో అని భయపడ్డాను. భగవంతుడు దయామయుడు. ఇన్నిరోజులకయినా, నీముందు నిజాన్ని చెప్పగల అవకాశాన్ని నాకిచ్చాడు."

"లలితా! ఇక వెళ్ళనా!"

లలిత ఆ ప్రశ్నకు ఏం సమాధానం చెప్పలేదు.

"నేనొచ్చి చాలా సేపయింది లలితా. ఇక వెళ్ళమంటావా?"

"వెళ్ళమని చెప్పలేను. అలా అని ఉండమని చెప్పగలిగే అర్హత నాకు లేదు." ఆ మాట అంటున్నప్పుడు లలిత కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

కొందరు శాపగ్రస్తులు ఉంటారు లలితా. వాళ్ళు ఏ తప్పు చెయ్యకపోయినా, జీవితం అంతా బాధల్ని భరించటానికే బ్రతుకుతారు. మనిద్దరం అటువంటి వాళ్ళకోవలోకి చెందుతాము. ఇంకెంతసేపున్నా వెళ్ళక తప్పదుగా? వెళతాను!" అంటూనే లేచాడు రాజేష్.

మేడదిగి, రాజేష్‌తో బాటు గుమ్మం వరకూ వచ్చింది లలిత.

"వెళతాను లలితా" మరోసారి చెప్పాడు రాజేష్.

"మళ్ళీ ఎప్పుడొస్తారు?" అప్రయత్నంగా అడిగింది లలిత.

"ఎప్పుడు రమ్మంటావు?"

"నేను ఎప్పుడు రమ్మంటే, అప్పుడు వస్తారా?"

"నువ్వుండమంటే, ఈ రాత్రి అంతా ఇక్కడే ఉంటాను."

"ఆమాట అనగలిగే అర్హత నాకు లేదు."

"అలా అని ఎందుకనుకోవాలి?"

"ఉన్న నిజం అదే!"

"లలితా! నేను నీవాడిని. పెళ్ళి అయినంత మాత్రాన నీకు పరాయివాడి నయిపోయానా?"

"ఏదైనా, ఒకరికి స్వంతమయిన వస్తువు మరొకరికి పరాయిదేగా!"

"నువ్వు నన్ను పరాయిగా చూడటం నేను సహించలేను లలితా." వేదనగా అన్నాడు రాజేష్.

"మిమ్మల్ని ఏ అనుబంధంతో, నావారు అనుకోగలను? పూచిన అన్ని పూలూ పూజకు పనికిరావు. భగవంతుని పాదాలను, చేరే అదృష్టం ఏ కొద్దిపూలకో ఉంటుంది."

"లలితా! ప్రతిసారీ, ఎందుకు నన్ను నువ్వు అలా కించపరుచుకుంటావు?"

"ఆంతకంటే, దయ్యా కలిగిందేం లేక."

"ప్రతిక్షణం, గతాన్ని మరిచిపోతూ, భవిష్యత్తు మీద ఆశలు పెంచుకుంటూ బ్రతకటానికి, అలవాటు పడాలి. అనుక్షణ గతాన్ని తలుచుకుంటూ బాధపడి మాత్రం ప్రయోజనం ఏముంది.?"

"భవిష్యత్తు లేని నేను, భవిష్యత్తును గురించి ఏం ఆలోచించగలను? శూన్యంగా కనుపిస్తున్న జీవితాన్ని గురించి ఆలోచించటానికి కూడా భయంగా ఉంది నాకు

నీకు తెలియదు రాజేష్ ఒంటరితనం, మనిషికి పెద్ద శాపం. ఆ బాధ ఎటువంటిదో అనుభవం మీదగాని అర్థం కాదు. పగలంతా, పేషంట్సుతో ఎలాగో గడిచి పోతుంది. చీకటి పడుతుందంటే భయం ఒంటరిగా కూర్చుంటే, ఆలోచనలు చుట్టుముడతాయి నేనెందుకు బ్రతకాలి! ఎవరికోసం బ్రతకాలి! నా వాళ్ళు నాకు దూరమయి. పరాయివాళ్ళ స్వంతం అయిం తర్వాత ఏ ఆశతో బ్రతకాలి! అన్న ప్రశ్న నన్ను వేధిస్తుంది. ఒక్కసారి ఆత్మహత్య చేసుకోవాలన్నంత ఆవేశం వస్తుంది." ఉబికి వస్తున్న కన్నీటిని ఆపుకోలేక ఏడుస్తూ అంది లలిత.

"లలితా! బాధపడకు." ఏదో చెప్పాలని ఉన్నా అంతకు మించి ఏం చెప్పలేకపోయాడు రాజేష్.

రాజేష్ వెళ్ళిపోయిన తర్వాత, తన గదిలోకి వెళ్ళి ఏడుస్తూ పడుకుంది లలిత.

# 13

రాజేష్ ఇంటికి వెళ్ళే సరికి, రాజేష్ కోసమే ఎదురు చూస్తున్నట్టుగా, వరండాలోనే కూర్చునుంది వాణి.

"ఏమండీ! ఇప్పుడు టయమెంత?" అడిగింది వాణి కోపంగా.

"ఎనిమిది." ముక్తసరిగా అన్నాడు రాజేష్. వికలమయిన మనస్సుతో ఇంటికి వచ్చిన రాజేష్‌కు వాణి ప్రవర్తన మరింత విసుగును కలిగించింది.

"ఇప్పటి వరకూ ఎక్కడకు వెళ్ళారు?"

"ఆలస్యం అయినందుకు కూడా నీకు సంజాయిషీ చెప్పాలా? మగవాడు బయటికి వెళితే ఎన్నో పనులుంటాయి ఇంటి కొస్తుంటే, దారిలో మా ఫ్రెండ్ కనిపించాడు. అతనితో మాట్లాడుతుంటే ఆలస్యం అయింది" విసుగ్గా అంటూ అక్కడున్న సోఫాలో కూర్చున్నాడు రాజేష్.

"మీరు ఇంట్లో నుంచి బయటకు వెళితే చాలు మళ్ళి ఇంటికి ఎప్పటికి చేరుకుంటారో తెలియదు. ఒకరోజు ఆఫీసులో ఆలస్యం అవుతుంది. ఇంకోరోజు దారిలో ఫ్రెండ్ కనుపిస్తే ఆలస్యం అవుతుంది. ఆలస్యం చెయ్యకుండా ఒక్క రోజు అయినా ఇంటికి వచ్చారా?"

"వాణీ! నాకు విసుగ్గా ఉంది. గొడవ చెయ్యకు."

"ఉంటుందండీ. నేను మాట్లాడితేనే మీకు విసుగ్గా ఉంటుంది. బయట స్నేహితులతో గంటలు తరబడి మాట్లాడతారు. ఇంటికొచ్చిం తర్వాత, పెళ్ళాంతో పదినిముషాలు మాట్లాడాలంటే మీకు విసుగ్గానే ఉంటుంది. రోజూ, స్నేహితులతో తిరిగి తిరిగి అర్ధరాత్రి దాటింతర్వాత నేగా, మీరు ఇంటికి చేరుకునేది. ఈ రోజు ఆదివారంకదా ఈరోజు అయినా ఇంటిపట్టున ఉంటారేమో మీతో కల్సి సరదాగా సినిమాకు వెళదాం అనుకున్నాను. నా ముఖానికి అంత అదృష్టం కూడానా!"

"చిన్న విషయానికి, ఎందుకలా సుప్రభాతం చదువుతావు? సినిమాకు వెళ్ళాలనుకుంటే పక్కవాటా వాళ్ళతోనో పనిమనిషిని తీసుకునో వెళ్ళక పోయావా? నిన్ను వద్దన్నది ఎవరు? దానికి కూడా ఇంత రాద్ధాంతం చెయ్యాలా?"

"ఎందుకెళ్లాలి? ఏ ఆడది అయినా భర్తతో కల్సి సినిమాలకూ, షికార్లకూ వెళ్ళాలనుకుంటుంది గానీ, పక్కవాటా వాళ్ళతోనూ, పనిమనుష్యులతోనూ వెళ్లాలనుకోదు. ఇలాంటి సున్నితమయిన విషయాలు మీకు అర్థమయితే నేనింత బాధపడాల్సిన అవసరం ఏముంది.?"

"నిన్ను సినిమాకు రేపు తీసుకు వెళతాను. ఇప్పటికి నోరు మూసుకో."

"నోరు మూసుకోక చెయ్యగలిగింది ఏముంది.? పెళ్ళి అయిందగ్గర్నుంచి, నోరు మూసుకునే ఉంటున్నాను."

"ఛి. రాను, రాను మరీ చిన్నపిల్లలా తయారవుతున్నావు. పక్కవాళ్ళు వింటారేమో అన్న ఆలోచనకూడా లేదు నీకు."

"భోజనం అయినా చేస్తారా? లేదా?"

"ఆకలిగా లేదు. నువ్వు భోంచెయ్యి."

"భోజనం కూడా ఫ్రెండ్స్ కల్సి, హోటల్లో చేశారా?"

"నీ యక్షప్రశ్నలతో, నాకు మనశ్శాంతి లేకుండా చేస్తున్నావు. నేనెక్కడా భోంచెయ్యలేదు. నాకు ఆకలిగా లేదు."

"ఉదయం కూడా సరిగా, భోంచెయ్యలేదు. ఆకలి ఎందుకు కాదు రండి వడ్డిస్తాను"

"ఆకలిగా లేదు. నా కక్కర్లేదు అని చెప్పానా? నన్ను విసిగించకుండా ఇక్కడ నుంచి వెళ్ళు."

అన్నాడు రాజేష్ కటువుగా.

ఆ మాటలతో, ఇంకేం అనలేక లోపలికి వెళ్ళిపోయింది వాణి." హమ్మయ్య వాన కురిసి వెలిసినట్టుగా ఉంది అనుకున్నాడు మనస్సులో రాజేష్.

సాయంత్రం ఆరుగంటలు దాటింది. హాస్పటల్ పని పూర్తిచేసి ఆరుబయట పూలమొక్కల మధ్య కుర్చీ వేసుకుని కూర్చుంది లలిత.

రాజేష్ వచ్చి లలిత ఎదురుగా కూర్చుంటూ "బిజీగా ఉంటావేమో అనుకుంటూ వచ్చాను. అదృష్టం కొద్దీ తీరికగా కూర్చున్నావు." అన్నాడు.

"హాస్పటల్ పని పూర్తిఅయింది. ఆఫీసు నుంచి వస్తున్నారా? ఇంటిదగ్గరనుంచి వస్తున్నారా?"

"ఇంటికెళ్ళిం తర్వాత, మళ్ళీ బయటకు రావాలంటే వాణివేసే యక్షప్రశ్నలకు సమాధానం చెప్పలేను. ఎక్కడకు వెళుతున్నావు? ఎందుకెళుతున్నావు అంటూ ఒకటే గొడవ."

"టీ తాగుతావా?

"నేను ఆఫీసునుంచి వస్తూ హోటల్లో తాగొచ్చాను. నేనిక్కడకు వచ్చేది నీ అతిథి మర్యాదలకు కాదు."

"మరెందుకో?"

"నిన్ను చూడటానికి."

"నిజంగానా?"

"నీతో నేనెప్పుడయినా అబద్ధం చెప్పానా?"

"నాలుగురోజుల నుంచి, మీరు కనుపించకపోతే నన్ను మరిచిపోయారేమో అనుకున్నాను."

"నిన్ను మరిచిపోవటమా? అది ఈ జన్మకు సాధ్యం కాదు."

"లలితా! నిన్ను మరిచిపోగలిగితే, నేనే మనశ్శాంతిగా ఉండగలిగే వాడిని."

"నా జ్ఞాపకాలు మీ మనస్సులో ఇంకా నిలిచి ఉన్నాయా?"

"మరిచిపోలేని నీ జ్ఞాపకాలను నెమరువేసుకుంటూనే, జీవితాన్ని గడుపుతున్నాను. ఆ తీపి జ్ఞాపకాలే లేకపోతే, ఎప్పుడో ఆత్మహత్య చేసుకునే వాడిని."

"ఇన్ని సంవత్సరాలు గడిచిపోయినా, మీ మనస్సులో నా స్థానంలో అలాగే వుంది. నేను అదృష్టవంతురాలినండి. ప్రేమ, ప్రేమను కోరుకుంటుంది. ప్రేమ శారీరక

కోరికలకు అతీతమయినది. నేను, మీ నుంచి కోరుకునేది కూడా, అటువంటి ప్రేమేనండి.”

“లలితా! నేను నిన్ను మరిచి పోగలనని ఎలా అను కున్నావు!”

“మీరు వాణిని పెళ్ళి చేసుకున్నారని తెలిసింతర్వాత నా మీద అనిష్టంతో నన్ను మరిచి పోయారనుకున్నాను. నేను కోరుకున్నదీ అదే అయినా మీకు పెళ్ళి అయిందన్న నిజాన్ని భరించలేకపోయాను. పిచ్చిదానిలా అయిపోయాను. ఆ సమయంలో, నా క్లాస్‌మేట్ రాధ నన్ను ఓదార్చి, నా మనస్సును చదువుమీద లగ్నం అయ్యేలా చేసింది. నిన్ను మరిచిపోవాలని పగలూ, రాత్రీ చదువుతూ అయిదు సంవత్సరాలు.

సినిమాలు, షికార్లు అన్నీ మరిచిపోయి పుస్తకాలే ప్రపంచంగా గడిపాను. అయిదు సంవత్సరాలు కాలగర్భంలో గడిచిపోయాయి. గిరి చనిపోయిన తర్వాత అమ్మా, నాన్న నన్ను పెళ్ళిని గురించి నన్ను వత్తిడి చెయ్యలేదు. ఈ వయస్సులో మాకు దూరంగా వెళ్ళిపోవద్దమ్మా. మన ఊళ్లోనే ప్రాక్టీసు పెట్టు అని నాన్నగారు బ్రతిమాలారు. అమ్మా నాన్నగార్ల ముఖంలోకి చూడగానే, వాళ్ళు నాకు చేసిన అన్యాయం మనస్సులో మెదిలేది. దాంతో వాళ్ళు ఆగర్భ శత్రువుల్లా కనిపించేవారు. వాళ్ళను ఆ భావంతో చూస్తూ, వాళ్ళ ఎదురుగా ఉండలేకపోయాను. ఇప్పుడు, నేను ప్రాక్టీసు

పెట్టిన ఈ బిల్డింగ్స్ నా ఫ్రెండ్ రాధ నాన్నగారు, రాధ ప్రాక్టీసుపెట్టటానికి కట్టించారు. తర్వాత రాధ పెళ్ళి అయింది. రాధ భర్త కూడా డాక్టరే వాళ్ళిద్దరికీ అమెరికా వెళ్ళే అవకాశం రావటంతో, ఇక్కడ ప్రాక్టీసు పెట్టే ఉద్దేశ్యం మానుకున్నారు. రాధ నాన్నగారికి రాధ ఒక్కతే కూతురు కావటం వలన, కూతుర్ని వదిలి ఉండలేక ఆయన కూడా కూతురితో పాటు అమెరికా వెళుతూ ఈ బిల్డింగ్స్ అమ్మేస్తుంటే, రాధ నన్ను ఈ బిల్డింగ్స్ తీసుకుని ఇక్కడ ప్రాక్టీసు పెట్టమని చెప్పింది. దాని సలహాతోనే, ఈ బిల్డింగ్స్ కొని ఇక్కడ ప్రాక్టీసు పెట్టాను."

"లలితా! నీ జీవితం, ఇలా మోడులా కావటానికి కారణం నేను. ఇన్ని సంవత్సరాల నుంచీ, నువ్వెంత చిత్రహింసను అనుభవించావో, ఊహించటానికి కూడా భయంగా ఉంది నాకు. ఆరోజు ఆవేశంలా, నన్ను మోసం చేసావని నిన్ను ద్వేషించానే కానీ ఎందుకలా ప్రవర్తించావా అని ఆలోచించలేకపోయాను. అలా ఆలోచించగలిగి ఉంటే, నిజం నాకు తెలిసేది. నువ్వు నన్ను పెళ్ళి చేసుకోవటానికి ఒప్పుకోపోయినా, బలవంతంగా అయినా నిన్ను నాతో తీసుకెళ్ళేవాడిని. నీ జీవితం ఇలా అయ్యేది కాదు." సుళ్ళు తిరుగుతున్న కన్నీటితో, వేదనగా అన్నాడు రాజేష్.

"పెళ్ళిళ్ళు స్వర్గంలోనే జరుగుతాయంటారు. బహుశా అది నిజమేనేమో. మనిద్దరం పెళ్ళి చేసుకునే అదృష్టం మనకు లేదు. అందుకే మనదారులు ఇలా వేరయ్యాయి."

కాదు. నా ఆవేశమే, మనల్ని వేరు చేసింది."

"అలా ఎందుకనుకోవాలి? ఎలా జరగాలనుంటే అలా జరుగుతుంది. విధివ్రాత కాకపోతే, నా జీవితంలో చెరగని ముద్రను వేసి, యాక్సిడెంటులో చనిపోయారు గిరి. ఆ చచ్చేదేదో, రెండునెలలు ముందుగా చస్తే సరిపోయేది. నా జీవితాన్ని నాశనంచేసి మరీ చచ్చాడు." అంది లలిత కన్నీటితో.

"జరిగిపోయినదాన్ని గురించి ఆలోచించుకుంటూ, కూర్చుంటే ప్రయోజనం ఏముంది? జరగబోయేదాన్ని గురించి ఆలోచించుకోవాలిగాని లలితా! ఎంతకాలమిలా ఒంటరిగా ఉంటావు?"

"జీవితం అంతా."

"జీవితం అంతా నువ్విలాగే ఉండగలవని నాకు తెల్సు. కానీ, నిన్ను ఇలా చూస్తూ నేనెలా ఉండగలను?"

"అంతకన్నా చెయ్యగలిగింది మాత్రం ఏముంది?"
"ఎందుకు లలితా! అంత నిరాశను పెంచుకుంటావు?"
"ఆశలేని, నిరాశనే తోడుగా మిగుల్చుకున్నాను."
"నేనొక మాట చెబుతాను వింటావా?"

"వింటావా అని ప్రాధేయపూర్వకంగా అడగటం ఎందుకు? నన్ను ఏ విషయంలో నయినా శాసించే అధికారం మీకున్నప్పుడు."

"మనిద్దరం రిజిష్టరు మ్యారేజి చేసుకుందాం."

"అది అంత సులభం అనుకున్నారా!"

"మనం ఆలోచించే విధానాన్ని బట్టి వుంటుంది ఏదైనా."

"వాణినేం చేస్తారు?"

"వాణికూడా ఉంటుంది."

"నేను?"

"నువ్వూ ఉంటావు. వాణి నాకు భార్యగా, నా ఇంట్లో ఉంటుంది. నేను నీకు భర్తగా నీ ఇంట్లో ఉంటాను."

"ఇద్దరు భార్యలతో కాపురం చేస్తారా?" అని నవ్వి నవ్వుతూ అంది లలిత."

"లలితా! నిన్ను మరిచిపోయి, నేను వాణిని పెళ్ళి చేసుకుని హాయిగా ఉన్నానని నువ్వనుకుంటున్నావు. కానీ, నన్ను మరిచిపోలేక నువ్వెంత బాధపడుతున్నావో, నిన్ను మరిచిపోలేక నేనుకూడా అంతే బాధపడుతున్నాను. నువ్వు ఆడదానివి కాబట్టి కన్నీటితో అయినా నీ మనస్సును తేలిక పరుచుకోగలుగుతున్నావు నువ్వు. నేను మగవాడిని కాబట్టి అవని కూడా చెయ్యలేక నాలో నేను కుమిలిపోతున్నాను. అంతగా నన్ను ప్రేమించే వాడివి, వాణిని ఎలా పెళ్ళి చేసుకున్నావు? అని నువ్వనుకోవచ్చు. బాంధవ్య బంధాన్ని తెంచుకోలేకపోయాను. చిన్నతనం నుంచీ, మామయ్య నన్ను పెంచి ఇంతవాడిని చేసారు. ఆ కృతజ్ఞతతో, నువ్వు దూరం అయ్యావు. ఏలాగూ నిన్ను భార్యగా పొందలేను. నన్ను

ప్రేమించే వాళ్ళకు కూడా దూరం కావటం ఎందుకన్న బాధతో వాణిని పెళ్ళి చేసుకున్నాను. ఆడది మాత్రమే కాదు. లలితా మగవాడు కూడా ఒక్కసారే ఒక్కరికే మనసివ్వగలడు. మనసిచ్చిన నిన్ను మరిచిపోలేక, వాణితో కాపురం చెయ్యలేకా, నేనెటువంటి బాధను అనుభవిస్తున్నానో నీకు తెలియదు."

"పెళ్ళి అయినంతర్వాత, మానసికంగా నేను సంతోషించిన రోజంటూ లేదు లలితా! నా మాట విను మనిద్దరం రిజిష్టరు మ్యారేజి చేసుకుందాం."

"ఏమండీ! తీసుకోవటంలో కంటే, ఇవ్వటంలోనే తృప్తి, ఆనందం ఉంటుంది. వాణి చిన్నతనం నుంచి మిమ్మల్ని ప్రేమిస్తుందని నాకు తెలుసు. మిమ్మల్నే ప్రేమించి, పెళ్ళి చేసుకోగలిగిన అదృష్టవంతురాలు. సాటి ఆడదానిగా, ఆమె చిన్ననాటి స్నేహితురాలిగా, ఆమె అదృష్టాన్ని నేను దోచుకోలేను. బ్రతికుండగానే వాణిని సజీవసమాధిని చేసి ఆమె సమాధిపై నా కొత్త జీవితానికి పునాదులు నిర్మించుకోలేను. నేను డాక్టర్ని. ఈ వృత్తిలో అన్ని కోరికలకూ అతీతంగా ఉండటం అలవాటు చేసుకున్నాను. అలాగే ఉండిపోతాను. వాణి, మీతో కాపురం చేస్తూ, మీ ప్రేమను పొందుతుంది. మీరు దూరం అయితే, వాణి బ్రతకలేదు. ఏ ఆడది అయినా తను ప్రేమించేమగవాని మనస్సులో మరో ఆడదానికి చోటుండటం సహించలేదు. మీరు తనకు దూరం అయ్యారన్న నిజం వాణికి తెలిస్తే, ఆమె గుండె బ్రద్దలయిపోతుంది. ఆమె బాధ

పడితే, ఏ లోకాలలో ఉన్నా మీ మావయ్య ఆత్మకు శాంతి ఉండదు. ఇటువంటి ఆలోచనలు మీ మనస్సులోకి రానీయకండి."

"ఇటువంటి సెంటిమెంట్స్ నీ జీవితాన్ని ఇలా చేసాయి. ఇంకా ఇలాంటి పనికిమాలిన సెంటిమెంట్స్‌తోనే, ముందు జీవితాన్ని గురించి నువ్వు ఆలోచించుకోకు. ఒకరి విషయం నీకెందుకు? ఇటువంటి త్యాగాలు సినిమాలలో చూడటానికి అందంగా కనుపిస్తాయి. జీవితంలో ఎంత కష్టమో నీకూ తెల్సు. కరుగుతున్న కారుచీకటిలో, కార్చే నీ కన్నీటిని తుడిచి నిన్ను ఓదార్చేదెవరు?"

"అలా ఆలోచించటం ఎందుకు? నా కన్నీరు, తుడిచి నన్ను ఓదార్చేదెవరు? అని ఆలోచించే కంటే నేనెవరి కన్నీరు తుడిచి, ఎవర్ని ఓదార్చుతున్నాను అని ప్రశ్నించుకుంటే?"

"నీకెలా నచ్చజెప్పాలో, నాకర్థం కావటంలేదు. లలితా." అన్నాడు రాజేష్ వేదనగా.

"ఇక ఆ విషయాన్ని వదిలేయండి. ఇంకేమయినా చెప్పండి."

"ఏం చెప్పమంటావు?"

"అది కూడా నేనే చెప్పాలా?" అంది లలిత నవ్వుతూ లలిత నవ్వుతుంటే, రాజేష్‌కు మనస్సులో మల్లెపూల వర్షం కురిసినట్టుంది. లలిత నవ్వుతుంటే బుగ్గమీద అందంగా సొట్టలు పడతాయి. చెవులకున్న జూకాలు తమాషాగా కదు

ఉంటాయి. అలాంటప్పుడు లలిత ముఖం చూడాలంటే చాలా ఇష్టం రాజేష్‌కు.

"ఏమిటలా చూస్తున్నారు!" రాజేష్ కళ్ళలో కళ్ళు పెట్టి చూస్తున్నట్టుగా చూస్తూ అడిగింది లలిత.

"నువ్వు నవ్వుతుంటే, మల్లెల వర్షం కురుస్తున్నట్టు ముత్యాలు జాలువారుతున్నట్టు ఉంటుంది. ఈ నీలం రంగు జరీ చీరలో, నువ్వెంత అందంగా ఉన్నావో తెలుసా!"

"ఎంత అందంగా ఉన్నా ఎవరుచూసి ఆనందించటానికి!" విరక్తిగా అంది లలిత.

ఆమాట శూలంలా గుచ్చుకుంది, రాజేష్ మనస్సుకు.

"కోరికలకు అతీతమయినది, నీ ప్రేమ అని నువ్వే చెప్పావు. నిన్ను చూసి ఆనందించడానికి నేను లేనా!" లలిత కళ్ళలోకి ఏదో వెదకుతున్నట్టుగా చూస్తూ అన్నాడు రాజేష్.

అతనికి సమాధానంగా అతనివైపు చూసింది లలిత. ఆ చూపుల్లోని భావాన్ని అర్థంచేసుకున్న రాజేష్ తలవంచుకున్నాడు.

"మీరున్నారన్న భావనే నన్ను బ్రతికిస్తుందని మీకు తెలుసు."

"అందుకే చెబుతున్నాను. నా కోసం అయినా, నువ్వు ఆనందంగా ఉండాలి. నిన్ను చూసుకునే నేను తృప్తిగా బ్రతకాలి." ఆరాధనగా లలితవైపు చూస్తూ అన్నాడు రాజేష్.

"ఏమండీ! ఈ రాత్రికి ఇక్కడ భోంచేస్తారా?"

"వద్దు లలితా! ఇంటికి వెళతాను."

"ఏం ఇక్కడ భోంచెయ్యకూడదా?"

"ఇంటిదగ్గర వాణి నాకోసం భోంచెయ్యకుండా ఎదురు చూస్తూంటుంది."

ఆ మాటకు లలిత గుండెను కత్తితో రెండుగా చీలుస్తున్నట్టుగా బాధతో విలవిలలాడిపోయింది. లలిత ముఖంలో ప్రతిఫలిస్తున్న వేదనను చూసిం తర్వాత అర్థమయింది రాజేష్‌కు, తనెంత పొరపాటుగా మాట్లాడిందీ.

"అవును. వాణి మీ భార్య, మీకోసం ఎదురు చూస్తుంటుంది." అంది లలిత వేదనగా.

ఒకరికొకరు మాట్లాడుకోవటానికి, మాటలే దొరకనట్టుగా, బరువెక్కిన హృదయాలతో మౌనంగా కూర్చున్నారు.

"వెళుతున్నాను." అంటూ లేచాడు రాజేష్ చూస్తూ కూర్చుంది లలిత.

# 14

"రాజేష్ ఇంటికి వచ్చేసరికి టయిము రాత్రి ఎనిమిది గంటలయింది. వాణి బయట కనుపించలేదు. అలక పాన్పు ఎక్కింది కాబోలు అనుకుంటూ బట్టలు మార్చుకోవ

టానికి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి లైట్ వేసాడు. ట్యూబ్‌లైటు కాంతి, గది అంతా తెల్లగా పరుచుకుంది. రాజేష్ ఊహించినట్టుగానే, వాణి మంచంమీద పడుకుని ఉంది.

బట్టలు మార్చుకుని, వాణి మంచం దగ్గరకు వచ్చి వాణి ముఖాన్ని తనవేపుకు తిప్పుకుంటూ "వాణీ! ఏమిటి అప్పుడే పడుకున్నావు! ఒంట్లో బాగలేదా?"

"బాగానే వుంది."

"మరెందుకలా ఉన్నావు!"

"ఎలా ఉన్నాను?"

"ఒకసారి అద్దంలో నీ ముఖం చూసుకో. ఎలా ఉన్నావో నీకే అర్థమవుతుంది."

"నా ముఖం ఎలా ఉంటే, మీకెందుకు గాని, భోం చేద్దురుగాని రండి." మంచం మీద నుంచి లేస్తూ అంది వాణి.

"నువ్వింత కోపంగా మాట్లాడుతుంటే,నాకు భోంచెయ్యాలనిపించదు."

"పాపం నేనంటే ఎంత ప్రేమ."

"నువ్వంటే, ప్రేమలేక ఎవరంటే ఉంటుంది?"

"ఎనిమిది సంవత్సరాల నుంచీ, మీరు చెబుతున్న అబద్ధాలన్నీ నిజమని నమ్ముతూనే ఉన్నాను. మీ స్నేహితులమీద చూపించే ప్రేమలో పదోవంతు అయినా నామీద చూపిస్తున్నారా?"

"అలా అని నువ్వనుకుంటున్నావు. ప్రేమ అనేది మనస్సులో ఉండాలిగాని, పది సార్లు నోటితో చెబితేనే ప్రేమున్నట్టు కాదు."

"మీరు మాటలతో మోసం చేస్తారు." కోపంగా అంటూ వంటగదివైపు వెళ్ళింది వాణి.

రాజేష్ వచ్చి డైనింగ్ టేబులు ముందు కూర్చున్నాడు. వాణి రాజేష్ కు మాత్రమే వడ్డించింది. రోజులా తను కూడా వడ్డించుకోలేదు.

"అదేమిటి? నువ్వు వడ్డించుకోలేదేం?"

"ఆకలిగా లేదు."

"ఎందుకుండదు? నువ్వు భోంచెయ్యకపోతే నేను కూడా భోంచెయ్యను."

భర్త ఎక్కడ భోంచెయ్యడో అన్న భయంతో తను కూడా వడ్డించుకుని అన్నం కెలుకుతూ కూర్చుని, రాజేష్ భోంచెయ్యగానే కంచంలో, చేయి కడుక్కుని లేచింది. వాణి వంటగది సర్దుకుని బెడ్ రూములో కొచ్చేసరికి, సిగరెట్ కాలుస్తూ కిటికీ దగ్గరగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు రాజేష్.

వాణి మవునంగా తన మంచంమీద పడుకుంది. భర్త తనదగ్గరకు వచ్చి, ఆలస్యం అయినందుకు కారణం చెప్పి తనను అనునయిస్తాడని అనుకుంది. వాణి ఆశ, నిరాశే

అయింది. సిగరెట్ మీద, సిగరెట్ కాలుస్తూ కుర్చీతో అలాగే కూర్చున్నాడు రాజేష్.

ఆ రోజు భర్త ఎందుకలా ఉన్నాడో అర్థంగాక, చింత నిప్పుల్లా మెరుస్తున్న అతని కళ్ళను చూసి కారణం అడిగే ధైర్యం లేక, కన్నీటితో దిండును తడుపుతూ పడుకుంది వాణి.

# 15

ఆరోజు ఆదివారం. సాయంత్రం నాలుగు గంటలు కావస్తుంది. క్రిస్టా బ్యారేజి దాటి కొండపక్కగా ఉన్న ఇసుక తిన్నె మీద లలిత కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు రాజేష్. ఆదివారం సాయంత్రం నాలుగు గంటలకు అక్కడకు రమ్మని చెప్పింది లలిత రాజేష్‌తో.

అర్థగంట తర్వాత వచ్చింది లలిత అక్కడకు "సారీ. ఆలస్యం అయింది" రాజేష్‌కు దగ్గరగా కూర్చుంటూ అంది లలిత.

'ఇక్కడకు రమ్మన్నావెందుకు లలితా! హాయిగా బాల్కనీలో కూర్చుని మాట్లాడుకునే వాళ్ళంగా. "మనస్సు బాగలేనప్పుడల్లా, నేనిక్కడకు వచ్చి కూర్చుంటాను. ఈ పరిసరాలు అంటే నాకు చాలా యిష్టం." దూరంగా కనుపిస్తున్న కొండలలేపు చూస్తూ అంది లలిత.

ఒకవైపు, గలగల పారుతూ ముందుకు సాగిపోతున్న కృష్ణవేణి, మరోవైపు కనుపిస్తున్న విజయవాడ పట్టణం ఇంకో వైపు పచ్చని పైరచేలు నదీ తరంగాలమీద నుంచి తేలి వస్తున్న చల్లని గాలి మనస్సులను ఆహ్లాదపరుస్తూ సిటీలోని హడావుడికి, కాస్త దూరంగా ఉన్న ఆ ప్రాంతం ప్రశాంతంగా ఉంది. "ఏమండీ! మిమ్మల్ని ఒక వరం కోరాలనుకుంటున్నాను. ఇస్తారు కదూ!"



"అంత బేలగా మాట్లాడకు లలితా! నేను భరించలేను. నీ కోసం నా ప్రాణాలయినా ఇస్తాను. ఏం చెయ్యమంటావో చెప్పు!"



"ఈ నెలరోజులనుంచీ, నాలుగురోజుల కొకసారి అయినా మిమ్మల్ని చూస్తున్నాను. ఆ తృప్తి చాలటంలేదు. నాకు, రోజుకు ఒక్కసారి అయినా ఒక్క అయిదునిముషాలు నాక్కనిపించి వెళ్ళండి. అంతకు మించి మిమ్మల్ని ఎప్పుడూ ఏదీ కోరను."



"లలితా!"

"ఈ ఒక్క కోరిక తీర్చలేరా!"

"రోజూ కనుపించి, గతాన్ని గుర్తుచేసి నిన్ను బాధ పెట్టడం ఎందుకని. నీ దగ్గరకు రావటం లేదు. నువ్వొప్పుకుంటే చాలుగాని, పగలూ, రాత్రి నీ ఎదురుగానే ఉంటాను అంతకు మించిన అదృష్టం నాకింకేం ఉంటుంది? చెప్పు"

"ఉదయం నిద్ర లేచిన దగ్గర్నుంచీ, మిమ్మల్ని చూడాలని నా మనస్సు తపించి పోతుంది. సాయంత్రం అయ్యే సరికి, మీ స్కూటరు శబ్దం వినిపిస్తుందేమో అని ఎదురు చూడటం అలవాటయింది. మీరు కనుపించని రోజు, ఏదో వెలితిగానూ దిగులుగానూ ఉంటుంది. అందుకే, ఏదో ఒక టయములో వచ్చి కనుపించి వెళ్ళండి."

"ఇదేనా, నువ్వు కోరాలనుకున్న కోరిక?"

"అవును."

"ఆఫీసు అయిపోయిం తర్వాత, సరాసరి ఇక్కడకే వస్తాను. నువ్వు హాస్పటల్‌లో పనిచేసే వేళలు మార్చు. అయిదున్నరకు హాస్పటల్ పని పూర్తి అయ్యేలా చూడు. నేనొచ్చి ఒక గంట కూర్చుని వెళతాను. నేనొచ్చేటయానికి, నువ్వు పేషంట్సుతో కూర్చుంటే, నేనిక్కడ ఒంటరిగా కూర్చోవాలి."

"అలాగే చేస్తాను డాక్టరు చదివాను కాబట్టి కాల క్షేపం కోసం ప్రాక్టీసు పెట్టాను. డబ్బుకోసం కాదు. అయిదున్నరకు హాస్పటల్ పని పూర్తిచేసుకుని మీకోసం ఎదురు చూస్తుంటాను."

"అలాగే."

"నన్ను అర్థం చేసుకుని, నా కోరిక మన్నిస్తారో లేదో అని భయపడ్డాను."

"పిచ్చి లలితా! ఇన్ని రోజులయినా, నన్ను అర్థం చేసుకోలేక పోయావు. నువ్వు నా మనస్సును అర్థం చేసుకోలేదు కాబట్టే ఇన్ని అనర్థాలు జరిగిపోయాయి."

"నా జీవితం ఎలా మారినా, మీరయినా సుఖంగా ఉన్నారు. నా కంతేచాలు."

"నేను సుఖంగా ఉన్నాననీ, నువ్వనుకుంటున్నావు. కానీ, మానసికంగా నేను ఎంతటి వేదనను అనుభవిస్తున్నానో, మాటలతో చెప్పినా నీకు అర్థంకాదు." అన్నాడు రాజేష్ వేదనగా.

"ఏమండీ! వాణి మిమ్మల్ని ప్రేమించి పెళ్ళి చేసుకుంది. ఆమె ప్రేమలాహిరిలో తేలి పోతున్న మీరు ఎందుకంత బాధ పడుతున్నారో నా కర్థం కావటం లేదు. గతాన్ని మీ మనసులో ఒకమూల దాచుకుని భవిష్యత్తులో సుఖపడటం నేర్చుకోండి."

"ఎదుట వాళ్ళకు నీతులు చెప్పటం చాలా తేలిక లలితా! ఆ నీతుల్ని ఎవరికి వారు ఆచరణలో పెట్టటమే కష్టం. వాణి కూడా నన్ను ప్రేమించే పెళ్ళి చేసుకుంది. వాణి ప్రేమలో స్వార్థం ఉంది. నీ ప్రేమలో త్యాగం ఉంది. వెన్నెలలోని చల్లదనం, మనస్సుకు ఒదార్పు నీ ప్రేమలో నేను పొందుతాను."

"వాణి అమాయకు రాలు. మీరు ఆమెను సంగా అర్థం చేసుకోలేదు."

"అమాయకు రాలు కాదు లలితా! అన్యాయపరు రాలు."

"ప్రేమ వున్నచోటనే, అన్యాయంకూడా ఉంటుంది.

ప్రేమే లేకపోతే, అసూయకు తావే లేదుగా!"

"ఏ వైపునుంచి చూసినా, సంతోషమే లేదునాకు."

"సంతోషం అనేది, ఎక్కడనుంచో రాదు. బాధల్లో సంతోషాన్ని వెతుక్కోవాలి." ఓదార్పుగా అంది లలిత.

"వెళ్ళనా? వాణి ఎదురు చూస్తుంటుంది."

"మీరు వాణికి భయపడతారనుకుంటాను. ఇక్కడకు వచ్చింతర్వాత, ఇప్పటికి వాణి ఎదురు చూస్తుంటుంది. వెళతాను అని మూడుసార్లు చెప్పారు."

"వాణిని ఎలా అర్థం చేసుకోవాలో నాకర్థంకావటం లేదు లలితా. తల్లీ, తండ్రిని పోగొట్టుకుని, అనాథనయిన నన్ను ఆదరించి మామయ్య నన్నీస్థితికి తెచ్చాడన్న కృతజ్ఞతతో వాణిని పెళ్ళి చేసుకున్నాను. వాణిని నాకంటిపాపలా చూసుకుంటున్నాను. అయినా వాణి నన్ను అర్థం చేసుకోకుండా మాట్లాడుతుంది. నేనేదో, తనకు అన్యాయం చేస్తున్నట్టూ, వాళ్ళనాన్నగారి మీదుండే కృతజ్ఞతతో, ఇష్టం లేకపోయినా తనను పెళ్ళి చేసుకున్నానని బాధపడుతుంది. తనను నేను, ప్రేమగా చూడటం లేదట. ఎప్పుడూ నన్ను అనుమానిస్తు శూలాల్లాంటి మాటలతో బాధపెడుతుంది. తనకోసం నేనెంత త్యాగం చేస్తున్నానో తనకు తెలియదు."

"వాణికి తెలియక పోయినా, మీరు వాణికి నచ్చ జెప్పి మీకనుకూలంగా మార్చుకోవచ్చుగా!"

"తనకు తెలియదు. నేను చెప్పినా అర్థం చేసుకోదు."

"మీరు ఉన్న విషయాన్ని, పెద్దగా ఊహించుకుని బాధపడుతున్నారనుకుంటాను."

"ఈ విషయాలన్నీ చెప్పి నీ మనస్సు బాధపెట్టాను."

"ఇన్ని రోజులనుంచీ మీరు వాణిని పెళ్ళి చేసుకుని హాయిగా కాపురం చేసుకుంటున్నారనుకున్నాను. గానీ, మనస్సులో ఇన్ని అగ్నిగోళాలు దాచుకుని, మీలో మీరు కుమిలిపోతున్నారనుకోలేదు. నేను మీ పాలిట శాపాన్ని అయ్యాను."

"అంతమాటనకు లలితా! ప్రేమించే వాళ్ళకంటే, ప్రేమించబడే వాళ్ళు ఎంతో అదృష్టవంతులు. నన్ను ప్రేమించి, నా కోసం నీ నూరేళ్ళ జీవితాన్ని నా కంకితం చేసిన ప్రేమమూర్తివి నాకు. నీ ప్రేమ నాది. ఆ బలంతో, జీవితంలో ఎన్ని కష్టాలయినా సంతోషంగా ఎదుర్కోగలను." నిండుగా లలితను చూస్తూ అన్నాడు రాజేష్.

"ఏమండీ! మనం మాటల్లోపడి. చీకటి పడిందన్న విషయం కూడా గమనించలేదు. వెళదాం లేవండి." లేస్తూ అంది లలిత.

"నువ్వు కారులో వెళ్లు. నేను నా స్కూటరుమీద వెళతాను."

"అలాగే." అంటూ కారులో కూర్చుని స్టార్ట్ చేసింది. లలిత. లలిత కారు కనుపించినంత సేపు చూసి, తన స్కూటరు స్టార్ట్ చేసాడు రాజేష్.

# 16

"ఆదివారం కూడా, ఇంటిపట్టున ఉండకుండా ఎక్కడకు వెళ్ళారండీ!" హాలులోనుంచి వస్తూ అప్పుడే బయటనుంచి, హాలులోకి రాబోతున్న భర్తను చూసి కోపంగా అడిగింది వాణి.

వాణి ప్రశ్నకేం సమాధానం చెప్పకుండా బట్టలు మార్చుకుని వచ్చి వరండాలో కూర్చున్నాడు రాజేష్. భర్త మవునం, వాణిలోని కోపాన్ని మరింత అధికం చేసింది.

"మాట్లాడరేం? ఎక్కడకు వెళ్ళారు!"

"నీకు చెప్పాల్సిన అవసరం లేదు."

"మీకు చెప్పాల్సిన అవసరం లేకపోయినా భార్యగా మిమ్మల్ని అడిగే అధికారం నాకుంది."

"నీకుంది అధికారమేగానీ, అనురాగం కాదు." కోపంగా అన్నాడు రాజేష్.

"నేను మాట్లాడితేనే ఎందుకలా కోపంగా కసురుకుంటారు! బయట వాళ్ళందరితో, గంటల తరబడి నవ్వుతూనే

మాట్లాడకూడదా? నా ముఖం చూస్తేనే మీకు ఎక్కడలేని కోపం పుట్టుకొస్తుంది."

"మళ్ళీ మొదలుపెట్టావా సుప్రభాతం? ఇంటికి రావాలంటేనే భయంగా ఉంటుంది."

"మీరు ఎప్పుడూ ఇంటికి వచ్చేది అర్ధరాత్రి దాటిం తర్వాతేగా? ఇప్పుడు మాత్రం రావటం ఎందుకు? ఏ స్నేహితుడి రూములోనో పడుకుంటే సరిపోతుంది."

"నువ్వు నోరు మూసుకుంటావా? నన్ను బయటకు వెళ్ళమంటావా?"

"తిరిగి, తిరిగి ఇప్పుడేగా బయటనుంచి వచ్చారు పాపం. మళ్ళీ ఎందుకు లేండి వెళ్ళటం? ఏమండీ! నాకు తెలియక అడుగుతాను. ఇష్టంలేకుండా నన్ను పెళ్ళి చేసుకుని, నా మెడలో ఈ ఉరితాడు ఎందుకు తగిలించారు? ఇష్టంలేకపోతే నన్ను పెళ్ళి చేసుకోవటం మానేయవచ్చుగా నన్ను పెళ్ళి చేసుకోమని, నేనేం మిమ్మల్ని ప్రాధేయపడలేదే!" అంది వాణి ఉక్రోషంగా.

"నేను చేసిన మొదటితప్పు, నిన్ను పెళ్ళి చేసుకోవటమే."

"మీ తప్పుకాదు నా ఖర్మ"

"నిన్ను ఉన్నా, ఏదో తక్కువయినట్లు ఎప్పుడూ ఏడ్వటం నీకలవాటయిపోయింది. అది నీ ఖర్మ. అందుకు నేనేం చెయ్యగలను?"

"కావలసింది ఒకటే తప్ప, అవసరం లేనివి అన్నీ ఉన్నాయి."

చుట్టుపక్కల వాళ్ళు వింటారేమో అన్న సిగ్గుకూడా లేదు నీకు. గొంతు చించుకుని అరవటం తప్ప, ఎప్పుడూ భర్తకు ఏం కావాలో కూడా తెలియదు నీకు. నీకంటే పశువు నయం. ఒక దెబ్బతో నయినా చెప్పిన విషయాన్ని అర్థం చేసుకుంటుంది. నువ్వు అంతకంటే కూడా హీనం" అరిచాడు కోపంగా రాజేష్.

"ఇష్టం లేకుండా నాలాంటి పశువుతో కాపురం చెయ్యటం ఎందుకు? నా దారిన నేను వెళతాను. మీకిష్టమయిన అమ్మాయిని పెళ్ళి చేసుకుని హాయిగా ఉండండి. మిమ్మల్ని కట్టుకుని, నేను మాత్రం సుఖం అనుభవిస్తున్నానా? ఎప్పుడూ చీదరింపులూ, విదిలింపులూ తప్ప. ఏ పల్లెటూరి వాడిని చేసుకున్నా హాయిగా ఉండేదాన్ని. మీలా చదువుకున్న మూర్ఖులు." అంది వాణి కోపంగా. ఆ మాటతో రాజేష్‌కు కోపం హద్దులు దాటిపోయింది. "ఏమన్నావ్? నేను చదువుకున్న మూర్ఖుణ్ణా? పల్లెటూరి వాడిని చేసుకున్నా సుఖపడేదానివా? అంటూ వాణి చెంప ఛెళ్ళుమనిపించాడు. రాజేష్. ఊహించని ఆ సంఘటనకు అవాక్కైపోయింది. వాణి చెంపకు చేయి ఆన్చుకుని బొమ్మలా అలాగే నిలబడిపోయింది. ఆవేశం తగ్గిపోయింతర్వాత రాజేష్ చాలా బాధపడ్డాడు. ఎప్పుడూ లేనిది వాణిమీద ఆ రోజు చెయ్యి చేసు

కున్నానే, పశువులా ప్రవర్తించానే అనుకుంటూ వాణిముఖం లోకి చూడలేక, బెడ్ రూములో కెళ్ళి పడుకున్నాడు.

అలాగే ఏడుస్తూ కూర్చుంది వాణి, హాలులోని గడియారం పదిగంటలు కొట్టింది అప్పుడు గుర్తుకు వచ్చింది వాణికి భర్త భోంచెయ్యలేదన్న విషయం.

లేచి బెడ్ రూములోకి వచ్చింది గోడవైపుకు తిరిగిపడుకుని ఉన్నాడు రాజేష్. భర్త మంచం మీద కూర్చుంది వాణి.

"ఏమండీ! ఉదయం ఎప్పుడో భోంచేసారు. ఎంత ఆకలితో ఉన్నారో. రండి. భోంచేద్దురుగాని." అనునయంగా భర్తతల నిమురుతూ అంది వాణి. రాజేష్ ఏం మాట్లాడలేదు.

"మాట్లాడరేమండీ. ఇంకా నా మీద కోపం తగ్గలేదా? మీ కోపం తగ్గకపోతే నన్ను తిట్టండి, కొట్టండి. అంతేగాని ఇలా మౌనంగా ఉండకండి. మీరు మాట్లాడకపోతే నేను భరించలేను."

"వాణీ! నన్ను విసిగించకు." అన్నాడు రాజేష్ కటువుగా.

"మీకిష్టమని పప్పుచారు రొయ్యల వేపుడు చేసాను. చల్లారిపోతున్నాయి లేవండీ."

"ఆకలిగా లేదు. నన్ను విసిగించకుండా వెళ్ళు."

"మీకోపం తగ్గేవరకూ, ఇంకా నాలుగుదెబ్బలు కొట్టండి. అంతేగాని భోజనం మాత్రం మానేయకండి."

నేను భోజనం మానేస్తే నీకంత బాధగా ఉంటుందా!" రాజేష్ మాటలో వ్యంగ్యం చోటు చేసుకుంది.

"ఉండదా?"

"నన్ను పెళ్ళి చేసుకున్నందుకు ఇప్పుడు బాధ పడు తున్నావా!"

"అలా అని నేను అన్నానా!"

"పల్లెటూరి వాడిని చేసుకున్నా సుఖపడేదాన్ని అని ఇంతకు ముందేగా అన్నావు!"

"ఏం చెయ్యను చెప్పండి! మీకు చదువూ, సంస్కారం ఉండీ కూడా నన్ను అర్థం చేసుకోలేక పోతున్నారన్న బాధతో అలా మాట్లాడాను. క్షమించండి. నేను మిమ్మల్ని ఎంతగా ప్రేమిస్తున్నానో, మీకు తెలియదండి. మీ ప్రేమ నాకెక్కడ దూరం అవుతుందో అన్న భయంతో, మీరు బయటనుంచి ఆలస్యంగా ఇంటికి వస్తే అనుమానిస్తాను. మీరు ఆఫీసుకు వెళ్ళిన దగ్గర్నుంచి, మీ కోసం ఎదురు చూస్తూ వరండాలోనే కూర్చుంటాను. గేటు వైపే చూస్తుం టాను. మీరు ఇంటికి రావటం ఒక్క గంట ఆలస్యం అయితే చాలు నా మనస్సులో ఎన్ని అనుమానాలు రేగు తాయో మీకు తెలియదండీ ఆ బాధతోనే, మీరు ఇంటికి రాగానే కోపంగా మాట్లాడతాను. నా బాధను మీరు అర్థం

చేసుకోకుండా మీరు మాట్లాడతారు. ఉదయం నుంచి ఈయన కోసం ఇంత ఆతృతగా ఎదురు చూసానే, ఎంత కటువుగా మాట్లాడు తున్నారు అని మనస్సులో బాధ పడ తాను. ఇంకెప్పుడూ అలా మాట్లాడను. నన్ను క్షమించండి." భర్తపాదాలమీద వాలిపోతూ అంది వాణి ఏడుస్తూ

"ఇద్దరికి భోజనం వడ్డించు. పద." మంచం మీదనుంచి లేస్తూ అన్నాడు రాజేష్. వాణి భోజనాలు వడ్డించటానికి డైనింగ్ టేబులు దగ్గరకు వెళ్ళింది.

తనకిష్టమయిన వవ్వాచారు, రొయ్యలవేపుడుతో వాణే కొసరి, కొసరి వడ్డిస్తూంటే తృప్తిగా భోంచేసాడు రాజేష్.

"ఏమండీ! నామీద కోపం తగ్గిపోయింది కదూ?" భర్త గుండెల్లో వదిగి పోతూ అంది వాణి.

"తగ్గిపోయింది." వాణిని మరింతగా హత్తుకుంటూ అన్నాడు రాజేష్.

"ఆఫీసు అయిపోగానే, ఇంటికి వస్తాను కదూ?"

"వీలయినంతవరకూ, ఇంటికి త్వరగా రావాలనే ప్రయత్నిస్తాను. మగాడు అన్నాక బయట ఎన్నో పనులుంటాయి. అది అర్థం చేసుకోవాలిగానీ, ఇంటికి రాగానే, ఎక్కడకు వెళ్ళారు? ఎందుకింత ఆలస్యం అయింది అంటూ సాధించటం మొదలు పెడితే, పగలంతా పనులతో అలిసిపోయి ఉండటం వలన ఆ సాధింపు కోపాన్ని, విసుగునూ కలిగిస్తుంది

ఒకర్ని ఒకరు భార్యా భర్తలు అర్థం చేసుకోగలిగితే. అసలు ఇలాంటి సమస్యలే తలెత్తవు" అన్నాడు రాజేష్ వాణి తలని నిమురుతూ.

"మీకు బయట ఎన్నో వ్యాపకాలుంటాయి. ఆ వ్యాపకాల్లో మీరు నన్ను మరిచిపోతారు. మిమ్మల్ని గురించి ఆలోచిస్తూ కూర్చోవటం తప్ప నాకు మరో వ్యాపకం ఉండదు. ప్రతిక్షణం మిమ్మల్ని గురించే ఆలోచిస్తూ కూర్చోవటం వలన, మీరు ఒక గంట ఆలస్యంగా ఇంటికి వచ్చినా, నాకు ఎన్నో యుగాలు అయినట్టుగా ఉంటుంది."

"వాణీ! చాలారాత్రి గడిచిపోయింది. నిద్రపో." అన్నాడు రాజేష్. అతను వాణితో మాట్లాడుతున్నా అతని మనస్సు లలితను గురించే ఆలోచిస్తుంది. నన్ను గురించి ఆలోచించుకుంటూ, వంటరిగా నిద్రపట్టక ఏడుస్తూం టుంది పాపం. నా కోసం లలిత నాదానిగానే మిగిలిఉంది. నేను వాణి కౌగిలిలో ఉన్నాను. లలితకు ఎంత అన్యాయం చేస్తున్నాను. నన్నీస్థితిలో లలిత చూస్తే లలిత గుండె బ్రద్దలయి పోతుంది. లలిత న కోసం అంతగా తపించి పోతుంటే, నేను వాణితో శారీరక సుఖాలు అనుభవించటం న్యాయమేనా? అలా అని శారీరకంగా వాణికి దూరంగా ఉంటే, వాణి ఎలా అపార్థం చేసుకుంటుందో అన్నలే అనుమానపు మనిషి. నేనెవరితోనో శారీరక అవసరాలు తీర్చుకుంటున్నాను అనుకుంటుంది. భగవంతుడా! కళ్ళు మూసినా, కళ్ళు తెరచినా లలత రూపమే కనపిస్తుంటే. వాణితో

ఎలా కాపురం చెయ్యను వాణి గుండెలకు హత్తుకున్నా నా మనస్సులో లలిత రూపమే కదలాడుతుంటే, లలితకు ఎలా అన్యాయం చెయ్యగలను! వాణికి దూరంగా ఉంటే, వాణికి మాత్రం అన్యాయం చేసినట్టు కాదా! ఇలాంటి అంతూ దరీలేని ఆలోచనలు రాజేష్ మనస్సును కందిరీగల్లా చుట్టు ముట్టాయి.

వాణి నిద్రపోయిన తర్వాత, వాణికి మెలకువ రాకుండా మంచం మీదనుంచి లేచి, తలుపులు దగ్గరగా లాగి, వరండాలో కొచ్చి అక్కడున్న సోఫాలో పడు కున్నాడు రాజేష్.

# 17

ఏమండీ! సాయంత్రం ఆఫీసు నుంచి వస్తూ లలిత దగ్గరకు వెళ్ళి, లలితను మాకింటికి తీసుకురండి." అంది వాణి ఆఫీసుకు వెళ్ళబోతున్న భర్తతో.

"ఎప్పుడూ పేషంట్సుతో బిజిగా ఉంటుంది. వస్తుందో రాదో!"

"మీరు లలిత దగ్గరకు వెళ్ళి నేను రమ్మన్నానని చెప్పండి. తప్పులి సరిగా వస్తుంది.

"నువ్వే వెళ్ళి చెప్పు. నాకు తీరదు" మనస్సులో లలిత పట్ల దాచుకున్న ప్రేమను, బయటకు కన్పించనీయకుండా, లలిత దగ్గరకు వెళ్ళటం తనకిష్టం లేనట్టుగా అన్నాడు రాజేష్.

"మీకు తెలియకుండానే, ఇప్పటికి నాలుగు సార్లు వెళ్ళాను లలిత దగ్గరకు. వెళ్ళిన ప్రతిసారి ఏదో ఒక కారణం చెబుతూ మనింటికి రాకుండానే తప్పించుకుంటుంది. నా మాట వినటం లేదనేగా, మిమ్మల్ని వెళ్ళమంటున్నాను. మీ మాట అయినా, కాదనలేక మనింటికి వస్తుందేమో అని నా ఆశ. చిన్నప్పుడు దానితో ఎంత స్నేహంగా ఉండేవాళ్ళు ఇప్పుడు దాని దగ్గరకు వెళ్ళటానికే తీరదంటున్నారు!"

"చిన్నప్పుడు అంటే, చిన్నతనం కాబట్టి కల్సి మెల్సి ఆడుకునే వాళ్ళం. ఆ వయస్సు అలాంటిది. అప్పుడేదో చనువుగా ఉండేవాళ్ళమని, ఇప్పుడు కూడా ఉంటామా!"

" మీ మగవాళ్ళంతా అంతే. పని దాటిన తర్వాత తెప్ప తగలేస్తారు. వారం రోజులు నన్ను కంటికి రెప్పలా కాపాడి నన్ను బ్రతికించింది. తన ఫీజే కాకుండా, వాడిన మందులకు కూడా మనదగ్గర డబ్బు తీసుకోలేదు. మీకు ఆ కృతజ్ఞత కూడా లేదు. దానికి మనమీదున్న అభిమానంలో, మనకు ఏదో వంతు కూడా లేదు." కోపంగా అంది వాణి.

"నీ ఉపన్యాసం అవు నేను వెళ్ళి, నీ స్నేహితురాల్ని బ్రతిమాలి నీదగ్గరకు తీసుకు రావాలి. అంతేగా!"

"బ్రతిమాల్సిం బ్రతిమాలమనటం లేదు. వెళ్ళి తీసుకు రమ్మంటున్నాను. అంతే."

"ఏమాటన్నా అర్థం ఒకటేలే. ఇక, నీ ఉపన్యాసం అయిపోయిందిగా? నన్ను వెళ్ళమంటావా!" స్కూటరు స్టార్టు చేస్తూ అన్నాడు రాజేష్.

"చెప్పటం మరిచిపోయాను. వచ్చేటప్పుడు, పళ్ళు పూలు తీసుకురండి. విరజాజులంటే, లలితకు ప్రాణం. విరజాజులు ఎక్కువ తీసుకురండి. స్వీట్సవీ నేనే ఇంట్లో తయారు చేస్తాను." వాణి చెబుతుండగానే, స్కూటరు స్టార్టు చేసుకుని వెళ్ళిపోయాడు రాజేష్.

# 18

"వాణినిన్ను తీసుకురమ్మంది." ఎలాంటి ఉపోద్ఘాతం లేకుండా, లలిత దగ్గరకు వచ్చి చెప్పాడు రాజేష్.

"ఎందుకు!" నవ్వుతూ అడిగింది లలిత.

"వాణికి, నీ మీద అభిమానం పెరిగినట్టుంది. నువ్వు తనకు ట్రీట్‌మెంట్ ఇచ్చి ఫీజు తీసుకోలేదుగా!" హాస్యంగా నవ్వుతూ అన్నాడు రాజేష్.

"మీరు మరీ వేళాకోళంగా మాట్లాడతారు. మేమిద్దరం చిన్ననాటి స్నేహితులం కదా! ఒకరిమీద ఒకరికి అభిమానం లేకుండా ఎలా ఉంటుంది.!" రాని నవ్వు నవ్వుతూ అంది లలిత.

సూటిగా లలిత కళ్ళలోకి చూస్తూ "లలితా! ఈ మాట నీ మనస్సులోంచే వచ్చిందా!" అన్నాడు రాజేష్.

పట్టు బడిన దొంగలా తలవంచుకుంది లలిత.

"నీ మనస్సు నాకు తెలుస్. నువ్వు మా యింటికి ఎందుకు రాలేక పోతున్నావో కూడా తెలుస్. అందుకే, నేనుగా నిన్ను మా యింటికి రమ్మనలేదు. ఈరోజు అయినా వాణీ బలవంతం మూలంగా నిన్ను మా ఇంటికి రమ్మంటున్నాను."

"ఏం? నేను మీ యింటికి రావటం, మీకిష్టంలేదా?"

"ఇష్టమో, కాదో నీ మనస్సునడుగు. సమాధానం చెబుతుంది."

"మాటల్లో మిమ్మల్ని గెలవటం చాలా కష్టం." అంది లలిత నవ్వుతూ.

"లలితా! నిన్ను మా యింటికి పిలిచి, నీ మనస్సులోని బాధను మరింత అధికం చెయ్యటం కంటే, నిన్ను మా ఇంటికి ఆహ్వానించకుండా ఉండటమే మంచిది."

"అలా ఎందుకనుకోవాలి?"

"నీ మనస్సు నాకు తెల్సు కాబట్టి."

"మీరుగా, మీ ఇంటికి రమ్మని ఆహ్వానించిన రోజునే వస్తాను." లలిత అంది నవ్వుతూ.

"నీ కోసం స్వీట్సు తయారు చేస్తుంది వాణి. ఇవ్వాడు నువ్వు రాకపోతే, నేనిక్కడకు రాలేదని గొడవ చేస్తుంది. ఆ గొడవ భరించటం కష్టం. త్వరగా తయారవు వెళదాం."

రాజేష్ కళ్ళలోకి చూచిన లలిత. ఇంకేం అనలేక పోయింది. "అయిదు నిముషాలలో తయారయి వస్తాను. కూర్చోండి." అంటూ లేసి లోపలకు వెళ్ళింది."

"వెళదామా!" అంటూ బయటకు వచ్చిన లలితను చూసి కనురెప్ప వేయటం మర్చిపోయాడు రాజేష్. ఎరుపు రంగు బెనారస్ పట్టుచీర, అదే కలర్ జాకెట్ వేసుకుని, జుట్టంతా పైకి దువ్వి ముడి చుట్టుకుని, ఒక వక్కగా ఎర్ర గులాబీ పూవు తురుముకుంది. నుదుట దిద్దుకున్న సింధూరం చీర రంగుతో పోటీ పడతుంది. పొరపాటున దివినుండి భువికి దిగివచ్చిన దేవకాంతలా లలిత కనుపిస్తుంటే లలితమీద నుంచి చూపులు మరల్చుకోవటం కష్టం అవుతుంది రాజేష్‌కు.

"ఇలా నన్ను చూస్తూనే కూర్చుండారా? బయలు దేరుతారా? లలిత అంది నవ్వుతూ.

"కారులో వస్తావా!" అతి ప్రయత్నం మీద లలిత మీదనుంచి చూపులు మరల్చుకుంటూ అన్నాడు రాజేష్.

"లేకపోతే, మీ స్కూటరుమీద కూర్చోమంటారా?" లలిత నవ్వుతూ అంది.

"నాకేం అభ్యంతరం లేదు."

"ఉండదు. ఎందుకంటే మీరు మగవారు కదా!"

"నీ మాటలు శూలాల్లా గుచ్చుకుంటున్నాయి." నవ్వుతూ అంటూ తన స్కూటరు స్టార్టు చేశాడు రాజేష్. అతని స్కూటరు వెనకే తనకారును పోనిచ్చింది. లలిత.

వీళ్ళకోసం ఎదురు చూస్తూ వరండాలోనే ఉంది వాణి.

"రా. లలితా!" ఆప్యాయంగా ఆహ్వానించింది వాణి.

ముగ్గురూ ఆరుబయట కుర్చీలలో కూర్చున్నారు,

"లలితా! నేను ఎన్నిసార్లు రమ్మని బ్రతిమాలినా మా యింటికి రాలేదు. ఆయన మాట కాదనలేక ఈ రోజు వచ్చావు. నాకు తెలుసు, నువ్వు ఆయనమాట కాదనలేవని, అందుకే, ఆయన్ని పంపించాను." వాణీ నవ్వుతూ అంది.

"నేను మీ ఇంటికి రాకపోతే, నిన్ను నా దగ్గరకు రానివ్వనని బెదిరించారు. మీవారు. ఏం చేస్తాను? నీకోసం తప్పని సరి అయింది."

"ఇప్పుడే వస్తాను." అంటూ, లలిత పిలుస్తున్నా విని పించుకోకుండా, లోపలకు వెళ్ళి ప్లేట్లు నిండుగా కోవా బిళ్ళలు, జిలేబీలు పెట్టుకుని తీసుకొచ్చి వాళ్ళ ముందున్న టీపాయ్ మీద పెట్టింది. వాణి.

"ఇప్పుడు నేనేం తినలేను. టీ మాత్రం ఇవ్వు చాలు."

"నీకోసం ప్రత్యేకంగా తయారు చేశాను. నువ్వు తినాలి. "అంటూ భర్త వైపు తిరిగి" మీరు కూడా తీసుకోండి." అంది వాణి.

"తీసుకోండి లలితగారూ లేకపోతే వాణి బాధపడుతుంది," హాస్యంగా నవ్వుతూ అన్నాడు రాజేష్.

"చిన్నప్పటినుంచీ కల్సి, మెల్సి పెరిగాం. లలితా లలితా, అంటూ ఎప్పుడూ దానివెంట పడి తిరిగేవాళ్ళు. అలాంటిది దాన్ని గారూ, అంటూ దాని పేరుకు ఒక తగిలించారేమిటి? లలితా అని పిలవండి" ప్రేమగా మందలిస్తూ అంది వాణి

"అవును. మీరేంటి నన్ను గారూ, గారూ అంటూ పిలుస్తున్నారు. అలా మన్నించి పిలవటంలో గౌరవం ఉంటుందిగానీ, అభిమానముండదు. మన చిన్ననాటి స్నేహం అభిమానం మీకింకా గుర్తుంటే, నన్ను లలితా అని పిలవండి చాలు."

"ఎలా పిలవగలను? మీరు డాక్టరు వృత్తిని బట్టి అయినా అలా గౌరవించాలి కదా?"

"కూతురు డాక్టరయినంతమాత్రాన, తల్లి కూతుర్ని కూడా డాక్టరుగారూ అని పిలుస్తుందా?"

"ఆ అనుబంధం వేరు."

"ఇది స్నేహబంధం. మీరు లలితగారూ అని పిలుస్తుంటే, పలకటానికి నాకే సిగ్గుగా ఉంది. నన్ను లలితా అని పిలవండి చాలు."

"అలాగే." అన్నాడు రాజేష్ నవ్వుతూ.

అంతలో పనిమనిషి వచ్చి ముగ్గురికీ టీ కప్పులు అం దించి వెళ్ళింది.

"ఏమండీ! మిమ్మల్ని జాజిపూలు తెమ్మని చెప్పాను తెచ్చారా?"

"మర్చిపోయాను."

"చూడు లలితా! ఈయనెప్పుడూ ఇంతే. జీతం తెచ్చి నా ముఖాన పారేయటం తప్ప, ఇంటి విషయాలే పట్టించుకోరు. నీకిష్టం కదా అని ఆఫీసునుంచి వస్తూ జాజిపూలు తెమ్మని. తీసుకురాలేదు."

"ఆఫీసుపనుల్లో, నువ్వు చెప్పిన విషయం మర్చిపోయుంటారు." అంది లలిత నవ్వుతూ.

"ఎప్పుడూ ఇంతే మర్చిపోవటం కాదు. నిర్లక్ష్యం."

"ఇంటిముందు ఇన్నిరకాల పూలున్నాయి కదా కోసుకుని పెట్టుకోరాదూ? లేని పూలకోసం గొడవ చెయ్యకపోతే."

"చూడు లలితా! ఆయన ధోరణి. చెప్పినపని చెయ్యకపోగా ఎలా కసుక్కుంటారో. ఒక్కమాట రెండుసార్లు అడిగితే చాలు, ఎంతకోపమో ఈయనకు. మా ట్లాడలంటేనే ఈయనతో భయం అవుతుంది ఈమధ్య."

"ఉదయం నుంచి, ఇప్పటివరకూ పేమెంట్సుతోనే సరిపోయింది. లలితకు, ఏ గొడవతో విసిగించకు స్నేహితురాలు కనిపించగానే నన్ను గురించి పీకరవు పెడుతున్నావు."

"ఇంతకాలం మనస్సులో బాధను చెప్పుకోవటానికి కూడా ఎవరూ లేక నాలో నేనే బాధపడ్డాను. మనస్సు విప్పి చెప్పుకోవటానికి ఇన్నిరోజుల తర్వాత స్నేహితురాలు కలిసిందన్న సంతోషంతో నా గొడవ చెప్పుకుంటూ నిన్ను విసిగించాను లలితా."

"ఆయన మాటలన్నీ పట్టించుకోకు వాణీ."

"ఆయనే నా గొడవను పట్టించుకోవటం మానేసారు. మా గొడవలు ఎప్పుడూ ఉన్నవే గానీ లలితా! ఈ పూట మా ఇంట్లో భోంచెయ్యాలి నువ్వు."

"మరోసారి తప్పకుండా భోంచేస్తాను."

"ఏం? ఇప్పుడు భోంచెయ్యకూడదా? లలితా నీకోసం నీకిష్టమయిన వంటకాలన్నీ చేస్తాను."

"వంటమామ్మగారు నాకోసం భోంచెయ్యకుండా ఎదురు చూస్తుంటుంది."

"లలితా! మీ వంటమామ్మగారికి ఇచ్చిన విలువ కూడా స్నేహితురాలిగా నాకివ్వలేకపోయావు. నువ్వెళ్ళక పోతే, ఆవిడ బాధపడుతుంది. నువ్వు భోంచెయ్యకుండా వెళితే నేను బాధపడనా?" నిష్ఠూరంగా అంది వాణి.

"సారీ. నువ్విలా అర్థం చేసుకుంటావనుకోలేదు. సరే. భోంచేసే వెళతాను."

"మీరిద్దరూ మాట్లాడుతుండండి. నేను బయటకు వెళ్ళి పది నిముషాలలో వస్తాను."

"ఎక్కడకు వెళుతున్నారు?"

"ఆ ప్రశ్న నన్ను అడగొద్దని ఇప్పటికి నీకు వంద సార్లు చెప్పాను." అంటూ లేచిపోయాడు రాజేష్.

వాణిముఖం చిన్నబోయింది. అది గమనించిన లలిత "మీవారి సంగతి నీకు తెల్సు కదా? తెలిసే ఆయన్ని ఆ ప్రశ్న అడగటం ఎందుకు? ఆయనే అన్నారనీ బాధపడటం ఎందుకు? అనునయంగా అంది లలిత. ఆ అనునయానికి కరిగి పోయిన వాణికి కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి.

"నేను మాట్లాడితే చాలు ఆయన ఎంత కటువుగా మాట్లాడతారో నీకు తెలియదు లలితా. పెళ్ళికాకముందే నయం. ఎంతో ప్రేమగా మాట్లాడేవారు. పెళ్ళి అయిన దగ్గర్నుంచీ ఇంతే ఇంట్లో ఉన్నంతసేపూ, ఎంతో అవసరం అయితే తప్ప మాట్లాడరు. ఒక ముద్దూ, ముచ్చటా ఏమీ ఉండదు. మల్లెపూలు తీసుకురండి అని ఎంతగానో చెబుతాను! ఎంత చెప్పినా అంతే. చెప్పినందుకు అయినా ఒక్క రోజుకూడా తీసుకురారు. పగలంతా ఆయన కోసం ఎదురు చూస్తూ కూర్చుంటానా? ఆఫీసు అవ్వగానే ఇంటికి రారు. తిరిగి, తిరిగి ఏ అర్ధరాత్రికో ఇంటికి చేరుకుంటారు. ఎందు కాలస్యం అయిందని అడిగితే కసురుకుంటారు."

"పెళ్ళి అయిందగ్గర్నుంచీ ఇంతే. ఆయన ప్రేమగా మాట్లాడతారేమో అని ఎంతో ఆశగా ఎదురు చూస్తాను

రోజూ. ఏరోజుకారోజు ఇంతే. స్నేహితురాలిగా, నీకు చెప్ప గూడని విషయాలు కూడా చెబుతున్నాను. బెడ్‌రూములో కూడా అంతే ఆయనగా నా మంచం దగ్గరకు ఎప్పుడూ రారు. ఆయనకు దూరంగా నాకు నిద్రపట్టదు. నేనే వెళ తాను. అప్పుడు మాత్రం కాస్త ప్రేమగా మాట్లాడతారు. అవసరం తీరింతర్వాత మళ్ళీ మామూలే."

"భర్తల్ని అనురాగంతో దగ్గర చేర్చుకోవాలిగానీ అహంకారంతో దూరం చేసుకోకూడదు."

"ఆయనకు ఎంతో అనుకూలంగా ఉంటాను. ఆయన మాటకు ఎదురుకూడా చెప్పను."

"మరెందుకలా ఉంటారు!"

"అదే నాకూ తెలియదు లలితా. పోనీ, ఆయన మన స్సులో ఇంకెవరయినా ఉన్నారా అనుకుంటే అదీలేదు. నన్నుతప్ప మరో ఆడదానివైపు కన్నెత్తికూడా చూడరు."

"అంత నమ్మకం ఉందా మీవారి మీద! అడిగింది లలిత నవ్వుతూ.

"ఈ విషయంలో మాత్రం ఆయనమీద నాకు పూర్తి నమ్మకం. మేము హైదరాబాదులో ఉండేటప్పుడు, మా ఇల్లుగల వాళ్ళమ్మాయి ఆయన్ని ఎంత అభిమానించేది."

"ఆ అమ్మాయి నాకంటే వెయ్యిరెట్లు అందంగా ఉం టుంది. ఒకరోజు, నేను దేవాలయానికి వెళితే ఆయన దగ్గ

రకూ వచ్చి నా దగ్గర లక్షరూపాయల విలువచేసే నగలున్నాయి. అవి తీసుకుని పారిపోదాం. అని అడిగితే, ఈయన ఒప్పుకోలేదు. చివరకు ఒక్క సారి నన్ను మీ దానిగా చేసుకోండి. అని ప్రాధేయపడినా ఒప్పుకోకుండా అది తప్పు అని చెప్పి పంపించారు."

"ఆయన మీద నీకెంత నమ్మకం ఉంది కదా! మరెందుకలా విసిగిస్తావు? ఏదో పనుండి ఇంటికి రావటం ఆలశ్యం కావచ్చు. అది నువ్వు అర్థం చేసుకుని, మౌనంగా ఉంటే సరిపోతుంది కదా!"

"రోజూ ఆలశ్యంగానే వస్తాడు. ఎన్ని రోజులని సరి పెట్టుకోను?"

"కొంతమంది మగవాళ్ళకు స్నేహితులతో గడపటం సరదా. ఇంకొంతమంది మగవాళ్ళకు బజార్లమ్మట తిరటం సరదా."

వీళ్ళిద్దరూ మాట్లాడుకుంటూ ఉండగానే రాజేష్ వచ్చాడు.

"గంటనేపటి నుంచి ఇక్కడే కూర్చుని ఉన్నారా!" అడిగాడు రాజేష్ నవ్వుతూ.

"మాట్లాడుకుంటూ కూర్చున్నాం." అంది లలిత నవ్వుతూ.

ఎనిమిదిగంటల వరకూ కబుర్లు చెప్పుకుంటూ అక్కడే కూర్చున్నారు ముగ్గురూ.

"లలితా! భోంచేద్దాం రా." అంటూ లేచింది వాణి. వంటమనిషి అన్నీ డైనింగ్ టేబుల్ మీద సర్ది పెట్టింది. ముగ్గురూ భోజనాలకు కూర్చున్నారు. రాజేష్‌కు ఆనుకున్నట్టుగా కూర్చున్న వాణిని చూడగానే, లలిత మనస్సులో అగ్నిజ్వాలలు రేగాయి. వాణి, రాజేష్‌కు అంత దగ్గరగా కూర్చోవటం సహించలేకపోతోంది. తన మనస్సులో భావాలను ముఖంలో కన్పించనీయకుండా జాగ్రత్త వహిస్తూ కంచంలో అన్నాన్ని కెలుకుతూ కూర్చుంది.

రాజేష్ లలితను గమనిస్తూనే ఉన్నాడు. వాణికి దూరంగా జరిగి కూర్చున్నాడు. లలిత బాధను గమనిస్తూ రాజేష్ సరిగా భోజనం చెయ్యలేక కంచంలో చెయ్యి కడిగేసుకుని లేచాడు. ఎలాగో భోజనం అయిందనిపించి లలిత కూడా లేచింది.

"ఇక వెళతా వాణీ."

"అప్పుడేనా? ఎవరింటికయినా భోజనానికి వెళ్ళినా, దేవలయానికి వెళ్ళినా వెంటనే వెళ్ళిపోకూడదు. కొద్దిసేపు కూర్చుని వెళ్ళాలి."

"నీకు కూడా ఇలాంటి సెంటిమెంట్స్ ఉన్నాయా వాణీ."

"అనుమానాలు, సెంటిమెంట్స్ ముందుపుట్టి ఆ తరువాత పుట్టింది వాణి." హాస్యంగా నవ్వుతూ అన్నాడు రాజేష్.

"హాస్పటల్‌లో పనుంది వాణీ. వెళతాను." అంటూ కారు దగ్గరకు వెళ్ళి స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయింది లలిత.

# 19

ప్రేషెంట్సును చూడటం పూర్తి అయింది. ఏదో పుస్తకం చదువుతూ కూర్చుంది లలిత.

"డాక్టరుగారూ! మీకోసం లాయరు మాధవరావుగారొచ్చారు. బయట ఉన్నారు. రమ్మంటారా?" అంటూ వచ్చింది నర్సు.

"రమ్మను." చదువుతున్న పుస్తకం మూసి టేబులు మీద పెడుతూ అంది లలిత.

"రండి. కూర్చోండి. లాయరుగారికి, మాతో అవసరం వచ్చిందేమిటి?" నవ్వుతూ అంటూ ఆహ్వానించింది లలిత.

"ఏమ్మా! లాయర్లు మనుష్యులు కాదా? వాళ్ళకు రోగాలు రావా?" లలిత ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుంటూ అన్నారు మాధవరావుగారు.

"ఏమిటండీ! విశేషాలు? ఈ మధ్య ఎక్కడా కనుపించటంలేదేం?"

"మా లాయర్లకు విశేషాలేముంటాయమ్మా లలితా! ఇప్పుడు నేను తలెత్తుకుని తిరగలేని పరిస్థితుల్లో ఉన్నాను. నువ్వే ఒకదారి చూపించాలి." లలిత చేతులు పట్టుకుని ప్రాధేయపడుతూ అన్నారు మాధవరావుగారు.

మాధవరావుగారు సిటీలో పేరు మోసిన లాయరు. కొన్నిలక్షలు ఆర్జించారు. రాజకీయాలలో కూడా ప్రవేశం ఉంది. లలిత నాన్నగార్కి, మాధవరావుగార్కీ రాజకీయాల ద్వారానే పరిచయం అయింది.

లలిత విజయవాడలో ప్రాక్టీసు పెట్టిన దగ్గర్నుంచి లలితకు పెద్ద దిక్కుగా ఉంటున్నారు మాధవరావుగారు. ఆయనకు వచ్చిన కష్టం ఏమిటో లలితకు ఎంత ఆలోచించినా అర్థం కాలేదు.

“అమ్మా! లలితా. నాకు ఒక్కతే కూతురు. స్వప్న నీకు తెలుసుగా? నాలుగు లక్షల రూపాయల కట్నంతో, స్వప్నకు జమీందారీ సంబంధాన్ని మాట్లాడాను. అబ్బాయి ఇంజనీరుగా పని చేస్తున్నాడు. స్వప్నకు ఈడూ, జోడూగా ఉంటాడు. ఒక్కగా నొక్క కూతురని దానిమీద ఎన్నో ఆశలు పెంచుకున్నాను. అదెంత పని చేసిందో చూడమ్మా.”

“ఏం చేసిందండీ?”

“తన క్లాస్‌మేట్‌ను ప్రేమించిందంట. అతనిది మన కులం కాదు. మన మతం కాదు. క్రిస్టియన్ పేరు జాన్. అతన్ని తప్ప నేనెవర్నీ పెళ్ళి చేసుకోను. అని మొండికేసి కూర్చుంది, నా నోటితో చెప్పలేనమ్మా. పెళ్ళి కాకుండానే తల్లి కాబోతుంది. ఈ విషయం తెలిసిన దగ్గర్నుంచీ, వాళ్ళమ్మ దిగులుతో మంచం ఎక్కింది. ఎవ్వళ్ళకూ చెప్పుకోటం లేదు. నువ్వెలాగయినా దానికి నచ్చజెప్పి,

ఆ పాపాన్ని కడిగేస్తావని నీ దగ్గరకు తీసుకువచ్చాను. ఎలాగయినా, దానికి నచ్చజెప్పి, నా పరువు ప్రతిష్టలను కాపాడమ్మా. నువ్వు తప్ప, ఈ సమయంలో నన్ను ఆదుకునే వాళ్ళు ఎవరూ లేరు." కన్నీటితో ప్రాధేయపూర్వకంగా అన్నారు మాధవరావుగారు.

లలిత డాక్టరయిం తర్వాత, ఇంత వరకూ ఒక్క ఎబార్షను కూడా చెయ్యలేదు. అలా చెయ్యటం లలితకిష్టం ఉండదు. కానీ తండ్రి లాంటి మాధవరావుగారు కన్నీటితో ప్రాధేయపడుతుంటే కాదనలేక పోయింది.

"స్వప్న ఎక్కడుంది?"

"కారులో ఉంది. స్వప్న విషయం ముందుగా నీకు చెబుదామని వచ్చాను."

"స్వప్నను నా దగ్గర వదిలేసి, మీరెళ్ళిపొండి. నేను ఎలాగయినా స్వప్నకు నచ్చజెప్పి, ఎబార్షను చేస్తాను."

"అలాగేనమ్మా. స్వప్నను పంపించి నేను వెళతాను." అంటూ గదిలో నుంచి బయటకు వెళ్ళారు మాధవరావుగారు.

ఆయన వెళ్ళిం తర్వాత, కారు స్టార్టు అయిన శబ్దం వినిపించి ఆయన వెళ్ళిపోయారు కాబోలు అనుకుంది లలిత.

"మే. ఐ. కమిన్. డాక్టర్." అంది స్వప్న గుమ్మం దగ్గర నిలబడి.

"రా. స్వప్నా. రా కూర్చో."

"డాక్టర్. మీ నాన్నగారు నా విషయం అంతా, మీకు చెప్పారనుకుంటాను." అన్నది స్వప్న లలిత స్వప్న ముఖంలోకి చూసింది. పెళ్ళి కాకుండానే తల్లినవుతున్నా నన్న భయం స్వప్న ముఖంలో కన్పించలేదు. తల్లినవు తున్నానని గర్వపడు తున్నట్టుగా కనుపించింది స్వప్న.

"స్వప్నా! అరిటాకు, ముల్లు సామెత నీకు తెల్సు కదా? పెళ్ళి కాకుండానే ఇలాంటి పనులు చెయ్యటం తప్పుకదూ?"

"నేనేం తప్పు చెయ్యలేదు డాక్టర్"

"పెళ్ళి కాకుండానే, తల్లివి కాబోవటం తప్పుకాదా? నిన్ను గురించి ఆలోచించటానికి, మీ అమ్మా నాన్నగారుండగా, నీ కులంగాని, నీ మతంగాని మరో అబ్బాయితో ప్రేమ పేరుతో కల్సి తిరగటం తప్పుకాదా? నిన్ను కని, పెంచి నీ మీదే ఆశలు పెంచుకుని బ్రతుకుతున్న నీ తల్లిదండ్రుల మాటను కాదని, వాళ్ళను బాధ పెట్టడం తప్పు కాదా?"

"నా దృష్టిలో, మీరు చెప్పేది ఏదీ తప్పుకాదు."

"స్వప్నా,"

"ఆశ్చర్యపోతున్నారా డాక్టర్? ప్రేమించటం తప్పు కాదు. ప్రేమించిన వాడిని పెళ్ళిచేసుకోవాలను కోవటం పాపం కాదు. ఇక పోతే, కులంగాని అబ్బాయిని ప్రేమించ టం తప్పు అని మీరనుకుంటున్నారు. ప్రేమకు, కులం,

మత అనే పేడాలుండవని, మీకు తెల్సు. ప్రేమించిన వాడితో, తిరగక బయట వాళ్ళతో ఎలా తిరగగలను? నేను ప్రేమించిన జాన్‌తో కల్సి నేను తిరుగుతున్నాను, ఇద్దరికీ మనస్సులు కలిసాయి. కాబట్టి, నిగ్రహాన్ని కోల్పోయిన మేమిద్దరం ఒకటయ్యాము. అందుకు ఫలితంగా నేను తల్లిన య్యాను. నేను జాన్‌ను ప్రేమించానని, అతన్ని తప్ప మరో వ్యక్తిని భర్తగా ఊహించలేనని నేను ప్రేమించిన జాన్‌తో నా పెళ్ళి జరిపించమని, మా నాన్నగారికి ఎంతో ప్రాధేయ పడ్డాను. ఆస్థి, అంతస్తులేని జాన్‌ను నేను పెళ్ళి చేసుకుంటే, ఆయన పరువు ప్రతిష్టలకు భంగం కలుగుతుందని అయన ఒప్పుకో లేదు. నా సుఖం కంటే పరువు ప్రతిష్టలే ముఖ్యం అని నాన్నగారు అనుకుంటున్నప్పుడు, ఆయన్ని గురించి నే నెందుకు ఆలోచించాలి మీరు చెప్పండి డాక్టర్. నేనేం తప్పు చేశాను?"

బెల్ బాటమ్ ఫ్యాంట్, షర్టుతో నిండుగా ఇరవయ్యే సంవత్సరాల వయస్సులేని స్వప్న, జీవితాన్ని అంతలోతుగా ఆలోచించి మాట్లాడుతుంటే ఆశ్చర్య పోయింది లలిత.

ముఖంలో పసితనపు ఛాయలు పూర్తిగా తొలగిపోని స్వప్న ప్రేమను గురించి అంత గర్వంగా చెబుతుంటే, స్వప్నకు ఎబార్షను చేయించుకోమని ఎలా నచ్చచెప్పాలో అర్థంకాలేదు. లలితకు.

"ఏమిటి డాక్టర్ ఆలోచిస్తున్నారు? నా ప్రశ్నకు సమాధానం చెప్పరే?"

"ఏమని చెప్పాలో నాకర్థం కావటంలేదు స్వప్న."

"మీరు చెప్పలేరు డాక్టర్. నాకు తెలుసు. ఎందుకో చెప్పనా? మీకు ప్రేమంటే తెలియదు."

ఆ మాట ముల్లులా గుచ్చుకుంది లలిత మనస్సుకు. ఆ బాధ కేనేమో అన్నట్టుగా లలిత కళ్ళు నీళ్ళతో నిండాయి.

"డాక్టర్, నన్ను ఎబార్షనకు ఒప్పించమని మా నాన్నగారు మీ దగ్గర ప్రాధేయపడ్డారు కదూ?"

"స్వప్నా! ఈ పరిస్థితులలో అంతకంటే మార్గం లేదమ్మా. మీ నాన్నగారు పరువు ప్రతిష్టలను గురించి ఆలోచించకపోయినా, నిన్ను గురించి నువ్వు ఆలోచించుకో. పెళ్ళికాకుండానే తల్లివి అయితే, నలుగురూ ఏమనుకుంటారు? ఇనుప ముక్కు కాకుల్లా శూలాల్లాంటి మాటలతో పొడిచి, పొడిచి చంపుతారు. నువ్వేదో చేయరాని తప్పు చేసినట్టుగా నలుగురూ నిన్ను వేలెత్తి చూపుతారు. నా మాట విని, ముందు ఎబార్షను చేయించుకోమ్మా. ఆ తర్వాత మీ నాన్నగార్ని ఒప్పించి, నువ్వు ప్రేమించిన జాన్‌నే పెళ్ళి చేసుకుందువుగాని." నచ్చజెబుతున్న ధోరణిలో అంది లలిత.

"డాక్టర్. నలుగురిని గురించి ఆలోచించాల్సిన అవసరం నాకు లేదు. నేను మనసారా ప్రేమించిన జాన్ ప్రతిరూపం, నాలో రూపాలు దిద్దుకుంటుంది. అటువంటి మా ప్రేమ ఫలాన్ని, ఎవరో ఏవో అనుకుంటారని చంపుకునేట్లం

అంతటి స్వార్థపరురాలిని కాదు నేను. తల్లిని కాబోతున్నానని గర్వపడుతున్నాను గానీ, నలుగురూ ఏమనుకుంటారో అని నేను భయపడటం లేదు. డాక్టర్ పిరికివాళ్ళు ప్రేమకు అర్హులు కాదు. ఇలాంటి విషయాలు ఆలోచించాల్సింది ప్రేమకు ముందు తల్లిని కాబోతున్న ఈ సమయంలో కాదు."

"నువ్వు ఎబార్షను చేయించుకోను అంటావు అంతేనా?"

"మీరంటే నాకు చాలా గౌరవం ఉంది మీ మాటను కాదంటున్నందుకు నన్ను క్షమించండి. ఇప్పుడు నేను ఎబార్షను చేయించుకుంటే, నేను ప్రేమించిన జాన్‌ను పెళ్ళి చేసుకునే అవకాశాన్ని కోల్పోతాను. మా పెళ్ళికి మా నాన్నగార్ని వప్పించటానికి నాకున్న ఆయుధం ఇదొక్కటే. ఎబార్షను జరిగితే, మా నాన్నగారు నా కాళ్ళు చేతులు కట్టేసైనా, ఆయన అంతస్తుకు తగిన వ్యక్తితో నా పెళ్ళి జరిపిస్తారు. ఎబార్షను చేయించుకోకుండా ఉంటే, ఇంకో రెండునెలలు పోయింతర్వాతయినా గత్యంతరంలేక మా పెళ్ళికి వప్పుకుంటారు. మీరయినా నా బాధను అర్థం చేసుకోండి డాక్టర్. ఈ ఆస్థి అంతస్తులు, పరువు ప్రతిష్టలూ నాకేవీ అక్కరలేదు. వీటికోసం నేను జాన్‌ను వదులుకోలేను. జాన్ కోసం వీటన్నిటితో బాటు, అమ్మా నాన్నగార్ని కూడా వదులుకోగలను. మీరయినా, మా నాన్నగార్కి నచ్చచెప్పండి డాక్టర్. ఆయన్నెలాగయినా మా పెళ్ళికి వప్పించండి. మీ మేలు ఈ జన్మలో మరిచి

పోలేదు. ఆయన మా పెళ్ళికి అంగీకరించినా, అంగీకరించక పోయినా మేమిద్దరం పెళ్ళి చేసుకుంటాం." మొండిగా అంది స్వప్న.

తనకంటే చిన్నదయినా స్వప్న వ్యక్తిత్వానికీ ఆమె మనోధైర్యానికి, స్వప్నను అభినందించకుండా ఉండలేక పోయింది.

"స్వప్నా! నువ్వన్నది నిజమేనమ్మా. నాకు ప్రేమంటే ఏమిటో తెలియదు. పిరికివాళ్ళు ప్రేమించటానికి అర్హులు కాదు. నువ్వు చెయ్యమన్నా నీకు నేను ఎబార్షను చెయ్యను. మీరిద్దరికీ పెళ్ళి జరిపించమని మీ నాన్నగార్కి నచ్చచెబుతాను. ఆయన అంగీకరించకపోతే, మీ ఇద్దరికీ నేను దగ్గరుండి పెళ్ళి జరిపిస్తాను."

"నిజంగానా డాక్టర్?" నమ్మలేనట్టుగా అడిగింది స్వప్న.

"నిజమమ్మా. సాయంత్రం జాన్‌గార్ని ఒకసారి నా దగ్గరకు తీసుకురా."

"అలాగే డాక్టర్. మీకెలా కృతజ్ఞతలు చెప్పాలో కూడా నాకర్థం కావటంలేదు." పట్టలేనంత సంతోషంతో స్వప్న కుర్చీలోంచి లేచి లలిత చేతులు పట్టుకుంటూ అంది.

"ఇక నువ్వు ప్రశాంతంగా ఉండు." అంది లలిత నవ్వుతూ.

"ఇక వెళతాను డాక్టర్. ఈ సంతోషవార్త జాన్‌కు చెప్పాలి."

"మంచిదమ్మా." నిండు మనస్సుతో అంది లలిత.

స్వప్న వెళ్ళిపోయినా, ఆమె మాటలే లలిత మనస్సులో మారుమోగుతున్నాయి." మీకు ప్రేమంటే తెలియదు. పిరికివాళ్ళ ప్రేమకు అర్థాలు రాదు." ఆ రెంగా మాటలూ, లలిత మనస్సులోని గతాన్ని కెలుకుతూ గాయాన్ని చేస్తున్నాయి.

భరించలేని ఆవేదనతో కుర్చీలో వెనక్కు వాలి కళ్ళు మూసుకుంది. రాజేష్ వచ్చి తన కెదురుగా కూర్చున్న విషయం కూడా లలిత గమనించలేదు.

"లలితా!" అన్న రాజేష్ పిలుపుకు ఉలికిపాటుగా కళ్ళు తెరిచింది లలిత.

"ఎంతసేపైంది మీరొచ్చి?"

"నేనొచ్చిన విషయం కూడా గమనించనంతటి పరధ్యానంగా ఉన్నావేమిటి? వంట్లో బాగలేదా?"

"వంట్లో బాగానే ఉంది."

"మరెందుకలా ఉన్నావు? కళ్ళు అంత ఎర్రగా ఉన్నాయేమిటి?"

"ఏంలేదు."

"కారణం లేకుండా ఎందుకలా ఉంటావు?"

"స్వప్న అని మా నాన్నగారి స్నేహితునికూతురు ఆ అమ్మాయి, ఒక క్రిష్టియన్ అతన్ని ప్రేమించింది. పెళ్ళి

కాకుండానే ప్రెగ్నెంట్. వాళ్ళ నాన్నగారు ఎబార్షను చేయించటానికి నా దగ్గరకు తీసుకువచ్చారు. కానీ, ఆ అమ్మాయి ప్రేమను గురించి చెప్పినమాటలు వింటుంటే, నేనెంత అమానుషంగా ప్రవర్తించానా అనిపించింది. అన్ని వదులుకు, తను ప్రేమించిన జానును చేసుకోవటానికి సిద్ధంగా ఉంది స్వప్న. ఎబార్షనకు కూడా అంగీకరించలేదు. ఆ అమ్మాయి ధైర్యం, ప్రేమించిన తనకోసం ఆ అమ్మాయి చెయ్యబోతున్న త్యాగం నా మనస్సును కదిలించాయి."

"జరిగిందాన్ని గురించి ఆలోచించకు, భవిష్యత్తును గురించి ఆలోచించు. ముందు జీవితంలోనయినా సుఖపడతావు."

"ఏమండీ! మీ బాధ, మిమ్మల్ని నమ్ముకున్న వాళ్ళు పాలిట శాపం కాకూడదు. మిమ్మల్ని గురించి మీరే ఆలోచించుకుంటున్నారు గానీ, వాణిని గురించి, మీకోసం మీ కోసం ఆమె పడుతున్న బాధను గురించీ ఒక్కసారయినా ఆలోచించారా!"

"నీకూ కూడా చెప్పిందా?"

"వాణి చెప్పిన దాంట్లో నాకేం తప్పు కనుపించలేదు"

"వాణి సంగతి నీకు తెలియదు. లలితా! నన్ను తన ప్రాణంకంటే ఎక్కువగా ప్రేమిస్తుందన్న విషయం నాకు తెలుసు. వాణి ప్రేమలో స్వార్థం ఎక్కువ. నేను నవ్వినా, సంతోషించినా, ఏం చేసినా తనతోనే పంచుకోవాలనుకుం

టుంది. తన పిచ్చి ప్రేమతో, నాకు మనశ్శాంతి లేకుండా చేస్తుంది. లలితా! నన్ను మాత్రం ఏం చెయ్యమంటావు చెప్పు? మనస్సులో నీ రూపమే మెదులుతుంటే, వాణిని ఎలా సుఖపెట్టగలను? వాణిని దగ్గరకు తీసుకోవాలనుకుంటేనే నీకు అన్యాయం చేస్తున్నట్టుగా అనిపిస్తుంది. మనస్సులో నిన్ను నిలుపుకుని, శరీరాన్ని వాణితో పంచుకోవాలంటే, మనస్సు ఎంత చిత్రహింసకు లోను అవుతుందో మాటలతో చెప్పలేను."

"గతాన్ని మరిచిపొమ్మని నాకు చెబుతారుగా? మీ రెందుకు మరిచిపోలేక పోతున్నారు?"

"ఇప్పటి కయినా నామాట విను లలితా! మనకు ముందు జీవితం చాలా ఉంది. ఒకరికి ఒకరం ఇలా దూరంగా ఉంటూ, ఎంతకాల మిలా బాధ పడదాం? నువ్వెందు కింత మొండిగా మారావు? త్యాగం పేరుతో నువ్వు నాకు దూరంగా ఉండగలిగినా నీకు దూరంగా ఉండటం నాకు సాధ్యం కావటం లేదు."

"రుచి తెలియక పోవటమే మంచిది. ఒక్కసారి రుచి తెలిస్తే, మనస్సు పదే పదే ఆ రుచిని కోరుతుంది. అందుకే మీకు దూరంగా ఉంటున్నాను."

"నీ ఆలోచనలు, నీ జీవితాన్ని నాశనం చెయ్యటానికి తప్పితే, ఇంకెందుకూ పనికి రావు."

"ఇప్పుడు నాకేం తక్కువయిందండీ? కోరిక, జీవితంలో ఒక భాగం మాత్రమే, మీరు కనుపిస్తేనే చాలు. నా

మనస్సు మయూరంలా నాట్యం చేస్తుంది. జీవితంలో మళ్ళీ మిమ్మల్ని చూడలేనేమో అని భయపడ్డాను. రోజూ, మిమ్మల్ని చూసుకో గలిగే అదృష్టానిచ్చాడు భగవంతుడు. ఈ జీవితానికి ఈ అదృష్టం చాలు."

"నీ సంగతి తెలిసి, నీకు నచ్చజెప్పాలని ప్రయత్నించటం నా మూర్ఖత్వం." అన్నాడు రాజేష్ విసుగ్గా.

"అబ్బ. ముఖం అలా పెట్టకండి. చూడలేక పోతున్నాను. ముఖంలో కాస్త చిరునవ్వు కన్పించనీయండి." హాస్యంగా నవ్వుతూ అంది లలిత.

"మాటలతో కోపాన్ని పోగడతావు. అదే నీలోని గొప్పతనం."

ఇంతలో కాన్పు కేసు రావటంతో, తప్పని సరై లలిత పేషంటును చూడటానికి వెళ్ళింది. రాజేష్ ఇంటికి వెళ్ళాడు.

# 20

రాత్రి ఎనిమిది గంటలయింది. స్వప్న, వాళ్ళ నాన్నగార్ని తీసుకుని లలిత దగ్గరకు వచ్చింది.

"పిచ్చికుదిరింది రోకలి తలకు చుట్టమన్నట్టుగా ఉంది స్వప్న వ్యవహారం. నన్ను తీసుకు రమ్మన్నావంట. ఎందు

కదమ్మా లలితా?" లలిత దగ్గరకు వస్తూనే విసుగ్గా అన్నారు మాధవరావుగారు.

లలిత స్వప్న వైపు చూసింది. నాన్నగార్ని మీ దగ్గరకు నేనే తీసుకు వచ్చాను. అన్నట్టుగా, స్వప్న చేసిన సైగను అర్థం చేసుకుని. "అవునండీ" అంది లలిత.

"చెప్పమ్మా! ఎందుకు రమ్మన్నది?" కుర్చీలో కూర్చుంటూ అడిగారు మాధవరావుగారు. స్వప్న పిట్టగోడ దగ్గరకు వెళ్ళి బయటకు చూస్తూ నిల్చుంది.

"బాబాయిగారూ! నేను మీకు చెప్పదగిన దాన్ని కాదు. మీ ప్రాక్టీసంత లేదు నా వయస్సు."

"ఈ ఉపోద్ఘాతం అంతా ఎందుకమ్మా? అసలు విషయం చెప్పు. స్వప్న నీ మాట కూడా వినలేదు. ఎబార్షనుకు ఒప్పుకోలేదు. అంతేగా?" కోపాన్ని తగ్గించుకుంటూ, సాధ్యమయినంత సౌమ్యంగా అడిగారు మాధవరావుగారు.

ఎదుటిమనిషి మనస్సును చదివినట్టుగా, ఆయన మాట్లాడుతుంటే ఆయనకు ఎలా నచ్చచెప్పాలా అని ఆలోచిస్తూ మవునంగా కూర్చుంది లలిత.

"నాకు తెలుసమ్మా. అది నాకు కూతురయినా నాకు శత్రువులా ప్రవర్తిస్తుందమ్మా. అది నా గుండెల మీద కుంపటిలా తయారయ్యింది. నేను తీసుకున్న ఏ కేసులోనూ. ఇంతవరకూ ఓటమిని పొందలేదు. నా కూతురు ముందే,

నేను వాదించలేక పోతున్నాను." అన్నారు మాధవరావుగారు ఎంతో వేదనగా.

"బాబాయిగారూ ఆవేశాన్ని తగ్గించుకుని, మీరే ప్రశాంతంగా ఆలోచించండి. స్వప్న, జాన్ ఇద్దరూ మనసారా ప్రేమించుకుంటున్నారు. ఒకరికి దూరంగా ఒకరు బ్రతకలేరు. ఆస్థి అంతస్తులను, పరువు ప్రతిష్ఠలనూ డబ్బుతో కొనుక్కోవచ్చు. వాటికోసం స్వప్న జీవితాన్ని నాశనం చెయ్యకండి. ఏ ఆస్థి అంతస్తుల కోసం, స్వప్నను జాన్‌నుంచి దూరం చెయ్యాలనుకుంటున్నారో, ఆ ఆస్థి అంతస్తులు జాన్‌నుంచి స్వప్నకు ఎటువంటి సుఖాన్నీ ఇవ్వలేవు. ప్రేమించిన జాన్‌ను మరిచిపోలేకా, ప్రేమించలేని భర్తతో కాపురం చెయ్యలేకా, జీవితం అంతా స్వప్న ఎంత నరకం అనుభవించాలో మీరే ఆలోచించండి. మీకున్నది స్వప్న ఒక్కగానొక్క కూతురు."

"ఆమె బాధపడుతుంటే మీరు చూడగలరా? జాన్‌తో తన పెళ్ళి జరిపించకపోతే, స్వప్న ఆత్మహత్య చేసుకుంటానంటుంది. మీ కూతురే, మీకు దూరం అయిన తరువాత ఈ ఆస్థి అంతస్తులను ఏంచేసుకుంటారు!" ఆఖరి అస్త్రంగా అంది లలిత.

ఆ మాటకు ఉలికిపడ్డారు మాధవరావుగారు. లలిత మాటలు, ఆయనమీద పనిచేస్తున్నాయి.

"నాన్నగారూ! మీకు చివరిసారిగా చెబుతున్నాను. జాన్‌తో నా పెళ్ళి జరిపించండి. మీరు ఒప్పుకోకుండా, వేరే

వ్యక్తితో నా పెళ్ళి జరిపించాలని ప్రయత్నిస్తే, నేను తప్ప కుండా జాన్‌తో మీకు దూరంగా పారిపోతాను. మీ కూతురు లేచిపోయిందని అప్పుడు మాత్రం నలుగురూ అను కుంటుంటే, మీ పరువుకు భంగం కాదా! నన్ను పారి పొమ్మంటారో, లేక మీరే నా పెళ్ళి జరిపిస్తారో మీరే ఆలోచించుకోండి." వాళ్ళ నాన్నగారి దగ్గరకు వచ్చి అంది స్వప్న కోపంగా.

"సరేనమ్మా లలితా! అది కోరుకున్న వాడితో, దాని పెళ్ళి జరిపిస్తానని చెప్పమ్మా." అంటూ వాళ్ళకెదు రుగా కూర్చోలేక, లేచి మేడదిగి వెళ్ళారు. ఆయన వెళ్ళిపోయి నట్టుగా కారు స్టార్టు అయిన శబ్దం వినిపించింది.

"స్వప్నా! అనుకున్నది సాధించావు. కంగ్రాచ్యులే షన్సు" మనసారా నవ్వుతూ అంది లలిత.

"అంతా మీ చలువే డాక్టర్."

"నాదేముందమ్మా స్వప్నా! నీలాంటి తెగింపు ధైర్యం ఉన్నవాళ్ళే ప్రేమకు అర్హులు. పిరికివాళ్ళు ప్రేమకు అర్హులు కాదమ్మా."

"ప్రేమించిన వాడు దూరం అయితర్వాత, ఈ ఆస్థి అంతస్తులు ఎందుకు డాక్టర్! నాకు ఇవేవీ ఇవ్వలేని ఆనందాన్ని తృప్తినీ జాన్ ఇవ్వగలడు. అతను ఎదురుగా ఉంటే చాలు. నాకీ ప్రపంచంలో ఇంకేం అక్కర లేదు. జాన్ సమక్షంలో, నాకేం గుర్తు రాదు."

"అదృష్టవంతురాలివమ్మా"

"డాక్టర్ ఇక వెళతాను. నాన్నగారికి నా మీద చాలా కోపంగా ఉంది. కోపంలో నా ఎమర్జెన్సీ మరిచిపోయి కారేసుకుని వెళ్ళిపోయారు."

"నా కారులో వెళ్ళమ్మా."

"సరే డాక్టర్. నేనింటికెళ్ళి, మా డ్రైవరుతో మీ కారు పంపిస్తాను."

"అలాగేనమ్మా." అంది లలిత. స్వప్న లలిత కారు తీసుకుని వెళ్ళిపోయింది.

# 21

కాలగర్భంలో మరో ఆరునెలలు గడిచిపోయాయి. వాణి ప్రవర్తనలో మార్పేంలేదు ప్రతిరోజూ ఏదో ఒక కారణంగా, రాజేష్‌తో గొడవపడుతూనే ఉంటుంది వాణి. రోజూ రాజేష్ ఇంటికి ఆలస్యంగా రావటం, వాణి బాధపడటం జరుగుతూనే ఉంది.

రోజులు గడుస్తున్న కొద్దీ వాణి ప్రవర్తనతో విసిగిపోతున్నాడు రాజేష్. వాణిమీదుండే ప్రేమ అభిమానం క్రమంగా తగ్గిపోసాగాయి రాజేష్ మనస్సులో. ఆ స్థానంలో వాణిపట్ల కోపం, విసుగూ అధి మవ్వసాగాయి.

లలితకు మాటిచ్చినట్టుగానే, రోజులో ఏదో ఒక టయములో లలిత దగ్గరకు వస్తూనే ఉన్నాడు రాజేష్.

ఇప్పుడు వాణిని గురించి భయపడటం కూడా మానే శాడు. తనిష్టం వచ్చినప్పుడు ఆఫీసునుంచి ఇంటికొస్తున్నాడు. తన కిష్టమయినంత సేపు బయటతిరిగి వస్తున్నాడు. వాణి కారణం అడిగినా చెప్పటం కూడా మానేసాడు.

భర్తలో వచ్చిన మార్పుకు తనలో తనే కుమిలిపో తుంది వాణి. ఇంటికి వచ్చిన దగ్గర్నుంచీ కోపంతో చిటు, పట లాడుతుంటే భర్తను మాట్లాడించటానికే భయపడు తుంది. రాజేష్ కూడా ఎంతో అవసరం అయితేనే తప్ప వాణితో మాట్లాడటం లేదు.

ఉదయం ఎనిమిది గంటలకు ఇంట్లోనుంచి బయటకు వెళితే, మళ్ళీ ఇంటికి తిరిగి రావటం రాజేష్ రాత్రి పది గం టలు దాటిన తర్వాతనే. అలా మార్పు లేకుండా జరిగిపోతు న్నాయి రోజులు.

## 22

ఆ రోజు లలిత పుట్టిన రోజు, ఆ ఉదయమే వాణికి ఫోన్ చేసి, ఈరోజు నా పుట్టినరోజు. సాయంత్రం పార్టీకి, మీరిద్దరూ తప్పని సరిగా రమ్మని చెప్పింది లలిత.

ఆరోజు ఆదివారం కావటం వలన, రాజేష్ కూడా ఇంటిదగ్గరే ఉన్నాడు. సాయంత్రం నాలుగు గంటలకు వాణిని తీసుకుని, లలిత దగ్గరకు వచ్చాడు రాజేష్. అయిదు గంట

లకు, ఆహ్వానితులంతా వచ్చారు. ఇంచు, మించు అందరూ జంటలగానే వచ్చారు. రక, రకాల ఖరీదయిన పట్టుచీరలు కట్టుకున్న వాళ్ళు తప్ప, సామాన్యులు ఎవరూ లేరు పార్టీకి వచ్చిన వాళ్ళలో.

అందరితో బాటు, రాజేష్‌కూడా ఆహ్వానితుల కోసం ఏర్పాటు చేసిన కుర్చీలలో కూర్చున్నాడు వాణి లోపలకు వెళ్ళింది

నీలంరంగు ధర్మవరం పట్టుచీర కట్టుకుని, మేడదిగి వస్తున్న లలిత మీదనే నిలిచాయి ఒక్కనిముషం అందరి కళ్ళు. లలిత కళ్ళు రాజేష్ కోసం వెతికాయి.

అందరితో బాటుగా కూర్చున్న రాజేష్ కనిపించగానే. లలిత మనస్సు తెలియని బాధకు గురిఅయ్యింది. తన భర్తగా, తన సంతోషంలో పాలు పంచుకోవల్సిన రాజేష్. తనకు దూరంగా నలుగురిలో ఒకరిగా కన్పించే సరికి, లలిత సంతోషం ఆవిరిలా ఇంకి పోయింది.

మౌనంగా టేబులు దగ్గరకు వచ్చి కేక కట్ చేసింది. పార్టీ మొదలయింది, సర్వర్స్ ఎవరికి కావలసిన వాటిని, వాళ్ళకు అందిస్తున్నారు.

పార్టీకి వచ్చిన వాళ్ళంతా తెచ్చిన ప్రజంటేషన్స్, టేబులు మీద గుట్టగా పడుతున్నాయి. వాణి లలిత కోసం పట్టుచీర తీసుకొచ్చింది. నలుగురికోసం నవ్వుతూ, నలుగురి మధ్యా తిరుగుతున్నా లలితమనస్సు మాత్రం రాజేష్ చుట్టూనే తిరుగుతుంది.

పార్టీ పూర్తి అయి, ఆహ్వానితులంతా వెళ్ళి పోయే సరికి, రాత్రి తొమ్మిది గంటలయింది. వాణి, రాజేష్ మాత్రం మిగిలారు. రాజేష్ కూడా వెళతానని లేచాడు.

"మీరిద్దరూ కూడా, అందరితో పాటు వెళిపోతారా? నాతో పాటు భోంచేసి వెళ్ళండి" అంది బాధాపూర్వకంగా లలిత.

"నాకు ఆఫీసులో పనుంది. నేను వెంటనే వెళ్ళాలి." తొందర చేస్తూ అన్నాడు రాజేష్.

"ఈరోజు లలిత పుట్టినరోజు. ఈ రోజు దాని మనస్సు బాధ పెట్టకూడదండీ మీ ఆఫీసు పని రోజూ ఉండేదేగా? భోంచేసి వెళదామండీ." వాణి అంది.

"చెప్పానా? నాకు ఆఫీసులో పనుంది. నేను వెంటనే వెళ్ళాలని. ఇక బయలుదేరు. స్కూటరుమీద నిన్ను ఇంటి దగ్గర దింపి, నేను ఆఫీసుకెళతాను."

కోపంగా ఉన్న భర్త ముఖం చూసి, ఇంకేం మాట్లాడలేక పోయింది వాణి.

"పోనీ, మీరు ఆఫీసుకెళ్ళండి. వాణి ఇక్కడుంటుంది. మీకు ఆఫీసులో పని అయిపోయింతర్వాత, ఇంటికెళ్ళే టప్పుడు, ఇక్కడకు వచ్చి వాణిని తీసుకెళ్ళండి."

"మళ్ళీ, రాత్రప్పుడు ఇంతదూరం రావటం ఎందుకు? ఒకేసారి వాణిని ఇంటిదగ్గరదింపి, నేను వెళతాను." అంటూనే, లలితకు మాట్లాడేందుకు అవకాశం ఇవ్వకుండా, స్కూటరు స్టార్ట్ చేశాడు రాజేష్.

"ఈయనెప్పుడూ ఇంతే లలితా! ఆయన ధోరణి ఆయనదే గాని, ఆయన ప్రవర్తనకు ఇతరులు ఎంత బాధ పడతారో అన్న విషయం ఆయన ఆలోచించరు." కోపంగా అంది వాణి.

"నువ్వు చెయ్యగలిగింది ఏముంది! వెళ్ళు." ఉబికి వస్తున్న కన్నీటిని అతిప్రయత్నం మీద ఆపుకుంటూ అంది లలిత.

వాణి వెనకసీటుమీద కూర్చోగానే, స్కూటర్ను స్పీడుగా డ్రైవ్ చేస్తూ ఇంటివైపు వెళ్ళాడు రాజేష్.

రాజేష్ బుజాల చుట్టూ, చేతులువేసి రాజేష్ వీపుకు ఆనుకొని వాణీ కూర్చోవటం, దర్జాగా జంటగా స్కూటరు మీద వెళ్ళటం. ఎంత మరిచిపోదామన్నా, ఆ దృశ్యాన్ని మరిచిపోలేక పోతుంది లలితమనస్సు. రాజేష్ వెళ్ళిపోగానే, అంతా శూన్యంగా కనుపించింది లలితకు.

చీరకూడా మార్చుకోకుండా, ఏడుస్తూ అలాగే కూర్చుంది. ఆలోచించుకుంటూ, ఏడుస్తూ కూర్చున్న లలిత, రాజేష్ స్కూటరు దిగి తన దగ్గరకు వచ్చింది కూడా చూడ లేదు.

ట్యూబ్ లైట్ కాంతిలో, ముత్యాల్లా మెరుస్తున్న లలిత కన్నీటి చుక్కలు చూడగానే, రాజేష్ మనస్సు పిండి నట్లయింది.

"లలితా!" పిలిచాడు రాజేష్ అనురాగం నిండిన గొంతుతో.

"అదేమిటి! ఆఫీసుకు వెళ్ళాలన్నారుగా? ఇప్పుడేగా వెళ్లారు! అప్పుడే ఎలా వచ్చారు? ఆఫీసుకు వెళుతూ వచ్చారా?" ఆశ్చర్యంగా ప్రశ్నల వర్షం కురిపించింది. లలిత.

లలిత ప్రశ్నలకు సమాధానం చెప్పకుండా, లలిత దగ్గరగా కుర్చీలాక్కుని కూర్చున్నాడు రాజేష్,

"మాట్లాడరేమండి?"

"ఏం మాట్లాడ మంటావు?"

"ఆఫీసుకు వెళ్లారా?"

"ఈ జీవితంలో నువ్వు నన్ను అర్థం చేసుకోలేవు లలితా! ఈ టయములో ఆఫీసుకు వెళతానా."

"మరెందుకలా చెప్పారు? ఆఫీసు కెళ్ళాల్సిన పనుం దేమో అనుకున్నాను,"

"అందుకేనా ఏడుస్తూ కూర్చున్నావు?"

"కాకుంటే ఏం చెయ్యాను?"

"నీ తెలివి తేటలు అంత అమోఘంగా పని చేస్తున్నాయి."

"ఏమిటండీ? మీరనేది? మీరు వెళ్ళిపోగానే, నాకెంత బాధనిపించిందో తెలుసా? పుట్టినరోజునాడయినా, నాతో

కల్సి భోంచేస్తారనుకున్నాను. ఎంత ప్రాధేయపడినా, వెళ్ళి పోయారు. కనీసం వాణినికూడా ఉంచలేక."

"లలితా! నేనెందుకంత తొందరగా వెళ్ళానో తెలుసా? నీ పుట్టినరోజు నాడయినా, నిన్ను సంతోషపెట్టాలన్నదే నా కోరిక. ఆ కోరికను వాణిముందు ఎలా చెప్పగలను? వాణిని భోజనానికి ఉండమని బలవంతంచేసావు. నేను వాణిని ఎందు కంత త్వరగా తీసుకెళ్ళానో నీకు తెలియదు. వాణి నీతో పాటుంటే, మనం ఎలా మాట్లాడుకోగలుగుతాం? అందుకే, వాణిని ఇంటికి పంపించి నేను, నీ దగ్గరకు వచ్చాను. లలితా! నేను ఆఫీసుకు వెళ్ళే పనిలేదు. నీతో కల్సి భోంచెయ్యాలనే వచ్చాను. ఎందుకలా వెళ్ళిపోయానా అని అర్థం చేసుకో కుండా ఏడుస్తూ కూర్చున్నావు. నీకు బాధపడటం తప్ప ఇంకేం తెలియదు" తెచ్చిపెట్టుకున్న కోపంతో అన్నాడు రాజేష్.

"నేనెప్పుడూ, మిమ్మల్ని అర్థంచేసుకోలేను."

"భోంచేద్దామా?" మాట మారుస్తూ అన్నాడు రాజేష్.

"మీదే ఆలస్యం రండి." అంటూ లేచింది లలిత.

రాజేష్ పక్కనే కూర్చుంది లలిత. ఆ రోజు రాజేష్ భోంచేస్తాడని, అన్నీ రాజేష్ కిష్టమయిన వంటకాలే చేయిం చింది. అతని కిష్టమని పులిహోరా తనే స్వయంగా చేసింది.

రాజేష్ ప్రక్కనే కూర్చుని భోంచెయ్యటం ఎంతో తృప్తిని కలిగించింది లలితకు. ఆ సంతోషంలో, అంతకు

ముందు తను పడిన బాధంతా మరిచిపోయింది. ఆరోజు తన పుట్టినరోజని, పనంతా పూర్తయిన తర్వాత, వంటమనిషిని సెకండ్ షోకు పంపించింది లలిత.

ఎవరూ లేకుండా తనూ, తనప్రక్కన రాజేష్. ఈ అనుభూతి ఎంత మధురంగా ఉంది! మళ్ళీ జీవితంలో నాకిలాంటి రోజు వస్తుందా! తనలో తను అనుకుంది లలిత.

"భోంచెయ్యకుండా ఆలోచిస్తున్నావేమిటి? లలితా!"

"ఏమండీ! కలలాంటి ఈ రోజు కరిగిపోతే, మళ్ళీ ఇలాంటి రోజు రాదేమో అని భయంగా ఉంది."

పిచ్చి లలితా! ఉన్న రోజును గురించి ఆలోచించటం మానిస్తావు. రాబోయే రోజునుగురించి ఆలోచిస్తావు. నిన్నటి రోజు తిరిగిరాదు. రేపన్నరోజు లేదు. ఉన్నది ఈరోజే. ఈ రోజును గురించి, ఆలోచించు అనుభవించు. అదీ జీవిత సూత్రం."

"జీవితసూత్రాలను గురించి, భోంచేసిం తర్వాత తీరికగా చెబుదురుగాని. ముందు వడ్డించిన వాటిలో వేటినీ మిగల్చకుండా భోంచెయ్యండి."

"అమ్మో. ఇన్ని రకాల వంటకాలా! నావల్ల కాదు. ఇవన్నీ తింటే, అరగక బాధపడాలి"

"అరగటానికి నేను మందిస్తాను. ఏమండీ! పులిహోరా మీకిష్టమని నేనే స్వయంగా చేసాను. అందుకయినా మీరు ప్లేటులోని పులిహోరా మొత్తం తినేయాలి."

"సరే. ఇవన్నీ వదిలేసి, పులిహోరా మొత్తం తినే స్తాను." అన్నాడు రాజేష్ నవ్వుతూ.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ భోజ నాలు పూర్తి చేసేసరికి, టయము రాత్రి పదకొండు గంటలు అయింది.

ఇద్దరూ బాల్కనీలో కుర్చీలలో కూర్చున్నారు. వెన్నెల తన అందాలను నలుమూలలా వెదజల్లుతుంది పూల మీదనుంచి తేలివస్తున్న చల్లనిగాలి పూల పరిమళాన్ని అం దించి వెళుతుంది.

"లలితా! నీ పుట్టినరోజు ప్రజంటేషన్, నేనివ్వలేదు కదూ!"

"మీ మనస్సు నాది. ఆ ప్రజంటేషను చాలు నాకు. వేరే ఇంకేం కావాలి!" అంది లలిత ఆర్ద్రంగా

"నీకు ప్రత్యేకమయిన, ప్రజంటేషను ఇవ్వాలను కున్నాను. దాన్ని నలుగురిలో ఇవ్వలేకపోయాను. అందుకే ఇప్పటివరకూ ఆగాను."

"ఏమిటండీ! అది!"

"చెప్పుకో చూద్దాం."

"చీర తెచ్చారేమో, అనుకోవటానికి మీ దగ్గర అటు వంటి ప్యాకెట్టు కనిపించటం లేదు ఇంకేం తెచ్చుంటారు!"

"నువ్వే ఆలోచించు."

"నాకేం అర్థం కావటం లేదు. ఏమండీ! నన్నేమన్న భరించలేకపోతున్నాను. పోటీకిరయానని వచ్చాకుంటున్నాను. మీరే చెప్పండి" అంది లలిత గారాంగా.

"చెబుతాను." అంటూ, కుర్చీలోనుంచి లేచి, లలిత దగ్గరకు వచ్చి లలిత ఊహించని విధంగా లలిత నుదుటి మీద ముద్దుపెట్టుకున్నాడు. లలిత న్వర్గానుభూతి, తగలగానే ఎడారిలో మంచినీటి కోసం తపించిపోతున్న మనిషికి, దాహ టానికి చల్లని నీరిస్తే ఎంత తృప్తిగా ఉంటుందో, అంతటి తృప్తిని కలిగించింది. రాజేష్‌కు అణువు అణువునా విద్యుత్ ప్రవహించినట్లనిపించింది. తనేం చేస్తున్నాడో తనకే తెలియని ఉన్మాదిలా లలితను, గుండెలకు అదుముకుని, ముఖాన్ని ముద్దులతో నింపాడు. రాజేష్ కౌగిలిలో ,ఊపిరి ఆడక ఉక్కిరి బిక్కిరి అయింది లలిత.

"లలిత పెనుగులాడుతున్నకొద్దీ, రాజేష్‌లోని ఆవేశం మరింత అధికమవుతుంది.

"ఏమండీ! ప్లీజ్! నన్నొదలండీ! నేను పూజకు పనికి రాని పూవును. ఎంగిలి ఆకును. నన్ను ముట్టుకోవద్దండీ వద లండీ." అతన్నుంచి తప్పించుకోవాలని ప్రయత్నిస్తూ కన్నీ టితో అంది లలిత.

"నాకావలసింది నీ మనస్సు. నీ శరీరం కాదు. నువ్వు నా దానివి కాదనకుండా నా కోరిక తీర్చు. మండు తున్న నా గుండెల ఆవేదన చల్లార్చు. నీ వశిలో తప్ప నాకేం

కెక్కడా ప్రశాంతత లభించదు. ఇన్నిరోజులుగా, నీ పొందు కోసం తపించిపోతున్నాను. ఇక నీకు దూరంగా ఉండటం నాకు సాధ్యంకాదు. నిన్ను పెళ్ళి చేసుకుంటాను. ఎవరు ఏమనుకున్నా నేను భయపడను." అన్నాడు రాజేష్ ఉన్మాదిలా.

రాజేష్ చేతులు లలితచుట్టూ, మరింతగా బిగుసుకుంటున్నాయి.

"వద్దు క్షణికమయిన సుఖంకోసం నా పవిత్రత చెడగొట్టొద్దు."

"లలితా! నా మాటవిను. నన్ను సంతోషపెట్టి నువ్వు సంతోషపడు. అనవసరమయిన విషయాలను గురించి ఆలోచిస్తూ ఉన్న సంతోషాన్ని పాడుచేయకు."

"నన్ను శవంగా చూడాలనుకుంటే, మీ కోరిక తీర్చుకోండి." అంది లలిత ఆఖరి అస్త్రంగా.

ఆ మాటతో రాజేష్‌లోని ఆవేశం, పొంగుతున్న పాలమీద నీళ్ళు చిలకరించినట్టయింది. మత్తువదిలి పోయింది. అప్రయత్నంగా కౌగిలిలోని లలితను వదిలేసాడు.

ఆ షాక్‌నుంచి తేరుకోవటానికి, రాజేష్‌కు పదినిముషాలు పట్టింది.

"నా మీద కోపంవచ్చింది కదూ!" రాజేష్ కళ్ళలోకి భయంగా చూస్తూ అంది లలిత.

"నీ మీద కాదు. నా మీద నాకే కోపం."

"అంత నిష్ఠూరంగా మాట్లాడకండి."

"నువ్వు పెద్ద త్యాగమూర్తివి. ఆ బిరుదు తగిలించుకోవటానికి, నువ్వెంత నిగ్రహంగానయినా ఉండగలవు. ఎంతసేపూ నీ ధోరణి నీదేగాని నన్ను గురించి ఆలోచించవేం?"

"గతాన్ని మీరు మరిచిపోయినా, నేను మరిచిపోలేనండీ. ఎంగిలికంచులో మీరు భోంచెయ్యటం నేను సహించలేను."

"లలితా!" పెద్దగా అరిచాడు రాజేష్. అది అరుపులా లేదు. సింహగర్జనలా ఉంది.

"లలితా! గతాన్ని గుర్తుచెయ్యవద్దని, నీకెన్నిసార్లు చెప్పాను. పదే, పదే ఆ విషయాన్ని గుర్తుచేస్తుంటే నా గుండెను కత్తితో చీలుస్తున్నట్టుగా ఉంది. ఈ రోజు నీపుట్టిన రోజుకదా? సంవత్సరానికి ఒక్కసారి వచ్చే, ఈ రోజునాడయినా నిన్ను సంతోషపెడదామనుకున్నాను. అంతేగాని, కోరికతో దహించుకుపోవటంలేదు. కేవలం కోరిక తీర్చుకోవాలనుకుంటే అందుకు దారులు చాలా ఉన్నాయి. నీ పిరికితనంతో నీ జీవితాన్ని పాడుచేసుకోవటమే కాకుండా, నా జీవితాన్ని కూడా నరకం చేస్తున్నావు. నువ్వు సుఖపడ

లేవు. నన్ను సుఖపెట్టలేవు. ఈ జీవితాలు ఇంతే. కోపంగా అంటూ లలిత పిలుస్తున్నా వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు రాజేష్.

# 23

రాజేష్ శారీరకంగా లలితకు ఎంత దగ్గర కావాలని ప్రయత్నిస్తున్నాడో, లలిత అంతదూరంగా ఉంటుంది. వాణి భర్తకు దగ్గరవ్వాలని ప్రయత్నిస్తున్న కొద్దీ, రాజేష్ అంతదూరంగా ఉంటున్నాడు.

భర్త నిరాకరణ, అతని ప్రవర్తన వాణికేం అర్థంకావటంలేదు. ఆ విసుగుతోనే, రోజూ భర్తను సాధించటం అలవాటయిపోయింది వాణికి.

వాణి విసుగూ, కోపం వాణిని భర్తను మరింత దూరం చేస్తున్నాయి.

ఆ రోజు ఆదివారం ప్రతిఆదివారం సాయంత్రం కనకదుర్గ కొండదగ్గర కలుసుకుంటారు. లలితా! రాజేష్ ఇద్దరూ కల్సి కొండమీద కూర్చోటమో, బ్రిడ్జి చివరవరకూ నడుచుకుంటూ వెళ్ళి అక్కడ కృష్ణానది వడ్డున కూర్చోవటమో చేస్తారు.

నాలుగుగంటల నుంచి, రాత్రి ఏడు గంటలవరకూ ఇద్దరూ అక్కడే గడుపుతారు.

అలవాటు ప్రకారం లలితను కలుసుకోవటానికి వెళ్ళటానికి తయారయి వరండాలోకి వచ్చాడు రాజేష్. ఏదో పుస్తకం చదువుతూ అక్కడే కూర్చుంది వాణి.

"ఎక్కడకు బయలుదేరారు?"

"ఫ్రెండ్‌ను కలుసుకోవాలి.

"అంత అర్జంటా?"

"నా కోసం ఎదురుచూస్తూంటాడు వెళ్ళాలి." ముక్తసరిగా అన్నాడు రాజేష్.

"ఏమండీ! శంకరాభరణం సినిమా చూడాలని మూడు నెలనుంచి అనుకుంటున్నాను. ఈ రోజు ఆదివారం కదా! మీరు కూడా ఇంటిదగ్గరే ఉన్నారు ఇద్దరం కల్సి వెళదామండీ."

"ఎలా? సినిమా కెళ్లాలనుకున్న దానివి ఉదయం చెప్పకూడదూ? నా కోసం మా ఫ్రెండ్ ఎదురు చూస్తుంటాడు. వెళ్ళకపోతే బాధపడతాడు."

'సాయంత్రం వెళ్లాలనుకున్న సినిమాకు ఉదయమే మీతో చెప్పాల ? అయినా నా కంటే మీకు మీ ఫ్రెండే ఎక్కువా?"

"అతను ఎదురు చూస్తూంటాడు."

"ఆ విషయం ఆలోచిస్తారుగానీ, మీరు వెళితే నేను బాధపడనా?"

"నీకలా ఉంటేగా!"

"మిమ్మల్ని పెళ్ళిచేసుకున్నప్పటి నుంచేగా!"

మాటకు మాట సమాధానం చెప్పటం అలవాటయ్యింది నీకు."

"నన్ను సినిమాకు తీసుకెళతారా? లేదా?"

"రేపు తీసుకెళతాను."

"మీ సంగతి తెలిసి కూడా, మిమ్మల్ని అడగటం నాదే పొరపాటు. నాకంటే మన పనిమనిషి, సీతాలు నయం. పగలంతా భార్యా భర్తలిద్దరూ కష్టపడి పనిచేసుకున్నా, రాత్రి అయ్యేసరికి చిలకా గోరింకల్లా నవ్వుతూ, తుళ్ళుతూ గడుపుతారు. వారానికి రెండుసార్లు భర్తతో కల్సి సినిమాకు వెళుతుంది. నా బ్రతుకు పనిమనిషి కంటే కూడా హీనంగా తయారయ్యింది."

"ఎలాంటి వాళ్ళతో, నీ జీవితాన్ని పోల్చుకుని ఏడవటం నీకు సరదా."

"మిమ్మల్ని కట్టుకున్న తర్వాత, సరదాలూ షికార్లు అన్నీ మరిచిపోయాను. మీవంటి కసాయి మనిషితో నేను కాపురం చెయ్యలేను."

"అంత బలవంతంగా, ఇష్టం లేకుండా నాతో కాపురం చెయ్యాల్సిన అవసరం లేదు." అన్నాడు రాజేష్ కటువుగా.

"అంటే!"

"విడాకులిస్తాను. నీ ఇష్టమయిన వాడిని పెళ్ళి చేసుకో."

"ఏమండీ! మీ దగ్గరనుంచి విడాకులు తీసుకోవటానికేనా! మిమ్మల్ని పెళ్ళి చేసుకున్నది! మీతో కలిసి ఏడు యుగాలు నడిచింది! నాకు, ఊహ తెలిసినప్పటినుంచి, మిమ్మల్ని నా ప్రాణం కంటే ఎక్కువగా ప్రేమిస్తున్నాను! మీరు ఆఫీసు నుంచి ఇంటికి రావటం ఒక్కగంట ఆలస్యం అయితేనే, నా మనస్సు విల, విలలాడిపోతుందే. అటువంటిది, నేను వేరే వాడిని పెళ్ళిచేసుకోవాలా! పది సంవత్సరాలనుంచి నాతో కాపురం చేస్తు అంత మాట ఎలా అనగలిగారండీ!" అంది వాణి ఏడుస్తూ.

వాణి గొడవ తనకేం పట్టనట్టుగా, బయటకు వెళ్ళి పోయాడు రాజేష్.

తనలో, తను కుమిలిపోతూ అలాగే కూర్చుంది వాణి.

## 24

"మీకోసం గంటసేపటినుంచి ఎదురు చూస్తున్నాను. ఇంతాలస్యం చేశారేం! ఏమిటలా ఉన్నారు!"

"నీ మూర్ఖత్వానికి ఫలితం నేననుభవిస్తున్నాను." లలితకు దగ్గరగా కూర్చుంటూ అన్నాడు రాజేష్.

"ఏం జరిగిందండీ!"

"కొత్తగా ఏం జరగలేదు. రోజూ జరిగే తంతే"

"మరెందుకలా ఉన్నారు!"

"నేను వాణికి విడాకులివ్వాలను కుంటున్నాను."

మబ్బులేని పిడుగులా, వినిపించింది ఆ మాట లలితకు,

"ఏమ డీ."

"అవును లలితా! ఆ అనుమానపు రాక్షసితో, కాపురం చెయ్యలేను. ఇంటికి వెళ్లాలంటేనే, భయంగా ఉంటుంది. నేను ఇంటికి వెళ్ళేసరికి, యుద్ధానికి సిద్ధమయిన దానిలా కూర్చుంటుంది. రోజు గొడవే రోజూ ఏడుపే. రాను రాను నాకు విసుగెత్తి పోతోంది. నువ్వు చూస్తే ఇలా. ఆవిడ చూస్తే అలా, మీ ఇద్దరి మధ్యా మనశ్శాంతి లేకుండా అడకత్తెరలో పోకచక్కలా నలిగి పోతున్నాను నేను. నువ్వొక త్యాగమూర్తివి ఆవిడొక స్వార్థపరురాలు. ఈ రంపపుకోతను భరించేకంటే, ఒక్కసారిగా ఆత్మహత్య చేసు కోవటం మంచిది."

"అంత మాటనకండి."

"నువ్వేం భయపడనక్కరలేదు. నేనంత త్వరగా చావను. మీ ఇద్దరి మూలంగా, ఇంకెంత బాధ అనుభ వించాలో నేను." అన్నాడు వేదనగా రాజేష్.

"నేనొకసారి వాణితో మాట్లాడతాను."

"ఏం మాట్లాడతావు?"

"మిమ్మల్నిలా బాధ పెట్టొద్దని, వాణికి నచ్చ జెపుతాను."

"అక్కర్లేదు."

"ఒకర్ని ఒకరు అర్థం చేసుకోకుండా, ఎంత కాల మిలా బాధ పడతారు.?"

"నువ్వేదో సుఖపడుతున్నట్టు." అన్నాడు రాజేష్ కటువుగా.

"ఆ అదృష్టం నాకులేదు."

"సోర్ర్యి."

ఎప్పుడూ కటువుగా మాట్లాడని రాజేష్ అంత కోపంగా కసురుకునే సరికి, లలిత కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. ఇంటి దగ్గర వాణేదో, గొడవ చేసుకుంటుందని, ఆ కోపంలో కసురుకున్నాడని సరిపెట్టుకుంది.

"మనస్సు బాగలేదు. ఎప్పుడూ లేనిది నిన్ను కసురు కున్నాను. సారీ."

"మామూలంగానే, మీకీ సమస్యలన్ని. ఏమండీ! నేను మీ ఎదురుగా ఉన్నంతకాలం, మీకీ సమస్యలు తప్పవు. ఇంకోవూరు ట్రాన్స్ఫర్ చేయించుకుని వెళ్ళిపొండి" లలిత అంది ఉబికి వస్తున్న కన్నీటని అతిప్రయత్నం మీద ఆపుకుంటూ,

"నువ్వేదయినా చెయ్యగలవు. ఏ మాటయినా చెప్ప గలవు, నువ్వు పెద్ద త్యాగ మూర్తివి కదా!" అన్నాడు రాజేష్ కోపంగా.

"నా కోసం మీరు వస్తుంటారు. వాణి గొడవ చేస్తుం టుంది. ఎంతకాలమిలా భరిస్తారు.?"

"జీవితం అంతా. చాలా!"

నిప్పులు కురుస్తున్నట్టున్న రాజేష్ కళ్ళను చూసి, ఇంకేం మాట్లాడటానికి, ధైర్యం చాలక తల వంచుకుని కూర్చుంది లలిత. తలకింద చేతులు పెట్టుకుని ఇసుకలో పడుకున్నాడు. రాజేష్.

అతని గుండెల్లో వదిగి పోయి, తన వేదనంతా మరిచిపోవాలన్న కోరికను అతి ప్రయత్నంమీద ఆపుకుంది లలిత. నిముషాలు గడిచిపోతున్నాయి.

సంధ్యా సమయం కావటం వలన, నీళ్ళలో చేపలను ఏరుకు తినటానికి వచ్చిన కొంగల జంటలు కడుపునిండా చేపల్ని ఏరుకు తిని, గూళ్ళకు చేరుకోవాలన్న ఆతృతతో గుంపులు, గుంపుగా ఎగిరి పోతున్నాయి.

వెలుగుతున్న కొన్ని వేల ట్యూబ్ లైట్ల కాంతిలో విజయవాడ పట్టణం నక్షత్ర మండలంలా కన్పిస్తుంది. నది వడ్డున కూర్చుని చూస్తుంటే బ్యారేజి మీద వెలుగుతున్న లైట్ల కాంతిలో, నదిలోని కెరటాలు బంగారు కెరటాల్లా మెరిచి పోతున్నాయి.

"వెళదామా!"

"నువ్వెళ్ళు. నేను తర్వాత వెళతాను." లలిత వైపు తిరిగి చూడకుండానే అన్నాడు రాజేష్.

హాస్పటల్‌లో పని ఉండటం వలన, తప్పనిసరై లేచింది లలిత.

లలిత వెళ్ళిపోయింతర్వాత, బరువెక్కిన మనస్సుతో అలాగే పడుకున్నాడు రాజేష్.

## 25

లలిత గేటు బయటే కారాపి లోపలకు వచ్చింది. కన్సల్టింగ్ రూము దగ్గరకు రాగానే, వరండాలో కూర్చుని మాట్లాడుకుంటున్న కాంపౌండరు, స్టాఫ్ నర్స్ మాటల్లో తన పేరు వినిపించడంతో లోపలకు వెళ్ళకుండా అక్కడే నిలబడిపోయింది లలిత.

"డాక్టరమ్మగారి అసలుపేరు లలిత. విజయ కాదు." అది స్టాఫ్ నర్సు గొంతు.

"నీకెలా తెలుసు!" కుతూహలంగా అడుగుతున్నాడు కాంపౌండరు రాంబాబు.

"ఈ డాక్టరమ్మగారు ఇంతవరకూ, ఎందుకు పెళ్ళి చేసుకోలేదో తెలుసా!"

"అబ్బ! సస్పెన్సుతో చంపకుండా, నీకు తెలిసిన వివ
రాలు చెప్పు. నువ్వు చెప్పేది ఒక మాటయినా ఒక గంట
సేపు ఎదుటివాళ్ళను సస్పెన్సులో పెడతావు."

"ఇక్కడకు రాజేష్‌గారని రోజూ సాయంత్రం పూట
వస్తుంటారు తెలుసుగా?"

"తెలుసు."

"ఆయనే, డాక్టరు విజయగార్ని లలితా, అని పిలు
స్తుంటే విన్నాను."

"అంతేకాదు విజయగారి, నాన్నగారి స్నేహితులు
మాధవరావుగారు కూడా, విజయగార్ని లలితా అనే పిలు
స్తారు."

"ఒక్క మనిషికి, రెండు పేర్లుండవచ్చు. ఎవరికి
నచ్చిన పేరుతో వాళ్ళు పిలుస్తారు. అందులో విశేషం
ఏముంది?"

"నీది మట్టిబుర్ర. నీకేం అర్థం కాదు. డాక్టరమ్మ
గారూ, ఇక్కడకు వచ్చే రాజేష్‌గారూ ప్రేమించుకున్నా
రంట. ఏ కారణంగానో ఇద్దరూ పెళ్ళిచేసుకోలేకపోయారు.
అందుకే డాక్టరమ్మగార్ని చూడటానికి, ఆయనగారు
సాయంత్రం అయిదున్నర అయితే చాలు ఇక్కడకు వస్తారు.
అంతకు ముందు డాక్టరమ్మగారు సాయంత్రం అయిదు గంట
లనుండి రాత్రి ఏడు గంటల వరకూ పేషెంట్సును చూసే

వాళ్ళు. ఈయనగారు వచ్చిన దగ్గర్నుంచీ, పని వేళలు కూడా మార్చారు. నాలుగింటినుంచి అయిదున్నర వరకు పేషెంట్సును చూస్తారు. రాజేష్‌గారు రాగానే ఇద్దరూ బాల్కనీలో కూర్చుని గంటలతరబడి కబుర్లు చెప్పుకుంటారు”

“ప్రస. ఈ విషయాలన్నీ నీకెలా తెలుసు.

“బాల్కనీలో కూర్చుని మాట్లాడుకుంటున్నారు. డాక్టరమ్మగార్ని పిలవటానికి, నేను అక్కడకు వెళ్ళాను. నన్ను గమనించకుండానే ఇద్దరూ ఆవేశంగా మాట్లాడుకుంటుంటే విన్నాను.”

‘ఇటువంటి విషయాలు అర్థం చేసుకోవటంలో నువ్వు చాలా తెలివయినదానివి. అదిసరే. ఇలా చాటుమాటుగా కలుసుకోవటం ఎందుకు? ఇద్దరూ పెళ్ళిచేసుకోవచ్చుగా!”

“ఎలా చేసుకుంటారు? ఆయనగారికి పెళ్ళి అయింది. ఆయనగారి భార్య, డాక్టరమ్మగారూ ఇద్దరూ ఒకే ఊరి వాళ్ళంట. చిన్ననాటి స్నేహితులు కూడాను. ఆవిడ జ్వరంతో ఓ వారం రోజులు, మన హాస్పటల్‌లోనే ఉండి వెళ్ళింది. ఆమె హాస్పిటల్‌లో ఉన్నన్ని రోజులూ భోజనం కూడా డాక్టరమ్మగారి ఇంటిదగ్గర్నుంచే పంపించే వాళ్ళు. రాజేష్ గారి భార్య నాతో చెప్పింది డాక్టరమ్మగారూ నేనూ స్నేహితులం అని.”

వీళ్ళలా కలుసుకోవటం, ఆయనగారి భార్యకు తెలుసా!”

‘నువ్వెంత అమాయకుడివి రా బాబు. తెలిస్తే ఊరుకుంటారా ఎవరయినా! తెలియకే పాపం వీళ్ళ నాటకం సాగుతుంది.”

ఇక వాళ్ళ సంభాషణ, వినలేకపోయింది. లలిత. వాళ్ళ ఎదుట పడాలన్నా సిగ్గుగా అనిపించి, మళ్ళీ వెనక్కు వచ్చి కారులో కూర్చుంది.

కారులో గంటసేపు పిచ్చిదానిలా వీధులన్నీ తిరిగింది కారును కనకదుర్గ కొండపక్కగా ఆపి దిగి వెళ్ళి రోడ్డు మీద, కొంతదూరం వెళ్ళి ప్రశాంతంగా ఉన్నచోట కొండ రాతిమీద కూర్చుంది.

వాళ్ళిద్దరి మాటలూ విన్న దగ్గరనుంచీ, ఆత్మహత్య చేసుకోవాలన్నంత ఆవేశంగా ఉంది లలితకు. వాళ్ళను వెంటనే ఉద్యోగంలోనుంచి, తొలగించుదాం అనుకుంది. వాళ్ళను తొలగించి, ఆస్థానంలో కొత్త వాళ్ళను పెట్టుకున్నా, వాళ్ళు మాత్రం ఇలా మాట్లాడుకోరని నమ్మకం ఏముంది? అయినా వాళ్ళు మాట్లాడుకున్న మాటల్లో తప్పేముంది? ఉన్న విషయమేగా? దాన్ని నా ఎదురుగా మాట్లాడుకునే ధైర్యంలేక చాటుగా మాట్లాడుకున్నారు. అంతేగా? అని సమర్థించుకుంది.

ఇన్ని రోజులుగా, నా విషయం వాణికి తెలిస్తే పరిణామాలు ఎలా వుంటాయి? అన్న విషయం ఆలోచించలేకపోయాను. నిజమే. తెలిస్తే ఏమవుతుంది రాజేష్‌ను, నా దగ్గరకు రావద్దని శాసిస్తుందా? లేక మా ఇద్దరికీ ఉన్న స్నేహాన్ని దృష్టిలో పెట్టుకుని చూసీ చూడనట్టుగా ఊరుకుంటుందా?

ఆడది ఏదయినా, సహించగలదు గానీ తన భర్త మనస్సులో మరో ఆడదా..కి చోటుండటం మాత్రం సహించలేదు. భగవంతుడా! నేనేంపాపం చేశానని నాకిన్ని సమస్యలు సృష్టిస్తున్నావు! ఈ సమస్యల్ని ఎలా ఎదుర్కోవాలి? అనుకుంటూ కనుపించని భగవంతునికి తన కన్నీటి కధను వినిపిస్తూ రాత్రి ఎనిమిది గంటల వరకూ అక్కడే కూర్చుంది. డాక్టర్‌గా తన బాధ్యత గుర్తుకువచ్చి, నర్సింగ్ హోంవైపు కారును పోనిచ్చింది లలిత.

# 26

ఉదయం నుంచి, సాయంత్రం నాలుగు గంటల లోపు మూడుసార్లు ఫోను చేసి చెప్పింది లలితను వాళ్ళింటికి రమ్మని వాణి.

కాదనలేక, వాణీ వాళ్ళింటికి వెళదామనుకుంది లలిత ఆ రోజు ఆదివారం కావటం సాయంత్రం హాస్పటల్ పని కూడాలేదు. అదీగాక, రెండురోజుల క్రితం ఆఫీసు పనిమీద మద్రాను వెళ్ళిన రాజేష్ ఇంకా రాలేదు. మళ్ళీ రాజేష్ వస్తే సాయంత్రం టయములో వాణి దగ్గరకు వెళ్ళటానికి వీలుకాదు. అందుకే ఆరోజు వాణి దగ్గరికు జయలుదేరింది లలిత.

లలిత వెళ్ళేటప్పటికి. వాణి లోపలుంది వరండా గోడకు తగిలించి ఉన్న రాజేష్ ఫోటో వైపు చూస్తూ నిలుచుంది లలిత.

అప్పుడే లోపలినుంచి వస్తున్న వాణి. లలితను చూసి "నువ్వు వస్తావని చెప్పినా, నమ్మలేకపోయాను లలితా. ఎందుకంటే, నువ్వెప్పుడూ వస్తాననే చెబుతావు. రావు. అందుకే ఈరోజు కూడా రావనే అనుకుంటున్నాను. కూర్చో." ఆప్యాయంగా ఆహ్వానిస్తూ అంది వాణి.

"నాకూ రావాలనే ఉంటుంది వాణీ! కానీ, ఏం చేయ్యను? హాస్పటల్ పనితోనే సరిపోతుంది." అంది నవ్వుతూ లలిత.

"తీరికనేది చేసుకుంటే వస్తుంది."

"ఒకరోజంతా నువ్వు నా ఎదురుగా ఉండి చూడు. నీకే అర్థమవుతుంది."

"లలితా! పగలూ, రాత్రి తిండీ నిద్రా లేకుండా నువ్వింత కష్టపడి సంపాదించేది. ఎవరికోసం?"

"ఆ ప్రశ్న అడిగిన వాళ్ళందరికీ సమాధానం చెప్పి చెప్పీ విసిగిపోయాను. మళ్ళీ ఆ ప్రశ్న నువ్వూ అడిగితే ఏం సమాధానం చెప్పను వాణీ!"

"అందరూ అడిగే ప్రశ్నలో తప్పేముంది? లలితా స్నేహితురాలిగా, నీ దగ్గరున్న చనువుకొద్దీ అడుగుతున్నాను. ఎంతకాలమిలా పెళ్ళి చేసుకోకుండా ఉంటావు? నేనూ, నీ వయస్సుదాన్నేగా? పెళ్ళి చేసుకుని పది సంవత్సరాలనుంచి కాపురం చేస్తున్నాను. నీ వయస్సంతా అడవికి కాచిన వెన్నెలలా గడిచిపోతుంది. నాకు తెలియక అడుగు

కాను నీకు పెళ్ళి చేయాలన్న ఆలోచన మీ నాన్నగారికి కూడా లేదా? లేకనువ్వే ఆయన మాట వినటం లేదా?"

"నాకు పెళ్ళి చేసుకోవాలని లేదు!"

"ఏం? ఎందుకని? ఇప్పుడు చేసుకోవాలని లేదా? లేక అసలే చేసుకోవాలని లేదా?"

"అసలే చేసుకోవాలని లేదు. పెళ్ళి అయిన వాళ్ళంతా నాకంటే ఎక్కువ ఏం సుఖపడుతున్నారు? హాయిగా ఏ బాదరబంధీ లేకుండా డాక్టరుగా పదిమందికి సేవచేస్తూ, నా వృత్తి నిర్వహణలో ప్రశాంతంగా ఉన్నాను."

"పెళ్ళి అయిన వాళ్ళంతా, ప్రశాంతంగా లేరనా నీ ఉద్దేశ్యం?

"నీకు పెళ్ళి అయింది. నువ్వు నాకంటే ఎక్కువ సుఖపడుతున్నావా? ఎప్పుడూ కీచులాటలు, గొడవలు అంతే గా వివాహజీవితం? కాకపోతే పెళ్ళి అయిన వాళ్ళు తల్లులుగా మారతారు. పిల్లల్ని పెంచటం, భర్తకు వండిపెట్టటం. ఆ రెండూ లేనంత మాత్రాన జీవితానికి అర్థమేలేదా?"

"వివాహ జీవితంలోని, అనుబంధం నీకు తెలియదు. కాబట్టి అలా మాట్లాడుతున్నావు. లలితా! భార్యా భర్తలు కీచులాడుకున్నా, అందులోనూ ఎంతో మధురిమ ఉంటుంది. పగలంతా కీచులాడుకున్నా భార్యా భర్తలు రాత్రి అయ్యే సరికి రాజీకి వస్తారు ఎందుకో తెలుసా? పగలంతా భార్యా పిల్లల్ని పోషించటానికి భర్తా, తన భర్తకు తన పిల్లలకు

కావలసినవి చూడటంలో భార్యా శ్రమపడతాం. రాత్రి పూట ఒకరి కౌగిలిలో ఒకరు వదిగిపోయి, ఒకరి కోసం ఒకరు పగలంతా పడిన శ్రమను మరిచి పోతారు. భార్యాభర్తల అనుబంధాన్ని మరింత పటిష్టం చేస్తారు పిల్లలు. ఇటు వంటి తీయని అనుభూతులు, మాటలతో చెబితే అర్థంకావు నువ్వింత చదువు చదివి కూడా, ఇంత అమాయకంగా ఆలోచిస్తున్నావంటే నాకే ఆశ్చర్యంగా ఉంది "

"రాత్రి అయ్యేసరికి భార్య ఎదురు చూస్తుంటుందని భర్త ఇంటికి వస్తాడు. భర్త వస్తాడని భార్య ఎదురుచూస్తుంటుంది. జీవితంలో ఇటువంటి విలువయిన అనుభూతుల్ని దూరం చేసుకుని, పగలూ, రాత్రి యంత్రంలా కష్టపడి సంపాదించేది ఎవరి కోసం? ఎందుకు కష్టపడాలి? తల్లి, తండ్రులు తమ కూతుళ్ళకు తమ శక్తి కొద్దీ సంపాదనల్ని కట్నంగాఇచ్చి పెళ్ళి చేస్తారు ఎందుకు? కూతుర్ని పోషించుకో లేకనా? కట్నంగా ఇచ్చేడబ్బును బ్యాంకులో వేస్తే, దానిమీద వచ్చే వడ్డీ సరిపోతుంది బ్రతకటానికి. కానీ అలా చెయ్యకుండా ఆ డబ్బును కట్నంగా ఇచ్చి మరోమగవాడితో ఆడపిల్ల పెళ్ళి జరిపిస్తారు. తమ కూతురు సుఖపడాలని. లలితా! ఇప్పుడు నీకు ముప్పయి సంవత్సరాలు. ఇంకా రెండేళ్ళుపోతే, పెళ్ళి చేసుకునే వయస్సు కూడా దాటిపోతుంది. మరో పదేళ్ళు గడిస్తే పిల్లల్ని కనే వయస్సు దాటిపోతుంది. అప్పుడు గడిచిపోయిన, నీ జీవితాన్ని గురించి ఆలోచించుకున్నా మాత్రం ప్రయోజనం

ఏముంది? అనుభవించే వయస్సు దాటిపోయింతర్వాత ఎంత సంపాదించినా ఏం చేసుకుంటావు?" అంది వాణి ఆవేశంగా.

"నా పెళ్ళి విషయం మాట్లాడి, పెళ్ళి చేసుకోమని నాకు నచ్చజెప్పటానికేనా? నన్ను రమ్మన్నావు?" రానినవ్వు నవ్వుతూ అంది లలిత.

"నిన్ను చూస్తుంటే నాకు జాలేస్తుంది లలితా! చిన్న తనం నుంచీ, వయస్సు వచ్చేవరకూ ఒక్క ప్రాణంలా గడి పాము. నీ వయస్సు వాళ్ళంతా, పెళ్ళిళ్ళు చేసుకుని తల్లులవు తుంటే, నువ్విలాగే ఉండిపోయావని నాకెంత బాధగా ఉంటుందో తెలుసా?" లలిత చేతిని, తన చేతిలోకి తీసు కుంటూ అంది వాణి.

"ఉదయంనుంచి పేషెంట్సుతో అలిసిపోయాన్నాను. యీరోజు రెండు ఆపరేషన్స్ చేసాను. నువ్వుకూడా ఈ గొడ వతో విసిగించకు. వేడి, వేడి టీ తీసుకురా. తలనెప్పిగా ఉంది" అంది లలిత విసుగ్గా.

"మాటల్లో నీకు టీ ఇవ్వాలన్న విషయమే మరిచి పోయాను. ఫ్లాస్కులో టీ ఉంది. ఒక్క నిముషంలో తెస్తా నుండు." అంటూ లోపలకు వెళ్ళి, రెండుకప్పులతో టీ తీసు కొచ్చి ఒక కప్పు లలిత కందించి మరోకప్పు తను తీసుకుని కూర్చుంది వాణి.

"ఇంకేమిటి విశేషాలు?"

"గడపదాటి బయటకు వెళ్ళక, మూడు నెలలయింది. నేనేం చెప్పను విశేషాలు! నూతిలో కప్పలా ఉండేదాన్ని నాకేం తెల్సు? నువ్వే చెప్పు" నవ్వుతూ అంది వాణి.

"మీవారింకా రాలేదా?" అడిగింది లలిత ఆ మాట అడిగింతర్వాత గుర్తుకు వచ్చింది లలితకు తనెంత పొరపాటుగా మాట్లాడానా అని. మా వారు ఊరెళ్ళిన విషయం నీకెలా తెల్సు? అని వాణి అడుగుతుందేమో అని భయపడింది కానీ, వాణి ఆ విషయం పట్టించుకోనట్టుగా" ఆయనెళ్ళి మూడు రోజులయింది. నాకయితే మూడు యుగాలయినట్టుగా ఉంది. భోంచెయ్యాలనిపించటం లేదు. నిద్రపట్టటంలేదు. ఈ రోజు అయితే, పిచ్చెక్కినట్టుగా ఉంది. అందుకే నిన్ను రమ్మని మూడుసార్లు ఫోన్ చేసాను. చెబితే నువ్వు నవ్వుతావేమో గానీ ఆయన్ని చూడకుండా నేనొక్క రోజుకూడా ఉండలేను. ఆయన పక్కన లేకపోతే నాకు నిద్ర కూడా పట్టదు. ఆయనెంత కసురుకున్నా సరే ఆయన కాళ్ళ దగ్గరయినా పడుకుంటాను గానీ ఆయన కొట్టిన రోజుకూడా కోపంవచ్చి అయినా ఆయనకు దూరంగా పడుకోను." వాణి చెప్పింది సిగ్గుపడుతూ.

"ఏమిటే! మీ వారు నీమీద చెయ్యి చేసుకుంటారా?" నమ్మలేనట్టుగా అడిగింది లలిత.

"ఎందుకో అలా ఆశ్చర్యపోతావు? భార్యాభర్తలన్న

తర్వాత కొట్టుకోకుండా, తిట్టుకోకుండా ఎలా ఉంటారు?" వాణి అంది నవ్వుతూ.

"చదువూ, సంస్కారం ఉన్న మీ వారు కూడా, నీ మీద చెయ్యిచేసుకుంటారంటే, నమ్మలేక పోతున్నాను. అయినా అంతవరకూ ఎందుకు తెచ్చుకోవాలి?

"భర్త, భార్యను తనది అనుకుంటాడు. కాబట్టి కోపం వచ్చినప్పుడు కోపాన్ని అపుకోలేక భార్యమీద చెయ్యి చేసుకుంటాడు లలితా! మా వారు నన్ను ఒక చెంపదెబ్బ కొట్టారనుకో అప్పుడు నాకు కోపం రాదు. నేను ఆయనకు మరింత దగ్గరయ్యాను కదా అని సంతోషంగా ఉంటుంది. నిజం."

"ఏమో. నీ మాటలు నాకేం అర్థం కావటంలేదు. ఒకసారి భార్యను చెంపదెబ్బ కొట్టి ఆ తర్వాత మళ్ళీ అదే చేత్తో భార్యను ఎలా దగ్గరకు తీసుకుంటారో మగవాళ్ళు. కొట్టడం, దగ్గరకు తీసుకోవటం మగజాతికే సరిపోయింది."

"పిచ్చిలలితా! నువ్వు డాక్టరువన్న మాటేగానీ ఇలాంటి విషయాలు నీకేం తెలియవు. కోపంలో భర్త చేయి చేసుకున్నా, దెబ్బతిన్న భార్యకంటే, దెబ్బకొట్టిన మగవాడే ఎక్కువ బాధపడతాడు."

"అదేమిటి?"

"అదంతే!"

"నిజంగానా?"

"అవును లలితా! అనవసరంగా, భార్యమీద చేయి చేసుకున్నానే అని మగవాడు ఎంతో బాధపడతాడు."

"ఈ విషయాలన్నీ నాకు తెలియవు. పశువులా భార్యమీద చేయి చేసుకునే మగవాడంటే నాకసహ్యం."

"అబ్బ అలా అనకే. మావారు కనీసం నెలకు ఒక సారయినా చెంపదెబ్బ కొడతారు. రాత్రిపూట నన్ను గుండెల్లోకి తీసుకుని దెబ్బ తగిలిందా వాణీ! నాకు మాత్రం నిన్ను దెబ్బలతో బాధపెట్టాలని వుంటుందా చెప్పు! ఆఫీసు నుంచి రాగానే విసిగిస్తావు. కోపం భరించలేక చెయ్యి చేసుకుంటాను. అంటూ అనునయంగా నన్ను దగ్గరకు తీసుకుంటారు. అప్పుడు నాకెంత హాయిగా వుంటుందో. అందుకే ఆయన ఎప్పుడు చెంపదెబ్బ కొడతారా అని ఎదురు చూస్తాను" అంది వాణి నవ్వుతూ.

"నీ మాటలు వింటే నవ్వుతారు ఎవరయినా!"

"భార్యాభర్తల అనుబంధంలోని లాలన అర్థమయిన వాళ్ళు ఎవరూ నవ్వరు.

లలితకు ఆ ఇంట్లో వున్నంతసేపు తన స్వంత ఇంట్లో తన భర్తతో ఉన్నంత అనుభూతి కలిగింది. ఆ ఇంట్లో ఉన్న ప్రతి వస్తువూ తనదే అన్నట్టు అనిపించింది. అక్కడున్నంత సేపూ ఏదో తెలియని సంతోషం, తృప్తితో లలిత మనస్సు నిండిపోయింది. అక్కడనుంచి కదలాలనిపించలేదు.

వాణీ బలవంతంవల్ల ఆ రాత్రి అక్కడే భోంచేసి, చాలా ప్రొద్దుపోయిం తర్వాత, ఇంటికి వెళ్ళింది లలిత.

# 27

ఆ రోజు రాజేష్ పుట్టినరోజు. అందువలన ఆఫీసుకు శెలవుపెట్టి, లలిత దగ్గరకు వచ్చాడు. రాజేష్ ఎద్దన్నా వినిపించుకోకుండా రాజేష్‌ను తీసుకుని తన కారులో జ్యూయలరీ షాపుకు వెళ్ళింది లలిత రాజేష్‌కు ఉంగరం కొని, తన చేత్తో పుట్టినరోజు కానుకగా రాజేష్ వేలికి తొడగాలని లలిత కోరిక.

భర్త పుట్టినరోజని, భర్త కిష్టమయిన వంటకాలన్నీ చేసింది వాణి. లలితకు వంటాలంటే ఆరోజు పనిమనిషి రాలేదు. తయారుచేసిన వంటకాలన్నీ క్యారేజీలో సర్దుకుని తన రిక్షాలో లలిత దగ్గరకు బయలుదేరింది వాణి.

లలిత రాజేష్‌తో జ్యూయలరీషాపుకు వెళ్ళటం, వాణి నర్సింగ్ హోం ముందు రిక్షా దిగటం రెండు నిముషాల తేడాతో జరిగింది.

వాణి చనువుగా లలితా వాళ్ళింట్లోకి వెళ్ళింది. లలితెక్కడా కనుపించకపోయేసరికి తను తెచ్చిన క్యారేజి డైనింగ్ టేబులుమీదపెట్టి వరండాలోకి వచ్చింది.

వార్డువైపు వెళ్ళబోతున్న స్టాఫ్‌నర్స్ వాణిని చూసి గుర్తుపట్టి వాణి దగ్గరకు వచ్చింది.

“ఏమిటి ఇలా వచ్చారు? వంట్లో బాగలేదా?” చనువుగా వాణి చేయి పట్టుకుంటూ అంది స్టాఫ్‌నర్స్.

"ఈరోజు మావారి పుట్టినరోజు. లలితను భోజనానికి రమ్మన్నాను, తీరలేదనో. కాన్పుకేసు వచ్చిందనో చెప్పి తప్పించుకుంటుంది. అందుకని చేసిన వంటకాలన్నీ క్యారేజిలో పెట్టుకుని నేనే తీసుకువచ్చాను."

"ఎంత అమాయకురాలివి నువ్వు!"

"ఏమిటి సిస్టర్ మీరనేది!" ఆశ్చర్యంగా అడిగింది వాణి.

"అయినా మీ పెద్దవాళ్ళ వ్యవహారం మాకెందుకులే. మేమేదో మంచిచేయాలని కల్పించుకున్నా చివరకు మీరూ, మీరూ ఒకటవుతారు. మధ్యన మా ఉద్యోగాలు వూడిపోతాయి."

"చెప్పేదేదో సూటిగా చెప్పండి సిస్టర్" అంది వాణి విసుగ్గా.

"ఏమని చెప్పాలో, ఎలా చెప్పాలోకూడా నాకర్థం కావటం లేదు. మీవార్ని తీసుకుని సరదాగా తిరగటానికి డాక్టరమ్మగారు కారులో వెళ్ళారు. నువ్వేమో ఆవిడగారి కోసం పిండివంటలు వండుకుని తీసుకువచ్చావు."

"సిస్టర్ ఏమిటి మీరనేది!" మాటలు కూడదీసుకుంటూ అడిగింది వాణి.

"నిజంగా ఈ విషయాలన్నీ మీకు తెలియకనే అనుగుతున్నారా?"

వూడిపోతుంది. ఇకనైనా నీ భర్తను సీదారికి తెచ్చుకో. లేకపోతే నీ సంసారం నాశనమయిపోతుంది. చేతులు కాలింతర్వాత ఆకులు పట్టుకున్నా ప్రయోజనం ఉండదు. ఈ రోజు నుంచే జాగ్రత్తపడు. నీ భర్తను ఇల్లు కదలనీయకుండా చేసుకో. డాక్టరమ్మగారు వచ్చే టయిమయింది. ఇంటికి వెళ్ళమ్మా" తొందరచేస్తూ అంది నర్స్.

వాణీకి కూడా అక్కడ ఒక్క నిముషం నిలబడ బుద్ధి కాలేదు. గేటు దాటి బయటకు వచ్చి రిక్షాలో కూర్చుంది.

వాణీ వెళ్ళిపోగానే హమ్మయ్య అనుకుని తేలికగా నిట్టూర్చింది నర్స్.

స్టాప్‌నర్స్‌కి డాక్టరు లలితమీద అంత ద్వేషం పెరగటానికి కారణం ఉంది. నర్సుకు భర్త ఉన్నా కాంపౌండరు రాంబాబుతో రహస్య సంబంధం పెట్టుకుంది. ఒకరోజు ఇద్దరూ లలిత కళ్ళబడటంతో నర్సును లలిత మందలించింది. భర్త ఉండగా అటువంటి సంబంధాలు పెట్టుకోవటం తప్పని బుద్ధి చెప్పటమే కాకుండా వారంరోజులు తిరగకముందే, కాంపౌండరు రాంబాబును ఉద్యోగంలోనుంచి తొలగించింది. అంతకుముందు రోజంతా ఖాళీ టయములో రాంబాబుతో కబుర్లు చెబుతూ గడిపేది.

రాంబాబు వెళ్ళిపోయిం తర్వాత అతను లేని ఆ నర్సింగ్‌హోంలో ఉద్యోగం చెయ్యటం స్టాప్‌నర్సుకు కష్టంగా ఉన్నా బ్రతుకు తెరువుకోసం లలిత దగ్గర స్టాప్‌నర్సుగా పని చెయ్యక తప్పలేదు.

అప్పటినుంచి లలితమీద రోజు రోజుకూ ద్వేషం పెరిగిపోతుంది నర్సు మనస్సులో. తనకు బుద్ధి చెప్పిన డాక్టరమ్మ, పెళ్ళి అయిన మగాడితో ఎలా కలుకుతుందో! కోడలికి బుద్ధి చెప్పి అత్త తెడ్డు నాకినట్టుగా, తన రాంబాబును తనకు దూరం చేసిన, డాక్టరమ్మ ఎలా సుఖపడుతుందో నేనూ చూస్తాను. అన్న ప్రతీకారంతో సమయం కోసం ఇంతకాలం ఎదురుచూసింది. లలిత దురదృష్టంకొద్దీ ఈనాడు దొరికిన అవకాశాన్ని బాగా వుపయోగించుకుంది నర్సు.

ఇలాంటిపనులు స్టాప్‌నర్సు చేస్తుందని ఊహించని లలిత నర్సు ఎదురుగా ఉన్నప్పుడుకూడా రాజేష్ మామూలుగా మాట్లాడేది.

లలితా, రాజేష్ జ్యూయలరీషాపునుంచి వచ్చారు. నాని వచ్చి క్యారేజి యిచ్చి వెళ్ళిన విషయం వంటమనిషి చెప్పింది లలితకు. ఆరోజు రాజేష్ పుట్టినరోజని, అతనికిష్టమయిన వంటకాలన్నీ తను చేద్దామనుకుంది లలిత.

డైనింగ్ టేబులు దగ్గరకు వెళ్ళి, క్యారేజిమూత తీసి చూసింది. తను చెయ్యాలనుకున్న వంటకాలన్నీ క్యారేజిలో వున్నాయి.

"ఆకలిగా వుందా? డైనింగ్ టేబులు దగ్గరకు వచ్చావు!" నవ్వుతూ అంటూ అక్కడకు వచ్చాడు రాజేష్.

"మీ పుట్టినరోజుకదా, మీకిష్టమయిన వంటకాలన్నీ స్వయంగా తయారుచేద్దామనుకున్నాను. కానీ నాకా అవ్వ

ష్టం లేదు. నేను చేయాలనుకున్న వంటకాలన్నీ వాణీ తయారుచేసి నాకూడా వండించింది. అవే వంటకాలు నేను చేసినా మీరు రెండుచోట్ల ఎలా తింటారు?" దిగులుగా అంది లలిత.

లలిత మాటలకు పెద్దగా నవ్వాడు రాజేష్.

"ఎందుకలా నవ్వుతారు?"

"నీ మాటలు వింటుంటే కార్తీకదీపం సినిమాలోని హీరో పడిన అవస్థ గుర్తుకు వస్తుంది. పాపం ఇద్దరు భార్యల మధ్య ఎంత నలిగిపోతాడో! అతని తృప్తిపరచాలని ఇద్దరూ అతని కిష్టమయిన వంటకాలు చేసి బలవంతంగా తినిపిస్తారు. పాపం ఆఫీసుకు వచ్చిన దగ్గర్నుంచీ తిన్నది అరగక బాధపడతాడు. ఆ సన్నివేశం గుర్తుకువచ్చి నవ్వు వచ్చింది." హాస్యంగా నవ్వుతూ అన్నాడు రాజేష్.

"నేను ఏడుస్తుంటే మీకు నవ్వు వస్తుంది" లలిత ఉక్రోషంగా అంది.

"నిన్ను చూసి కాదు లలితా! నేను నవ్వేది. ఆ సన్నివేశం గుర్తుకువచ్చి నవ్వొచ్చింది అంతే. నువ్వేం బాధపడనక్కర్లేదు. నేను నీతోబాటే భోంచేస్తాను."

"వద్దండీ. పాపం, మీకోసం ఇన్ని రకాల వంటకాలు చేసుకుని వాణీ మీకోసం ఎదురుచూస్తుంటుంది. తనను బాధపెట్టటం ఎందుకు! ఇంటిదగ్గరే భోంచెయ్యండి."

"రెండుచోట్లా కొద్దికొద్దిగా భోంచేస్తాను."

"అలా వద్దు. ఈ పూట ఇంటిదగ్గరే వాణీతో కలిసి భోంచేయాలి మీరు."

నీమాట నేను వినాలనుకుంటే నువ్వుకూడా నామాట వినాలి."

"మీ మాట నేనెప్పుడు వినలేదు?"

"ఎప్పుడో విషయం వదిలేయి. ఇప్పుడు సంగతి చెప్పు.

"వింటాను చెప్పండి."

"నేను ఇంటి దగ్గరే భోంచేస్తాను ఈ రోజు నాపుట్టిన రోజు కదా! అందుకని ఈ రోజంతా నువ్వు నాతో ఉండాలి. సాయంత్రం ముగ్గురం కలిసి పిక్చర్‌కు వెళదాం. తర్వాత నాతోబాటు నువ్వు కూడా భోంచేసి, నీకిష్టమయితే మా ఇంట్లో నిద్రపో. లేకపోతే కారులో ఇక్కడకు వద్దువుగాని."

"మీ మాటకు ఎదురుందా?" నవ్వుతూ అందిలలిత.

"అవసరమయిన మాట మాత్రంవినవు." లలిత కళ్ళలోకి ఏదో వెతుకుతున్నట్టుగా చూస్తూ అన్నాడు రాజేష్.

ఆ చూపులకు అర్థం తెలుసుకున్న లలిత మాట మారుస్తూ "ఏమండీ! మీరు ఇంటికి వెళ్ళండి. మీరు ఎదురుగా ఉంటే, నేను ఏపనీ చెయ్యలేను. ఒక్కగంటలో హాస్పటల్ పనంతా ముగించుకుని, మిగతా పనులు స్టాఫ్ నర్స్‌కి అప్పగించి మీ ఇంటికి వస్తాను."

"అప్పుడే వెళ్ళమంటావా!"

"అబ్బ. అలా దిగులుగా మాట్లాడకండి."

"నీ దగ్గరున్నంచి, ఇంటికి వెళ్ళాలంటే దిగులుగానే ఉంది మరి ఏం చెయ్యమంటావు?"

"తప్పదుగా మరి."

"నువ్వు గంటలో రావాలి."

"గంటలో ఎలా వీలవుతుందండీ? మధ్యాన్నం మూడు గంటలకు వస్తాను."

"ఒక్క నిముషం కూడా ఆలస్యం చెయ్యకూడదు."

"మీరు కావాలని, మాటలు పెంచుతూ ఆలస్యం చేస్తున్నారు మీరు ఇంతసేపూ నేను పని చెయ్యలేను. మీరు త్వరగా వెళితే త్వరగా నా పని ముగించుకుని, మీ ఇంటికి వస్తాను."

"లలితా! అనవసరమయిన విషయాలన్ని గుర్తుంటాయి నీకు. అవసరమయిన విషయం మాత్రం గుర్తుండదు. రెండు గంటలసేపు జ్యూయలరీ షాపులన్నీ తిరిగి, తిరిగి వెయ్యి రూపాయలు పెట్టి ఉంగరం కొన్నావు. నా చేత్తో మీ వేలికి తొడుగుతానండీ అంటూ నన్ను చూడను కూడా చూడనివ్వలేదు."

"ఆ విషయం మరిచిపోయాను. ఉండండి, ఇప్పుడే మీ వేలికి పెడతాను." అంటూ హ్యాండ్ బ్యాగ్‌లో నుంచి అట్టపెట్టె తీసి, అందులో నుంచి ముత్యాలు, కెంపులు పొదిగిన ఉంగరాన్ని తీసి రాజేష్‌కు వేలికి తొడిగింది లలిత.

లలిత చేతిని అందుకుని, తన పెదవులకు అద్దుకున్నాడు రాజేష్.

లలిత రాజేష్ పాదాలకు నమస్కరించింది.

"ఏమని ఆశీర్వదించమంటావు లలితా!" వేదనగా అడిగాడు రాజేష్.

"జీవితం అంతా ఇలా మీ నీడలో బ్రతకగలిగే అదృష్టం చాలండీ నాకు ఆలానే ఆశీర్వదించండి."

లలితను గుండెలకు అదుముకుని, ఆమె నుదుటిమీద సున్నితంగా ముద్దు పెట్టుకుని వదిలేసాడు రాజేష్.

"ఇక వెళ్ళండి."

"నువ్వెందుకు వెళ్ళమని తొందర చేస్తున్నావో నాకు తెల్సు. నీ ఎదురుగా ఉంటే, నేను తొందర పడతానేమో అని నీ భయం, లలితా! నీకు చివరిసారిగా చెబుతున్నాను. నిన్ను నా గుండెలలో దాచుకుని మూగగా ఆరాధిస్తాను. నా ప్రేమకు గుర్తుగా నిన్ను ముద్దు పెట్టుకుంటాను. అంత వరకే. నీ ఇష్టం లేకుండా, ఎప్పుడూ నిన్ను నా స్వంతం చేసుకోను."

"నీమీద ప్రమాణం చేసి చెబుతున్నాను. నీకుగా నువ్వు నా జీవితంలోకి ప్రవేశించిన రోజునే, నిన్ను భార్యగా అంగీకరించి నీతో శారీరక సుఖాలు పంచుకుంటాను. నీఇష్టం లేకుండా, ఎప్పుడూ నేనేదీ చెయ్యను."

"నేను అందుకు భయపడటం లేదండీ మీరు వెళితే, త్వరగా ఇక్కడ పని ముగించుకుని, మీ ఇంటికి వచ్చి మీతో గడపాలని నా ఉద్దేశ్యం."

"సరే. వెళుతున్నా" అంటూ, రాజేష్ వెళ్ళిపోయాడు. తన పనిలో మునిగిపోయింది లలిత.

# 28

రాజేష్ ఇ టికొచ్చేసరికి, రోజులా వాణి గుమ్మం లోనే కనుపించలేదు. బాత్ రూముకు వెళ్ళి ముఖం కడుక్కుని, బట్టలు మార్చుకోవటానికి బెడ్ రూములో కెళ్ళాడు. కిటికీ దగ్గరగా, కుర్చీ వేసుకుని, కిటికీలోనుంచి బయటకు చూస్తూ కూర్చుంది వాణి

రాజేష్ గదిలోకి వచ్చిన అలికిడికి, గుమ్మంవైపు తిరిగిన వాణిని చూసి ఆశ్చర్యపోవటం రాజేష్ వంతు అయింది.

చాలాసేపటి నుంచి, ఏడుస్తున్నట్టుగా కళ్ళు ఎర్రగా ఉబ్బి ఉన్నాయి. ఇంకా తడి ఆరని కళ్ళలో కన్నీటి చుక్కలు ముత్యాల్లా నిలిచి ఉన్నాయి. వాణిని చూస్తూ గుమ్మంలోనే నిల్చున్నాడు రాజేష్.

"వాణి! ఎందుకలా ఉన్నావు?"

"ఇప్పుడెక్కడి నుంచి వస్తున్నారు!

"ఎక్కడనుంచి వస్తాను. ఆఫీసునుంచి."

"ఏమండీ! మీరు రంగస్థల నటులయితే, ఎంతో బాగా రాణించేవారు. ఏ పాత్రనయినా రక్తి కట్టించడం ఏ కొద్ది మంది నటులకో మాత్రమే సాధ్యం అవుతుంది. మీరివ్వాళ ఆఫీసునుంచి వస్తున్నారా?"

"వాణీ! ఏమిటా మాటలు? నీకేమయినా మతి పోయిందా?"

"మీ దయవల్ల ఇంకా పోలేదండీ. మతిపోయినా బాగుండేది. అప్పుడు మీరెలా ప్రవర్తించినా, నాకు తెలిసేదే కాదు, ఏ బాధా ఉండేదికాదు."

"ఇంతకీ ఏం జరిగిందీ? ఎందుకా ఏడుపు?"

"ఏడుపుకాక, నా మొఖానికి ఇంకేం రాసిపెట్టిఉందండి ఎంతకాలం నన్నిలా మోసం చేస్తారండి మిమ్మల్ని అతిగా ప్రేమిస్తున్నందుకా నాకీలాంటి శిక్ష? మిమ్మల్ని నా సర్వస్వంగా నమ్ముకున్నందుకా నన్నింత దారుణంగా మోసం చేస్తున్నారు? నేను మీకేం తక్కువ చేసానండీ? ఏనాడయినా నాకది కావాలని అడిగానా? చీరలూ, నగలూ తెమ్మని మిమ్మల్ని వేధించానా? ఇన్ని సంవత్సరాలలో మీ మాటకు ఎప్పుడయినా ఎదురు చెప్పానా? మీరు ప్రేమగా పిలిస్తే దగ్గరకు వస్తున్నాను మీరు కసురుకుంటే మీ కాళ్ళ దగ్గర పడుంటున్నాను."

"అందుకేనా నాకీలాంటి శిక్ష విధించారు?" ఏడుస్తూ అడిగింది వాణి.

"చెప్పిఅన్నా ఏమవు ఏడ్చి అయినా చెప్పు." అన్నాడు రాజేష్ విసుగ్గా.

"మీరిప్పటివరకూ లలితతో కల్సి కారులో తిరిగారు కదూ? పిల్లి పాలుతాగుతూ తనను ఎవరూ చూడలేదనుకుంటుందట. మిమ్మల్ని గురించి బయటవాళ్ళకు తెలిసినా, ఇంతవరకూ నాకు మాత్రం తెలియలేదు. మీరు రోజూ, ఇంటికి ఆలస్యంగా వస్తూ ఆఫీసులో పనుందనీ, బజారులో స్నేహితుడు కనిపించాడనీ చెప్పేవన్నీ అబద్ధాలు. మీరు రోజూ ఆఫీసు అయిపోగానే లలితను కలుసుకోవటానికి, నర్సింగ్ హోముకు వెళుతున్నారు. అంతేకాదు. ప్రతి ఆదివారం, మీ సాంకేతిక స్థలంలో కలుసుకుంటున్నారు మీరిద్దరూ అవునా?"

వాణిమాటల్ని బట్టి, లలిత విషయమంతా వాణికి తెలిసిపోయిందని అర్థం చేసుకున్నాడు రాజేష్. ఇంతవరకూ వచ్చింతర్వాత, అబద్ధాలు చెప్పి తాత్కాలికంగా వాణికి నచ్చజెప్పినా మళ్ళీ ఏదో ఒకరోజు ఈ అగ్నిగోళం బ్రద్దలవ్వక తప్పదు. అందుకే అసలు విషయం అంతా వాణికి చెప్పటమే మంచిదన్న నిర్ణయానికి వచ్చాడు. ఎలా చెప్పటమా అని ఆలోచిస్తూ మవునంగా నిల్చున్నాడు.

"మాట్లాడరేమండీ? ఏం ఎందుకలా బిగుసుకుపోయారు? నిజం నాకు తెలిసిపోయిందనా? లేక ఏ అబద్ధంతో నన్నింకా మోసం చెయ్యాలా అని ఆలోచిస్తున్నారా?"

"వాణీ! అరిచిగొడవ చెయ్యకుండా, నేను చెప్పేది విను. నేను లలితను చిన్నతనం నుంచి ప్రేమించాను. అంటూ మొదలుపెట్టి, తనూ, లలితా రిజిష్టర్ మ్యారేజి చేసుకోవాలనుకోవటం, తను ఉద్యోగం కోసం లలితగాజులు, లలితిచ్చిన డబ్బు తీసుకుని హైదరాబాదు వెళ్ళటం, ఉద్యోగ ప్రయత్నంలో నెలరోజులు రావటానికి వీలుకాక ఆగిపోవటం ఆ సమయంలో లలిత నాన్నగారు లలిత పెళ్ళి లలిత బావ గిరితో లలితకు తెలియకుండా ముహూర్తం పెట్టించడం, ఒక రోజు రాత్రి గిరి, లలిత శీలాన్ని దోచుకోవట శీలాన్ని పోగొట్టుకున్న లలిత అన్నలు విషయం దాచి, తనతో పెళ్ళికి అంగీకరించకుండా, తనకు అసహ్యించుకోవటం, ఆ ద్వేషంతో తను వాణిని పెళ్ళి చేసుకోవటం, ఆ తర్వాత లలిత మెడిసన్ చదవటం, గిరి యాక్సిడెంటులో పోవటం, లలిత తల్లిదండ్రుల మీద ద్వేషంతో వాళ్ళతో కలిసి ఉండలేక విజయవాడలో ప్రాక్టీసు పెట్టటం, వాణికి జ్వరం వచ్చినప్పుడు వాణిని, ఇల్లుగలావిడ కమలా విజయా నర్సింగ్ హోముకు తీసుకెళ్ళటం అప్పుడే ఎనిమిది సంవత్సరాల తర్వాత లలితను తను మొదటిసారిగా చూడటం, తనకోసమే, లలిత పెళ్ళి మానుకుని, తన జీవితానిన త్యాగం చెయ్యటం వరకూ ఒక్కవిషయం కూడా వదిలిపెట్టకుండా పూర్తిగా చెప్పాడు.

వింటూ చైతన్యం లేని బొమ్మలా కూర్చుంది వాణి. ఆలోచించటానికి కూడా శక్తిలేనట్టుగా మనస్సు

ముద్దుబారిపోయింది. తన భర్త మనస్సులో తనకు చోటు లేదన్న నిజం తెలిసినతర్వాత, భవిష్యత్తును గురించి ఆలోచించటానికే భయంగా ఉంది వాణికి.

ఉన్మాదిలా కూర్చున్న వాణిని చూస్తూ, ఈ షాక్ భరించలేక, వాణికి మతిచలించదు కదా! అని భయపడ్డాడు రాజేష్.

"వాణీ! అనాథగా బ్రతకవలసిన నన్ను ఆదరించి కన్నబిడ్డకంటే ఎక్కువగా ప్రేమించే, నన్నీస్థితికి తెచ్చిన నా పాలిట దేముడు మామయ్య. ఆయనమీద ప్రమాణం చేసి చెబుతున్నాను. లలితకూ, నాకూ నువ్వు ఊహించే సంబంధం లేదు. మేమిద్దరం ప్రేమించుకున్నాం నిజమే. మా ప్రేమ మానసికమయినది. మా ప్రేమలో కోరికలకు తావు లేదు. లలిత జీవితం ఇలా మోడుగా మారటానికి కారణం నేను. నా మీద లలిత పెంచుకున్న ప్రేమ, లలితపాలిట శాపం అయింది."

నా ప్రేమజ్వాలే, లలిత జీవితంలోని సుఖాన్నీ సంతోషాన్నీ దహించివేసింది. నాకోసం తన జీవితాన్నే అర్పించిన ప్రేమమూర్తి లలిత. నన్ను ఒక్కగానొక్క కోరిక కోరికంది. అదే రోజూ నన్ను ఒక్కసారి తనకు కన్పించి వెళ్ళమంది. ఆ తృప్తితోనే జీవితం అంతా గడుపుతానంది. అటువంటి ప్రేమమూర్తి కోరిన ఒక్కగానొక్క కోరికను తీర్చటం నా ధర్మం కాదా? ఇందులో నీకు జరిగే అన్యాయం ఏమీలేదు. ఈ నిజాన్ని ఇంతకాలం నీకు చెప్పకుండా దాచాను. ఎం

దుకో తెలుసా! ఒక నిజాన్ని చెప్పి, ఒక నిండుజీవితాన్ని నాశనం చేసేకంటే, ఒకటి రెండు అబద్ధాలు చెప్పి ఊరట కలిగించటం మంచిదనుకున్నాను. అందుకే లలిత దగ్గరకు వెళ్ళానన్న నిజం నీకు చెప్పకుండా, రోజూ ఏదో ఒకటి చెప్పేవాడిని. అబద్ధాలు చెప్పలేక విసిగిపోయినరోజున నిన్ను కసురుకునే వాడిని వాణీ! ఇప్పుడు చెప్పు. నిన్ను నేనేం మోసం చేసాను? నీకేం అన్యాయం చేసాను?"

భర్త అడుగుతున్న ప్రశ్నలకు సమాధానం చెప్పలేక పోతుంది వాణి. లలిత స్నేహంలో తనను ఎలా మోసం చెయ్యగలిగిందా అని ఆలోచిస్తుంది. బట్టలు మార్చుకోకుండా అక్కడున్న సోఫాలో కూర్చున్నాడు రాజేష్.

నిముషాలు, గంటలుగా మారిపోతున్నాయి. వాణీ, రాజేష్ ఇద్దరూ బొమ్మల్లా అలాగే కూర్చున్నారు. ఇద్దరూ భోంచెయ్యలేదు. మూడుగంటలయింది. చెప్పిన టయము ప్రకారము లలిత వచ్చింది.

లలిత కారుదిగి లోపలకు రావటం, రాజేష్ వాణి కిటికీలోంచి చూస్తూనే ఉన్నారు. ఆ సమయంలో తనులేచి లలితదగ్గరకు వెళితే వాణి మరీ అపార్థం చేసుకుంటుందని రాజేష్ అలాగే కూర్చున్నాడు.

వాణికళ్ళకు లలిత ఇప్పుడు స్నేహితురాలులా కనిపించటంలేదు. తన సర్వస్వాన్ని దోచుకుంటున్న దొంగగా, శత్రువులా కనిపిస్తుంది. లలిత కనిపించగానే వాణి గుండెల్లో రగులుతున్న జ్వాల మరింత అధికమయింది.

లలిత వాణికోసం వెతుక్కుంటూ ఎక్కడా కనిపించక పోయేసరికి బెడ్‌రూములోకి వచ్చింది. లలితను చూసికూడా చూడనట్టుగా ముఖం తిప్పుకుంది. వాణి ప్రవర్తనకు లలిత ఆశ్చర్యపోయింది. ఇద్దరి ముఖాలలోకి మార్చి, మార్చి చూస్తూ నిల్చుంది.

"కూర్చో లలితా!" అన్నాడు రాజేష్.

"వాణి అలా ఉందేమిటి?" ఆ షాక్‌నుంచి తేరు కుంటూ రాజేష్‌ను అడిగింది లలిత.

"బాగానే ఉంది." కటువుగా అన్నాడు రాజేష్.

ఇద్దరూ మళ్ళీ గొడవ పడ్డారేమో, అందుకే అలా ఉన్నారు అనుకుంది లలిత.

"చిన్నపిల్లల్లా రోజూ కీచులాడుకోవటమేనా? మళ్ళీ ఎందుకు గొడవపడ్డారు? అసలు భోంచేశారా ఇద్దరూ?" ప్రేమగా మందలిస్తూ అంది లలిత.

"నా మీద చాలా ప్రేమనుకుంటాను నీకు." వ్యంగ్యంగా అంది వాణి.

"ప్రేమలేకుండా ఎలా ఉంటుంది? అదిసరే. భోంచేశారా? ఈ రోజు మీవారి పుట్టినరోజు. ఇద్దరూ సరదాగా ఉండాలిగానీ, అలా ఎడముఖం, పెడముఖంగా ఉంటే ఎలా? నేనుకూడా ఈ రోజంతా మీతో సరదాగా గడపాలని వచ్చాను. నాకోసం అయినా మీకోపాన్ని మానిచిపోయి, మీరిద్దరూ సరదాగా ఉండండి."

"ఇప్పటివరకూ, ఆయనతో కల్సిచేసిన షికార్లు చాల

లేదా? మళ్ళీ ఇంటికివచ్చికూడా వచ్చావు?" లలితవైపు నిప్పులుకురిసే కళ్ళతో చూస్తూ కటువుగా అంది వాణి

ఆ మాట బాకులా లలిత గుండెను చీల్చింది. ఏం మాట్లాడాలో కూడా అర్థం కాలేదు లలితకు.

"వాణీ! ఇంటికి వచ్చిన స్నేహితురాల్ని అలాగేనా మాట్లాడేది?" మందలింపుగా అన్నాడు రాజేష్.

"ఓహో! మీకు కోపం వచ్చిందా? అవును. ఎందుకు రాదు? మీ ప్రియురాలు కదూ!"

"వాణీ! ఏం జరిగింది?" అయోమయంగా వాణివైపు రాజేష్‌వైపు చూస్తూ అడిగింది లలిత.

"పాపం. ఎంత అమాయకురాలు. ఏం తెలియదు" అంది వాణి కటువుగా.

"ఏం జరగలేదు. ఏదో జరుగుతుందని ఆవిడ గారి భయం" అన్నాడు రాజేష్ కోపంగా.

"ఇంతకంటే ఇంకా ఏం జరగాలండీ? మీరిద్దరూ ఆడుతున్న నాటకం నాకు తెలియదనుకుంటున్నారా?"

"వాణీ! నోర్మూయ్యి."

"ఇంత కాలంనుంచి నోరుమూసుకుని కూర్చున్నాను కాబట్టే మీ ఆటలు సాగాయి. లలితా! నువ్వు కావాలను కుంటే నీ ఆస్థి, అంతస్థును చూసయినా నిన్ను పెళ్ళి చేసుకోవటానికి ఎంతోమంది మగాళ్ళు నీ ఇంటిముందు క్యూలో నిలబడతారు. నా వచ్చని నంసారంలో నిప్పులు పోయకు.

ఆలుమగల మధ్యవుండే అనురాగం అనుబంధం నీకేం తెల్సు. ఆయన దూరం అయితే నేను బ్రతకలేను. మావారిని మాత్రం నాకు దూరం చెయ్యకు."

"వాణీ! నువ్వు అపార్థం చేసుకుంటున్నావు నన్ను. మీవారికీ నిన్నెవ్వరూ దూరం చెయ్యను. నేనంత స్వార్థపరురాల్ని కాదు."

"ఎంత తీయగా మాట్లాడుతున్నావు. ఆయన్ని గంటల తలబడి నీ ఎదురుగా కూర్చోబెట్టుకోవటం ఆయనతో సినిమాలకూ, షికార్లకూ తిరగటం ఇవన్నీ ఆయన్నీ ఆయన్ను నాకు దూరం చెయ్యటం కాదా? నీ దృష్టిలో ఇవి ఆయన్ని నాకు దగ్గరచేసే పనులా?" వ్యంగ్యంగా అడిగింది వాణి.

"వాణీ! నేను నీకంటే ముందునుంచీ రాజేష్‌ను ప్రేమించాను. ఇప్పటికీ ప్రేమిస్తున్నాను. ప్రేమను గురించి నాకు తెల్సు కాబట్టే, నువ్వు రాజేష్‌ను ఎంతగా ప్రేమిస్తున్నావో అర్థం చేసుకోగలిగాను. అందుకే నిన్ను రాజేష్ నుంచి దూరం చెయ్యలేకపోయాను."

"కత్తులతో మనుష్యులను కోసి చూసే నీకు మనస్సులూ, మమతలూ కూడా అర్థమవుతాయా?"

"మనుష్యులను కత్తులతో కోసిచూసే డాక్టరు మనిషి బాధను తొలగిస్తాడు గాని, బాధకు గురిచెయ్యడు."

"నువ్వు చాలా తెలివయినదానివి నీ తెలివితేటలతో ఏమైనా చెయ్యగలవు ఎలాగయినా సమర్థించుకోగలవు" పిచ్చిదానిలా అరుస్తూ అంది వాణి.

"చెప్పేది వినిపించుకోకుండా ఎందుకలా గొంతు చించుకుని అరుస్తావు?" కోపంగా అన్నాడు రాజేష్.

ఈవిడలాగా ఆకర్షణీయంగా మాట్లాడటం వచ్చని సంసారాలు పాడు చెయ్యటం నాకెలా చేతనవుతుంది? నేను సంసారం చేసుకునే ఆడదాన్ని. చూడు లలితా! ఇప్పటి వరకూ నువ్వు నాకు చేసిన మహోపకారం చాలు. దయచేసి ఇక ఇక్కడనుంచి వెళ్ళు. అంతేకాదు. మళ్ళీ మా ఇంటిగడప తొక్కకు."

"వాణీ! నేను నీకంటే ముందునుంచీ రాజేష్‌ను ప్రేమిస్తున్నాను. వాణీ! నీ ఇష్టమొచ్చినట్టు మాట్లాడకు. నేను తలుచుకుంటే ఏనాడో రాజేష్‌ను నావాడిని చేసుకోగలిగేదాన్ని. మనస్సునిండా అతనిపట్ల ప్రేమపొంగులు వారుతున్నా, నువ్వు నా చిన్ననాటి స్నేహితురాలివి కాబట్టి, నీ కన్యాయం చెయ్యలేక రాజేష్‌కు దూరంగా వున్నాను కానీ, అతనిమీద ప్రేమలేక కాదు. ఎంతసేపూ నీ ధోరణి నీదేగాని ఎదుటివాళ్ళు చెప్పేది వినిపించుకోవేం?"

"నేను విన్నంతవరకూ చాలు. ఇంకా నా సాహసాన్ని పరీక్ష చెయ్యకు. ముందిక్కడనుంచి వెళ్ళు."

"వాణీ! నేను, నిన్ను ఇంతగా ప్రాధేయపడేది నా నిర్దోషిత్వాన్ని నిరూపించుకోవటానికి కాదు. నీ మనస్సులో వున్న అనుమానబీజాన్ని తొలగించాలని. మనస్సులో అనుమాన బీజం మొలకెత్తకుండానే వుండాలి, మొలకెత్తిం

తర్వాత, అది మనస్సంతా వ్యాపించి మరో ఆలోచనకు చోటు లేకుండా చేస్తుంది వాణీ! మానసికమయిన అనుబంధం తప్ప, మామధ్య ఎలాంటి సంబంధం లేదు."

"మానసికమయిన సంబంధం వేరు. శారీరక సంబంధం వేరానా!"

"ఆ రెండింటికీ తేడాను అర్థంచేసుకోగలిగితే నువ్విలా మాట్లాడవు."

"అవునా యేం. నాకేం తెలుసు! నీలా పెద్దచదువులు చదివినదాన్నా! నేను!" అంది వాణి కటువుగా.

"వాణీ! ఒక్క నిముషం ప్రశాంతంగా ఆలోచించు. నీకోసం నేనెంత త్యాగం చేసానో నీకే అర్థమవుతుంది. నేను కత్తులతో మనుష్యులను కోసేదాన్ని అని అన్నావు వాణీ! నాకూ మనస్సూ, మమతా వుంది కాబట్టె రాజేష్ నీకు దక్కాడు. నా గుండెల్లో ఎన్ని అగ్నిగోళాలున్నాయో నీకు తెలియదు వాణీ. నేను సమాజంలో ఒక అంతస్థులో వున్న మనిషిని. నలుగురికోసమయినా నేను నవ్వుతూ వుండాలి.

"వాణీ! స్పృహలేని స్థితిలో నువ్వు నా హాస్పటల్‌కు వచ్చావు. రాజేష్‌ను నా స్వంతం చేసుకోవాలన్న దురాశే నాలో ఉంటే, నీకు ట్రీట్‌మెంటు ఇచ్చేదాన్నే కాదు. ప్రమాదకరమయిన స్థితిలో వున్నావు. నేను తలచుకుంటే డాక్టరుగా నీ ప్రాణాలు తీయటం చాలా సులభం. అది హత్య అనికూడా ఎవరికీ అనుమానం రాదు. నిన్ను చంపి,

రాజేష్ను ఎందుకు స్వంతం చేసుకోలేకపోయాను! ఆలో చించు. స్నేహితురాలిగా నీకన్యాయం చెయ్యకూడదనీ నేను ప్రేమించిన రాజేష్ భార్యగా, నువ్వు బ్రతకాలనీ నిన్ను కంటిపాపలా కాపాడాను. నా మనస్సు, నాలోని మాన వత్వమే నిన్ను బ్రతికించాయి. పెళ్ళి అయిన రాజేష్ను ప్రేమించటం తప్పని నాకు తెలుసు. అయినా నా మనస్సు నా మాట వినదు. రాత్రి అయ్యేసరికి అందరు ఆడవాళ్ళు తమ భర్తలకోసం ఎదురుచూస్తారు. నేనెవరికోసం ఎదురు చూడాలి?

“అందుకేనమ్మా. రోజుకు ఒక్కసారి రాజేష్ను కని పించి వెళ్ళమని ప్రాధేయపడ్డాను. అది నా తప్పు అయితే నన్ను క్షమించు. రాజేష్ బయట తిరుగుతున్నాడన్న అను మానంతో నువ్వు అనుక్షణం అతన్ని అనుమానిస్తూ మన శ్శాంతి లేకుండా చేస్తున్నావు అతనికి.”

“వాణీ! నీకోసం నేనెంత త్యాగం చేసానో నువ్వు తెలుసుకోలేకపోతున్నావు. నోరులేని పశువులూ పక్షులూ కూడా పవిత్రమయిన మాతృత్వాన్ని పొందాలని ఆరాట పడతాయి. మాతృత్వాన్ని పొందటానికి ఆడది ఏ సాహ సానికయినా వడిగడుతుంది. అటువంటి మాతృత్వాన్నికూడా నీకోసం దూరం చేసుకున్నాను నాకూ ఆస్థి, అంతస్థూ అన్నీ ఉన్నాయి. కానీ నేను చనిపోతే నా కోసం రెండు కన్నీటి చుక్కలు రాల్చేవాళ్ళు ఎవరూ లేరు నాకు.”

"రాజేష్‌లాంటి వ్యక్తిని భర్తగా పొందిన నువ్వు ఎంతో అదృష్టవంతురాలివి. అమృతకలశంలాంటి నీ సంసారాన్ని నువ్వే నాశనం చేసుకున్నావు. నీకు ఇదంతా చెప్పాల్సిన అవసరం నాకు లేదు. అయినా ఎందుకు చెబుతున్నానో తెలుసా? రాజేష్‌ను నీకంటే ఎక్కువగా నీకంటే ఎక్కువగా ప్రేమిస్తున్నాను నేను. ఇదంతా నీతో చెప్పకపోతే అవమానంతో ఇంకా ఎక్కువగా బాధపడతావు. అందుకే ఇంత విపులంగా చెబుతున్నాను."

"వాణీ! నా మూలంగా, నీ మూలంగా రాజేష్ ఎంతటి వేదనను అనుభవిస్తున్నాన్నాడో నీకు తెలియదు. నేను ఎదురుగా ఉన్నంతకాలం తన మూలంగానే నా జీవితం ఇలా మోడు బారిపోయిందన్న బాధతో రాజేష్ నీతో సుఖాన్ని అనుభవించలేదు. నా మూలంగా రాజేష్ బాధపడటం నేను సహించలేను. అందుకే బాగా ఆలోచించి, రాజేష్ కోసం అతను సంతోషంగా ఉండటంకోసం ఈ దేశాన్నే వదిలిపెట్టి వెళ్ళిపోతున్నాను. రాజేష్‌కు ఈ విషయం తెలిస్తే నన్ను వెళ్ళనివ్వడు. నేనిక్కడున్నంత కాలం, నాకోసం రాకా తప్పదు. నువ్వు గొడవ చెయ్యకా మానవు. అందుకే మీకు తెలియకుండా అమెరికా వెళ్ళిపోవటానికి అన్ని ఏర్పాట్లు చేసుకున్నాను. అమెరికాలో నా ఫ్రెండ్ డాక్టర్‌గా పని చేస్తుంది. కొంతకాలం నేను నా ఫ్రెండ్ నర్సింగ్‌హోములోనే పనిచేస్తాను. నేను అమెరికానుంచి ఎప్పుడు వస్తానో నాకే

తెలియదు. ఇంకో వారంరోజుల్లో వెళ్ళిపోతున్నాను. నవ్వుతూ మీరిద్దరూ నన్ను ఆఖరిగా పంపించండి చాలు."

"లలిత చెప్పేవరకూ, లలిత ఆఖరిగా వెళుతుందన్న విషయం రాజేష్ కి తెలియదు. ఇప్పుడు వినగానే అవాక్కయిపోయాడు. అతనికి అంతా అయోమయంగా వుంది. ఏం మాట్లాడటానికి, ఏం ఆలోచించటానికీకూడా శక్తి లేనట్టుగా లలితవైపు చూస్తూ అలాగే కూర్చున్నాడు. ఆ షాక్ నుంచి తేరుకోవటానికి వాడికి చాలాసేపు పట్టింది.

లలిత మాటలు వాణి మనస్సుమీద పనిచేసాయి. లలిత చెప్పిందంతా నిజమేననిపించింది. రాజేష్ ను స్వంతం చేసుకోవాలన్న ఆశ లలితకుంటే నేనుమాత్రం ఏం చెయ్యగలను! లలిత నా పాలిట దేవత కాబట్టే నేను ఆయనకు భార్యగా ఉండగలిగాను. అటువంటి లలితను అర్థం చేసుకోకుండా ఆవేశంలో ఎన్ని మాటలన్నాను! అని మనస్సులో ఎంతో బాధపడింది వాణి.

"లలితా నిన్ను క్షమించమని అడిగే అర్హతకూడా నాకు లేదు. ఆవేశంలో అనరాని మాటలన్నాను. నన్ను క్షమించగలవా?" లలిత దగ్గరకు వచ్చి లలిత చేతిని తన చేతిలోకి తీసుకుంటూ కన్నీటితో అడిగింది వాణి.

"మనలో మనకు క్షమాపణలేమిటి వాణీ! ఇప్పటికయినా నన్ను అర్థం చేసుకున్నావు. నాకంతే చాలు."

"లలితా! నువ్వు మాకు దూరంగా వెళ్ళద్దు. ఇప్పటివరకూ నువ్వు నాకోసం చేసిన త్యాగం చాలు. ఇంకా నీ

త్యాగాన్ని నేను భరించలేను. నువ్వు ఎక్కడకూ వెళ్ళటానికి వీల్లేదు. నువ్వుకూడా మాతోనే ఉండాలి. ఆయన మనస్సులో నీకున్న స్థానం ఎప్పటికీ అలాగే వుంటుంది. నీ ఋణాన్ని ఈ విధంగా నయినా తీర్చుకోనివ్వు లలితా" కన్నీటితో లలిత చేతులు పట్టుకుని ప్రాధేయపడుతూ అంది వాణి.

"ఒక వరలో రెండు కత్తులు ఇమడవు. చెప్పానుగా నా ప్రేమ కోరికలకు అతీతమయిందని. వాణీ! రాజేష్ మనస్సు చాలా సెన్సిటివ్. ఇకనుంచయినా అర్థంలేని అనుమానాలతో అతన్ని బాధపెడుతూ అతనికి మరింత దూరం కావద్దు."

"రాజేష్ వాళ్ళ మాటలు వింటూ బొమ్మలా అలాగే కూర్చున్నాడు.

"నేను వెళుతున్నాను." అంటూ వాళ్ళకు మాట్లాడేందుకు అవకాశం ఇవ్వకుండా గదిలోనుంచి బయటకువచ్చి కారులో వెళ్ళిపోయింది.

లలిత వెనుకే స్కూటరుమీద లలిత దగ్గరకు వచ్చాడు రాజేష్

"లలితా! నువ్వు అమెరికా వెళ్ళేది నిజమేనా?" లలిత భుజాలు పట్టుకుని, లలిత ముఖాన్ని తనవైపుకు తిప్పుకుంటూ అడిగాడు రాజేష్.

"నిజమే."

"ఈ విషయం ఇంతవరకూ నాకెందుకు చెప్పలేదు?"

"చెబితే మీరు వెళ్ళనిస్తారా!"

"అందుకని చెప్పకుండానే వెళ్ళాలనుకున్నావా!"

"నేను ఎక్కడున్నా మీదాన్నే."

"అవును సముద్రంలో నీళ్ళు ఎన్ని ఉన్నా దప్పిక తీర్చలేవు."

"ఈ వారం రోజులూ, నామీద కోపం తెచ్చుకోకండి నను నవ్వుతూ ఉండనివ్వండి."

"నీతో బాటు నేను కూడా అమెరికా వస్తాను."

"మరెందుకు!"

"నువ్వు లేకుండా నేనుండలేను. నీ ప్రాతివత్యానికి భంగం కలగదని చెప్పానుగా! ఇంకా నానుంచి పారిపోవటం ఎందుకు!"

"నేను ఎదురుగా ఉన్నంత కాలం, మీరు సుఖంగా ఉండలేరు."

"లలితా! జీవితం అంతా, నన్నిలా బాధ పెట్టక పోతే, ఒక్కసారిగా నాకింత విషమిచ్చి నీ చేతులతోనే నన్ను చంపేయకూడదూ!"

"ఏమండీ!" పిచ్చిదానిలా అరిచింది లలిత.

"ఇంకెప్పుడూ ఇటువంటి మాటలనకండి. నేను భరించ లేను." అంది లలిత ఏడుస్తూ,

"నువ్వు అమెరికా వెళ్ళిన వెంటనే, మళ్ళీ వస్తావు."

"ఏదో ఒకరోజున తప్పకుండా వస్తాను."

"వెళ్ళిన వెంటనే వస్తావు. ఎందుకో తెలుసా! నా శవాన్ని చివరిసారిగా చూడటానికి."

"ఏమండి! అంతమాట ఎలా అనగలిగారు. అటువంటి ఊహకే నా గుండె బ్రద్దలయి పోతుందండి. నేను అమెరికా వెళ్ళను. ఎప్పుడూ మీ గుండెల్లోనే ఉంటాను. మీ దానిగానే మీతోనే ఉంటాను" అంటూ రాజేష్ గుండెల్లో వదిగిపోయింది లలిత. ఆర్తిగా, అనురాగంగా ఆ క్షణం కరిగిపోతే లలిత తనకు శాశ్వతంగా దూరం అవుతుందేమో అన్నంత భయంగా లలితను గుండెలకు అదుముకున్నాడు రాజేష్,

"ఏమండి! మీరు నూరేళ్ళు బ్రతకాలి. మీ నీడలోనే, మీ ఒడిలోనే నేను రాలిపోవాలి." ఉన్మాదిలా రాజేష్ ముఖాన్ని ముద్దులతో నింపుతూ అంది లలిత.

"నువ్వులేని ఈ లోకంలో, నేను మాత్రం ఉండగలనా!"

"ఒక్కగంట మీ వడిలో పడుకోనివ్వండి."

"లలితా నేను నీ వాడిని. నీ ఇష్టమొచ్చినంత సేపు పడుకో." అంటూ లలితను చంటిపాపను ఎత్తుకున్నట్టుగా, ఎత్తుకుని తీసుకుని వచ్చి బెడ్‌రూములో మంచం మీద పడుకోబెట్టి లలిత పక్కన తనూ చోటు చేసుకుని పడుకున్నాడు రాజేష్.

తన బాధంతా వదిగిపోయి రాజేష్ గుండెల్లో ముఖం దాచుకుంది లలిత. అనురాగంగా లలిత తల నిమురుతూ పడుకున్నాడు రాజేష్.

నిముషాలు గంటలుగా మారిపోతున్నాయి. పగలు గడిచిపోయింది. గదిలో లైటు వేసుకోవాలన్న ధ్యాసకూడా లేదు వాళ్ళిద్దరికీ.

"లలితా! టయము చూడు. అప్పుడే రాత్రి ఎనిమిది గంటలయింది. నువ్వు రెస్టు తీసుకో. నేను వెళతాను."

"అప్పుడే వెళ్ళిపోతారా?"

"తలనెప్పిగా ఉంది. వెళ్ళి స్నానం చేస్తాను"

"ఉదయం నుంచీ, మీరు భోంచెయ్యలేదు కదూ?"

'ఇంకా నాకు భోజనం ఎందుకు?

"నిజంగా నువ్వు నా గుండెల్లో వదిగిపోయావు. ఆ తృప్తితో నా కడుపు నిండిపోయింది." లలితను, మరింతగా తన గుండెలకు అదుముకుంటూ అన్నాడు రాజేష్.

"వెళ్ళి స్నానంచేసి, భోంచెయ్యండి. వాణి ఎంత బాధ పడుతుందో వెళ్ళండి" తొందరచేస్తూ అంది లలిత.

రాజేష్ వెళ్ళిపోయాడు. అతను వెళ్ళి పోయింతర్వాత ఏడుస్తూ పడుకుంది లలిత.

## 29

రాత్రి పదిగంటలు దాటిపోయింది. లలిత ఆలోచిస్తూ అలాగే కూర్చుంది. రాజేష్ మొండితనం, లలితకు చిన్నతనం నుంచీ తెల్సు. అన్నంత పనీ చేస్తాడు.

ఒకవేళ నేను అమెరికా వెళ్ళినా, రాజేష్ మొండితనముతో ఆత్మహత్య చేసుకుంటాడేమో వీల్లేదు. అలా జరగటానికి వీల్లేదు. నేను అమెరికా వెళ్ళను. వెళ్ళక ఇక్కడుండడమెలా? నలుగురూ నన్ను గురించి నాలుగు రకాలుగా చెప్పుకుంటున్నా లెక్క చెయ్యకుండా గడిపాను. ఇప్పుడు వాణికి కూడా తెలిసిపోయింతర్వాత, నేను రాజేష్‌తో చనువుగా ఎలా ఉండగలను? నిజం తెలిసిన తర్వాత రాజేష్ మాత్రం వాణికి అబద్ధం చెప్పి నా దగ్గరకు ఎలా రాగలడు? రాజేష్‌ను చూడకుండా ఇప్పుడు ఒక్కరోజు కూడా ఉండలేకపోతున్నానే. పరిస్థితుల మూలంగా రాజేష్‌కు దూరం కావలసివస్తే నేను బ్రతకగలనా?"

నేను ఒంటరిగా ఉన్నంతకాలం, రాజేష్‌కు మనశ్శాంతి ఉండదు. నేను పోయినా, నేను మనసారా ప్రేమించిన నా రాజేష్ సుఖంగా ఉండాలి. అనుకుంది. ఇలాంటి అంతూ దరీలేని ఆలోచనలతోనే చాలా రాత్రి వరకూ కూర్చుంది.

తర్వాత ఒక నిర్ణయానికి వచ్చిన దానిలా, స్లీపింగ్ టాబ్లెట్సున్న బాటిల్ తెచ్చుకుని, తనేం చేస్తున్నదో తనకే తెలియనట్లు ఉన్మాదిలా, ఒకటి తర్వాత ఒకటిగా, బాటిల్స్‌లోని టాబ్లెట్సు అన్నీ వేసుకుని మంచినీళ్ళు తాగి, బెడ్‌రూములో కెళ్ళి పడుకుంది.

కళ్ళు బరువుగా మూతలు పడిపోతున్నాయి. కళ్ళు తెరిచి చూడాలని ఎంత ప్రయత్నించినా లలితకు సాధ్యం

కావటంలేదు. మాట్లాడటానికి వీల్లేకుండా నాలుక బండబారి పోయినట్లయింది. తనకు తుది గడియలు సమీపించబోతున్నాయనుకుంది.

రాజేష్‌తో చిన్ననాడు ఆడుకున్న ఆటలు, వయస్సు వచ్చిన తర్వాత ఇద్దరూ ప్రేమించుకోవటం, తాను రాజేష్‌కు దూరం కావటం అన్నీ ఒకదాని తర్వాత ఒకటిగా సినిమా రీళ్ళలా తిరిగాయి. లలిత మనస్సులో.

లలిత కళ్ళ ముందుగా రాజేష్ రూపం నిండిపోయింది. చివరిసారిగా రాజేష్ ఒడిలో పడుకోవాలనీ, అతని కళ్ళలోకి చూస్తూ ప్రాణాలు వదలాలనీ లలిత మనస్సు తపించిపోతుంది.

కానీ లలిత కోరుకున్న చివరి కోరిక తీరకుండానే లలిత కళ్ళు శాశ్వతంగా మూతపడ్డాయి.

లక్షల ఆస్తి, సమాజంలో అంతస్తు, డాక్టరుగా సమాజంలో గౌరవం అన్నీ పుష్కలంగా ఉన్న లలిత, ప్రేమ కోసం తపించిపోతూ, చివరకు ప్రేమకోసమే తన ప్రాణాలను అంకితం చేసింది.

మామూలుగానే తెల్లవారిపోయింది. రోజూ ఎనిమిది గంటలకే, మల్లెపూవులా తయారయి చిరునవ్వుతో వార్డులో కొచ్చి పేషెంట్లను పలకరించే డాక్టర్, ఆ రోజు పదిగంటలయినా వార్డుకు రాకపోయేసరికి, పేషెంట్స్ అంతా ఎదురుచూస్తున్నారు.

కన్సల్టింగ్ రూము పక్కనా వరండా అంతా పేషెంట్సుతో నిండిపోయింది.

ఉదయం పదిగంటలయినా, లలిత మేడదిగి రాకపోయే సరికి లలితకు ఒంట్లో బాగలేదేమో అని వంటమామ్మగారు కాఫీ కలిపి ఇవ్వటంతో కాఫీ తీసుకుని లలితను నిద్ర లేపటానికి లలిత బెడ్‌రూములోకి వెళ్ళింది.

లలిత పడుకున్న తీరుచూడగానే, వంటమామ్మగారికి గుండె ఆగినంత పని అయ్యింది.

"అమ్మా లలితా." అంటూ మంచందగ్గరకు వెళ్ళి లలిత చేయిపట్టుకుని చూసింది. చేయి మంచులా చల్లగా ఉంది.

"లలితమ్మా." అంటూ పెద్దగా అరిచింది వంటమామ్మగారు. ఆ కేకకు పనిమనిషి పరుగెత్తుకుంటూ అక్కడకు వచ్చింది. నిముషాలమీద లలిత ఆత్మహత్య చేసుకుందన్న వార్త నిముషాల మీద హాస్పటల్ అంతా పాకిపోయింది.

నర్స్ రాజేష్‌కు ఫోన్‌చేసి, లలిత ఆత్మహత్య చేసుకుందన్న విషయం చెప్పింది. ఆ వార్త వినగానే నృహకోల్పోయాడు రాజేష్ ఫోన్ పక్కగా కుప్పకూలిపోయాడు.

విషయం తెలియని వాణి, ఆ రోజు ఆదివారం కదా. వంటకు తొందరలేదులే అనుకుంటూ తీరికగా వంట చేసుకుంటూ వంటగదిలో ఉంది.

పదినిముషాలకు తేరుకున్న రాజేష్ వెంటనే స్కూటరు మీద నర్సింగ్ హోము దగ్గరకు వచ్చాడు. పరుగెత్తుకుంటూ బెడ్ రూములోకి వెళ్ళాడు.

అచేతనంగా పడున్న లలిత తలను వడిలోకి తీసుకున్నాడు రాజేష్.

"లలితా! ఎందుకిలాంటి పని చేసావు? నువ్వులేని ఈ లోకంలో నేను ఎలా బ్రతకగలనను కున్నావు?"

"నన్ను ఒంటరివాడిని చేసి వెళ్ళిపోయావా లలితా. నా కోసం ఎవరున్నారు? నేనెవరికోసం బ్రతకాలి? నువ్వు నువ్వు దూరమయిన నాడే, నేను ఆత్మహత్య చేసుకునే వాడిని. ఇంతకాలం బ్రతికున్నానంటే, జీవితం మీద ఆశతో కాదు లలితా. బ్రతుకుంటే నిన్ను కళ్ళతో నయినా చూసుకోవచ్చన్న ఆశతో. ఇప్పుడు నువ్వులేని ఈ లోకంలో నేనెలా బ్రతుకుతాను." అంటూ లలిత శవాన్ని తడుముతూ హృదయవిదారకంగా రోదించాడు రాజేష్.

సాయంత్రానికి లలిత అమ్మా నాన్నగారు అందరూ రావటం, లలిత శవం స్మశానంలో అగ్నికి ఆహుతి కావటం కూడా జరిగిపోయింది.

తనప్రాణంలో, ప్రాణమయిన తన లలిత శరీరం, తన కళ్ళముందే అగ్నికి ఆహుతి అయిపోతుంటే, చూస్తూ నిల్చున్న రాజేష్‌కు మతి చలించినట్టయింది.

అందరితో పాటు, స్మశానంనుంచి ఇంటికి వచ్చినా రాజేష్‌కు ఎటుచూసినా, రూపమే కనుపిస్తూ తనను రమ్మని

పిలుస్తున్నట్టుగా అనిపించింది. కళ్ళు మూసినా, కళ్ళు తెరిచినా లలిత రూపమే కళ్ళలో కదలాడింది. ఇంట్లో ఉండలేక స్కూటరుమీద రోడ్డుమీదకు వచ్చాడు.

తిరిగి, తిరిగి నర్సింగ్ హోము దగ్గరకు వచ్చాడు. అక్కడకు రాగానే, లలిత జ్ఞాపకాలతో అతని గుండె బ్రద్దలయింది. ఒక్కనిముషం కూడా అక్కడుండలేకపోయాడు. స్కూటర్ను స్పీడుగా డ్రైవ్ చేస్తూ రోడ్డుమీదకు వచ్చాడు.

"వస్తున్నా లలితా. ఇప్పటికే ఆలస్యం చేసాను. నేను వస్తానని నువ్వెంతగా ఎదురు చూస్తున్నావో, అక్కడ ఒంటరిగా నేను రాలేదని ఎంత బాధ పడుతున్నావో. ఇప్పుడే వస్తున్నా వచ్చి నిన్ను నా గుండెల్లో దాచుకుంటాను." అంటూ స్కూటర్ను ఎదురుగా వస్తున్న లారీకి గుద్దాడు. అంతే ఎగిరి రోడ్డుమీద పడ్డాడు. యాక్సిడెంట్ జరిగిన నిముషానే, రాజేష్ ప్రాణాలు లలితను వెతుక్కుంటూ అనంత వాయువుల్లో కలిసిపోయాయి.

సమాప్తం